

శ్రీ గురుశ్శరణమ్

ఆంధ్ర సారస్వతమునందలి

# అద్వైత తత్త్వకావ్యములు

పరిశోధన గ్రంథము

3వ సంపుటము



రచయిత:

డాక్టర్ సన్నిధానము రామతారక పరబ్రహ్మశాస్త్రి
ఎం.ఏ., (తెలుగు, సంస్కృతము) బి.ఇడి., పిహెచ్.డి.,

దీప్తి బుక్ హౌస్
మ్యూజియంరోడ్,
గవర్నరుపేట, విజయవాడ-520 002

# కృతజ్ఞత

శ్రీ గురుకృపాఫలమే యీ రచన. ఈ రచనకు, సంకల్పము, పోషణ, పరిసమాప్తి - అన్నియు, నిరంతర పరబ్రహ్మానుభూతితో నిత్యానందమున నోలలాడుచు, నన్నొకకంట కనిపెట్టి కంటిని రెప్ప వలె కాపాడుచుండిన మా సద్గురుదేవుల యవ్యాజ కరుణాప్రసార ఫలితముగానే జరిగినట్లు నే ననుక్షణము ప్రత్యక్ష ప్రమాణముగా ననుభవము నొందినవాడ నగుటచేత మొట్టమొదట శ్రీ గురుదేవులను నా హృదయమున నిలుపుకొని సవినయ భక్తిపూర్వక కృతజ్ఞతాభివందనములను సమర్పించుచున్నాను.

అద్వైత తత్త్వమునందు ఆదరాభిమానములు పెంపొందించు సంస్కారములు నాకు కలుగుటకు ముఖ్య కారకులైన నా పూజ్య జననీజనకులు శ్రీ మహాలక్ష్మి-శ్రీ సీతారామశాస్త్రులకు భక్తిపూర్వక ప్రణామము లర్పించుచున్నాను.

నా పరిశోధన విషయమునకు తగిన శమదమాదిగుణ సంపన్నులు, అద్వైత తత్త్వాభిమానులు, కావ్యతత్త్వజ్ఞులు, ప్రసిద్ధ వక్తలు, మేధావులు, విద్వాంసులునై, నా యీ రచనకు మార్గదర్శకులుగా వ్యవహరించి నన్ను కృతకృత్యుని జేసిన శ్రీమదాచార్యవర్యులు, బ్రహ్మశ్రీ దివాకర్ల వేంకటావధానిగారికి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

సంస్కృతాంధ్రములలో నాకు కలిగిన యత్కించి జ్ఞానమునకు ముఖ్యకారకులై, నాకు విద్యాగురువులైన మా పినతండ్రి

బ్రహ్మశ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారికిసందర్భమున, వారు నాకు సమకూర్చిన సాధనసామగ్రికి ప్రత్యేకముగా కృతజ్ఞతాభివందనములను సమర్పించుచున్నాను.

అద్వైత తత్త్వ మతిగహనమైనదగుటచే ఈ రచనాసందర్భమున పలువురు తత్త్వశాస్త్ర విద్వాంసులను సంప్రదించుట సంభవించినది. ఆ విద్వాంసులందరికిని, అందు ముఖ్యముగా మాకు బంధువులును, నాకీ విషయమువ పలుమారులు తమ యమూల్యకాలమును వ్యయపరచి అద్వైత తత్త్వశాస్త్రమునందలి యనేక ముఖ్య సూక్ష్మాంశములను విశదీకరించి సాహాయ్యము చేసినవారును అగు, "బ్రహ్మవిద్యాలంకార" బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకట్రామశాస్త్రిగారికిని నా కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

ఈ రచనకు వ్రాతప్రతులను సిద్ధము చేయుటకు అవసరమైన వస్తుసామగ్రి మొదలగు సర్వవిధములైన సాహాయ్యము నయాచితముగ నమకూర్చిన మన్మాన్య సుహృన్మండలి, శ్రీ మద్ది నాగేశ్వరరావు ప్రభృతులకు కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

ఈ గ్రంథమునకు, వ్రాతపత్రములను సిద్ధము చేయుటకు పలువురు మిత్రులు స్వయంసేవకులుగా వచ్చి యథాశక్తిగా వ్రాసిపెట్టిరి. వారందరికి హార్దవందనము లొనర్చుచున్నాను.

ఇందలి విషయసేకరణకు నేను పరిశీలించిన యముద్రిత గ్రంథములలో కొన్ని కాకినాడలోని ఆంధ్ర సాహిత్యపరిషద్గ్రంథాలయము నుండియు; కొన్ని మద్రాసు, తిరుపతి, విశ్వవిద్యాలయములందలి ప్రాచ్యలిఖిత గ్రంథాలయల నుండియు, కొన్ని తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయము నుండియు గ్రహింపబడినవి.

ముద్రిత గ్రంథములు ముఖ్యముగా, రాజమహేంద్రవరమునందలి గౌతమీ గ్రంథాలయమునుండియు; విజయవాడలోని రామమోహన రాయ ధర్మగ్రంథాలయము నుండియు, నెల్లూరులోని వర్ధమాన సమాజ గ్రంథాలయమునుండియు గ్రహింపబడినవి. నా కీ విషయమున సంపూర్ణ సహకారము నొసంగిన యా గ్రంథాలయాధికారులకు, అందలి యుద్యోగులకు నెంతయో కృతజ్ఞుడను.

తమ విశ్వవిద్యాలయమున నేను పరిశోధన చేయుట కంగీకరించి, కొంతకాల ముపకార వేతనము కూడ నిచ్చినట్టియు, పరిశోధించి రచించిన గ్రంథమును ముద్రించి ప్రచురించుట కనుమతి నిచ్చినట్టియు ఉస్మానియా విశ్వవిద్యాలయాధికారులకును, వారి అభిమతము ననుసరించి కొంతకాల ముపకార వేతన మొసగిన విశ్వవిద్యాలయార్థిక సహాయక సంఘము (యు. జి. సి.) వారికిని,

ఈ మహాయజ్ఞమున కింకను, పలురీతుల తమ సాహాయ్య సహకారములనందజేసిన సుజనులు, సోదర సోదరీమణులు పలువురున్నారు. వారందరికిని పేరుపేరున కృతజ్ఞత తెలుప సాధ్యము కాదు. "సమష్టి రీశః" అనెడి యద్వైతతత్త్వ శాస్త్ర వాక్యము ననుసరించి, యట్లు పలురూపముల సహాయపడిన పరమేశ్వరునకు, ఆ పరమేశ్వరుని ప్రత్యక్షరూప మగు శ్రీ గురుదేవులకును పునః పునః ప్రణామము లర్పించుచున్నాను.

- రచయిత.

# సహృదయభూమిక

ఏనాడో పాశ్చాత్య ప్రపంచము కనులు తెరువని కాలములో భరతభూమి అందించిన విశ్వమానవ సమాజైకతానమైన సందేశము అద్వైతము. ఈనాడు కనులు నులుముకొని భూతలమున ఘనీభవించిన భనులు చూచుకొని పాశ్చాత్య ప్రపంచము ప్రసాదించిన సందేశము సామ్యవాదము. అసలు ఆధి భౌతికమైన అద్వైతమే సామ్యవాదం. ఆధ్యాత్మికమైన సామ్యవాదమే అద్వైతము. ఈ అనంతకాల వ్యవధిలో ఈ సువిశాల ప్రపంచ పరిధిలో భిన్న భిన్న కాలములందు భిన్న భిన్న దేశములందు ప్రవృత్తమైన వివిధ సముదాత్త తాత్త్విక భావనా సర్వస్వమునందు అగ్రపీఠము అద్వైతముదే.

ఆ అద్వైత తత్త్వ ప్రబోధము నాశ్రయించి పరిఢవిల్లిన కావ్యములెన్నో ఆంధ్రసారస్వతమును అలంకరించినవి. వాని నన్నింటిని క్షోదక్షమమైన పరిశ్రమతో పరిశీలించి సప్రమాణముగా వాని స్వరూపమును నిరూపించి వానియందలి అద్వైత తత్త్వమును కావ్య తత్త్వమును విశదీకరించుటయన్న అది భగవద్దత్తమైన ప్రజ్ఞలో ఒక ధీమాన్యుడు చేయదగిన పనికాని సామాన్యుడు చేయ దగిన పనికాదు. ఆ పరమార్థము నంతటిని అంతః సన్నిధానము చేసుకొని పెద్దలు పెట్టిన పేరినన్వర్థము చేసికొన్నవారు మాసన్నిధానము రామతారక పరబ్రహ్మశాస్త్రిగారు. ఆయన వట్టిశాస్త్రి కాదు: ఆధ్యాత్మవిద్యా సరస్వతికి మేడ కట్టిన మేస్త్రి. ఆ విషయమై ప్రచలితములగుచున్న నానావిధాపోహ నవరోగములకు పలాస్త్రి — ఈ గ్రంథ మింత సర్వాంగ సుందరముగ రూపొందించుటకు మా శ్రీ హనుమత్ కాళీవరప్రసాద్ బాబూజీ యొక్క ఆశయము ఆశీర్వాదము లవియొక పెద్ద అండ. పవిత్రాశయముతో ఈ నా పల్కిన పలుకులు ఆయన కొరకు పూలదండ.

ఇతి శివమ్.

ఇట్లు,

శ్రీకాళీనగర్ } భగవాన్ బాబూజీ శ్రీపాదరేణువు. ఆస్థానకవి
14-4-1994 } (యస్వీ జోగారావు, M.A.PhD. Litt (Hony)

# విషయసూచిక

## విషయము

క్రమ సంఖ్య | పుటలు

క్రమ సంఖ్య

ఇ. యక్షగానము (వివేక విజయము)

ఈ నాటక రూపానువాదములు -2

17. వివేక సింధువు (పద్య కావ్యము)
18. —"— (ద్విపద కావ్యము)
19. జీవ బ్రహ్మైక్య సారమంజరి (ద్విపద)
20. శ్రీరామకృష్ణ పరమహంస చరిత్రము
21. పరమహంస భాగవతము
22. వివేకానందము
23 రామ గీత
24. శ్రీ రమణ గ్రంథమాల
25. శ్రీ రమణాభ్యుదయము
26. ఆంధ్ర రమణ గీత
28. స్వయం ప్రకాశ ప్రబోధము

—*—

విషయ సంగ్రహము : పశ్చిమ సముద్ర తీరమున పరశురామ దేవభాసిత కేరళభూమిలో 'నగ్రహారాపురి' యను నగరమున గోవిందశర్మ యను బ్రాహ్మణుడుండెను. అతని భార్య రుక్మిణి. వారికి సుశీల యను కుమార్తె యుండెను. సుశీల యొక్క భర్త వేదవ్రతుడు. అతడు విరాగియై తపమునకు బోయినపిదప సూర్యోపాసనాఫలముగ సుశీలకు శంకరు లావిర్భవించిరి.

ఒకనాటి తెల్లవారుజామున గోవిందశర్మ స్నానమునకై కోనేటికి బోవుచు, వెంటవచ్చిన శంకరు నొక చెట్టుక్రింద కూర్చుండబెట్టెను. ఆ సమీపమున నున్న దేవాలయమందలి యంబ శంకరునకు ప్రత్యక్షమై దివ్యశక్తిని, సకల విద్యలను నొసగెను.

ఒకనాడు శంకరుడు తల్లివెంట కోనేటికి స్నానమునకు పోవగా నందాతనిని మొసలి పట్టుకొని యాతడు మానసికముగ సన్న్యసించిన పిదప విడిచి పెట్టెను. అతనికి క్రమ సన్న్యాసమును నిటలాంబకు డొసగెను.

శంకరుడు సన్న్యసించిన పిదప దేశసంచారము చేయుచు, కంచి, చిదంబర క్షేత్రములను దర్శించెను.

చంద్రగుప్తుడను బ్రాహ్మణుడు సమాధిస్థితుడై యుండ రామగోపస్వామి యను రాజుయొక్క కుమార్తె యగు రుచిరాంగి యను నామె యాతనికి సపర్యచేసి పిదప నతని యనుగ్రహము వడసి యతనిని వివాహమాడెను. వారిరువురును శ్రీశైలయాత్ర చేసి యచ్చట నొక పర్వతముపై కొంతకాలము తపస్సు చేసినందున నా పర్వతమునకు చంద్రగుప్త పర్వత మనుపేరు ప్రసిద్ధమయ్యెను. అతడు కొంతకాలము రాజ్యమును పరిపాలించి వరరుచి, విక్రమార్క, భట్టి, భర్తృహరులను నలుగురు పుత్రులను గని వారికి రాజ్యమిచ్చి తానాత్మజ్ఞానాభిలాషియై తపంబునకు బోయి హిమవత్పర్వతముజేరి యచ్చట నొక గుహయందు గూఢ పాదయోగిని (గౌడపాదులు) జూచెను. గౌడపాదు లతని కుపదేశమిచ్చి గోవింద భగవత్పాదులను నామమిడిరి. శంకరులు హిమవత్పర్వతమున కేగినప్పుడు గౌడపాదులు దర్శనమిచ్చి "నీవు సర్వజ్ఞుడవు. నీ వెరుగనిది లేదు. అయినను యోగరహస్యములు కొన్ని తెలియదగును. శ్రీకృష్ణుడారహస్యములను దత్తాత్రేయమౌని కిచ్చెను. అతడు తన శిష్యుడగు మహేశ్వరానందుడను గోరక్షనాథున కిచ్చిన నతండు నాకు దెల్పెను. నేను గోవింద భగవత్పాదున కిచ్చి, నీకు దెలుపుమంటిని గాన నీవచటి కేగు" మని చెప్పెను. శంకరులు గోవింద భగవత్పాదులవద్ద నా రహస్యము లెరిగి వచ్చుచుండ నొక దివ్యతేజోవంతమైన స్త్రీ కనిపించెను. శంకరు లాదేవిని ధ్యానింప నామె యొకశక్తిగల మంత్రము

విషయ సంగ్రహము : పశ్చిమ సముద్ర తీరమున పరశురామ దేవభాసిత కేరళభూమిలో 'నగ్రహారాపుర' మను నగరమున గోవిందశర్మ యను బ్రాహ్మణు డుండెను. అతని భార్య రుక్మిణి. వారికి సుశీల యను కుమార్తె యుండెను. సుశీల యొక్క భర్త వేదవ్రతుడు. అతడు విరాగియై తపమునకు బోయినపిదప సూర్యోపాసనాఫలముగ సుశీలకు శంకరు లావిర్భవించిరి.

ఒకనాటి తెల్లవారుజామున గోవిందశర్మ స్నానమునకై కోనేటికి బోవుచు, వెంటవచ్చిన శంకరు నొక చెట్టుక్రింద కూర్చుండబెట్టెను. ఆ సమీపమున నున్న దేవాలయమందలి యంబ శంకరునకు ప్రత్యక్షమై దివ్యశక్తిని, సకల విద్యలను నొసగెను.

ఒకనాడు శంకరుడు తల్లివెంట కోనేటికి స్నానమునకు పోవగా నందాతనిని మొసలి పట్టుకొని యాతడు మానసికముగ సన్న్యసించిన పిదప విడిచిపెట్టెను. అతనికి క్రమ సన్న్యాసమును నిటలాంబకు డొసగెను.

శంకరుడు సన్న్యసించిన పిదప దేశసంచారము చేయుచు, కంచి, చిదంబర క్షేత్రములను దర్శించెను.

చంద్రగుప్తుడను బ్రాహ్మణుడు సమాధిస్థితుడై యుండ రామగోపస్వామి యను రాజుయొక్క కుమార్తె యగు రుచిరాంగి యను నామె యాతనికి సపర్యచేసి పిదప నతని యనుగ్రహము వడసి యతనిని వివాహమాడెను. వారిరువురును శ్రీశైలయాత్ర చేసి యచ్చట నొక పర్వతముపై కొంతకాలము తపస్సు చేసినందున నా పర్వతము నకు చంద్రగుప్త పర్వత మనుపేరు ప్రసిద్ధమయ్యెను. అతడు కొంతకాలము రాజ్య మును పరిపాలించి వరరుచి, విక్రమార్క, భట్టి, భర్తృహరులను నలుగురు పుత్రు లను గని వారికి రాజ్యమిచ్చి తానాత్మజ్ఞానాభిలాషియై తపంబునకు బోయి హిమవత్పర్వ తముజేరి యచ్చట నొక గుహయందు గూఢ పాదయోగిని (గౌడపాదులు) జూచెను. గౌడపాదు లతని కుపదేశమిచ్చి గోవింద భగవత్పాదులను నామమిడిరి. శంకరులు హిమవత్పర్వతమున కేగినప్పుడు గౌడపాదులు దర్శనమిచ్చి "నీవు సర్వజ్ఞుడవు. నీ వెరుగనిది లేదు. అయినను యోగరహస్యములు కొన్ని తెలియదగును. శ్రీకృష్ణు డారహస్యములను దత్తాత్రేయమౌని కిచ్చెను. అతడు తన శిష్యుడగు మహేశ్వరా నందుడను గోరక్షనాథున కిచ్చిన నతండు నాకు చెప్పెను. నేను గోవింద భగవ త్పాదున కిచ్చి, నీకు దెలుపుమంటిని గాన నీవచటికేగు" మని చెప్పెను. శంకరులు గోవింద భగవత్పాదులవద్ద నా రహస్యము లెరిగి వచ్చుచుండ నొక దివ్యతేజోవంత మైన స్త్రీ కనిపించెను. శంకరు లాదేవిని ధ్యానింప నామె యొకశక్తిగల మంత్రము

# ఆచార్య విజయము

## కర్త : ఆంధ్ర కాళిదాసు—ఆలూరి కుప్పన్న

ఈ గ్రంథకర్తయగు ఆలూరి కుప్పన్న పదునెనిమిదవ శతాబ్దిలో తంజాపూరును పాలించిన భోసల వంశజుడైన తులజా మహారాజు నాస్థానమున నుండినవాడు. ఆంధ్ర కాళిదాస బిరుదాంకితుడు, కాశ్యపసగోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు. ఇతని తల్లి దండ్రులు నరసమాంబా వేంకటేశ్వరులు. ఇతడు కస్తూరి రంగకవి శిష్యుడు.

ఇత డింతకు పూర్వము పంచనదీ స్థలీ పురాణమును తెనిగించెను. రామాయణ భాగవతములను యక్షగానములుగా రచించెను. పరమ భాగవతచరిత్రము, ఇందుమతీ పరిణయము, హరికథా సుధారసము మొదలగు గద్యపద్య కృతులను పెక్కింటిని రచించెను.

ఈ గ్రంథము అనంతానందగిరి విరచితమగు ఆచార్య విజయమను సంస్కృత గ్రంథమున కనువాదము. అనంతానందగిరి "శంకర విజయంబు సకల సమున్నతోన్నతరీతిసం చద్విశేష శబ్ద సందర్భముల సముజ్జ్వల విలాస గరిమమెరయ కవులు వొగడ" రచింపగా నా కథను తాను తెనిగింప బూనినట్లు గ్రంథావతారికలో కవి తెలిపియుండెను. తాను "శ్రీ నృసింహ పాదార్చన జనిత లస త్కవిత్వ చాతుర్య గుణాఢ్యు"డని చెప్పుకొనెను.

ఈ గ్రంథము డెబ్బదినాలుగు ప్రకరణములు కలిగి యారాశ్వాసములుగా నున్నది. ఇది నరసింహదేవున కంకితము.

విషయ సంగ్రహము: ప్రథమాశ్వాసమున, గ్రంథస్థ సంక్షేప కథా సూచనము, జగత్సృష్టి ప్రకారము, చాతుర్వర్ణ్యాచార తత్తద్దేవతా భజన పరిమాణము, చతుర్యుగాచార నిర్మాణ విధానము, అందు కలియుగ దౌష్ట్యానుకరణము, సకల జనులను కుత్సిత మతములతోను దుష్టలాంఛనములతోను మెలగుట గని సహింపక నారదుడు సత్యలోకమునకేగి చతుర్ముఖుని కెరిగింప నాతడు సపరివారుడై కైలాసమునకు జని శివుని ప్రార్థింప నాత డద్వైత మతస్థాపనార్థము శంకర నామమున భూలోకమున నవతరింప దలచినట్లు తెలుపుట. శంకరాచార్య జననము నను విషయము లున్నవి.

ద్వితీయాశ్వాసమున, నాచార్యుని మైదవయేట తజ్జనకుండు బ్రహ్మభావము

# ఆచార్య విజయము

## కర్త : ఆంధ్ర కాళిదాసు—ఆలూరి కుప్పన్న

ఈ గ్రంథకర్తయగు ఆలూరి కుప్పన్న పదునెనిమిదవ శతాబ్దిలో తంజా పూరును పాలించిన భోసల వంశజుడైన తులజా మహారాజు నాస్థానమున నుండిన వాడు. ఆంధ్ర కాళిదాస బిరుదాంకితుడు, కాశ్యపసగోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు. ఇతని తల్లి దండ్రులు నరసమాంబా వేంకటేశ్వరులు. ఇతడు కస్తూరి రంగకవి శిష్యుడు.

ఇత డింతకు పూర్వము పంచనదీ స్థలీ పురాణమును తెనిగించెను. రామాయణ భాగవతములను యక్షగానములుగా రచించెను. పరమ భాగవతచరిత్రము, ఇందుమతీ పరిణయము, హరికథా సుధారసము మొదలగు గద్యపద్య కృతులను పెక్కింటిని రచించెను.

ఈ గ్రంథము అనంతానందగిరి విరచితమగు ఆచార్య విజయమను సంస్కృత గ్రంథమున కనువాదము. అనంతానందగిరి "శంకర విజయంబు సకల సన్నుతోన్నతరీతిసం చద్విశేష శబ్ద సందర్భముల సముజ్జ్వల విలాస గరిమ మెరయ కవులు వొగడ" రచింపగా నా కథను తాను తెనిగింప బూనినట్లు గ్రంథావతారికలో కవి తెలిపియుండెను. తాను "శ్రీ నృసింహ పాదార్చన జనిత లస త్కవిత్వ చాతుర్య గుణాఢ్యు"డని చెప్పుకొనెను.

ఈ గ్రంథము డెబ్బది నాలుగు ప్రకరణములు కలిగి యారాశ్వాసములుగా నున్నది. ఇది నరసింహదేవున కంకితము.

విషయ సంగ్రహము: ప్రథమాశ్వాసమున, గ్రంథస్థ సంక్షేప కథా సూచనము, జగత్సృష్టి ప్రకారము, చాతుర్వర్ణ్యాచార తత్తద్దేవతా భజన పరిమాణము, చతుర్యుగాచార నిర్మాణ విధానము, అందు కలియుగ దౌష్ట్యానుకరణము, సకల జనులను కుత్సిత మతములతోను దుష్టలాంఛనములతోను మెలగుట గని సహింపక నారదుడు సత్యలోకమునకేగి చతుర్ముఖుని కెరిగింప నాతడు సపరివారుడై కైలాసమునకు జని శివుని ప్రార్థింప నాత డద్వైత మతస్థాపనార్థము శంకర నామమున భూలోకమున నవతరింప దలచినట్లు తెలుపుట. శంకరాచార్య జననము నను విషయము లున్నవి.

ద్వితీయాశ్వాసమున, నాచార్యుని మొదవయేట తజ్జనకుండు బ్రహ్మభావము

ఆరవ వ్యాఖ్యానమున, శంకర మండనమిశ్ర సంవాదము, ఉభయ భారతిని గెలుచుటకు కామశాస్త్ర రహస్యములు తెలియుటకై యాచార్యుడు పరకాయ ప్రవేశము చేయుట, శిష్యులుపదేశముగా చేసిన హెచ్చరికచే స్వకాయమున పునఃప్రవేశ మొనర్చి లక్ష్మీ నృసింహస్తుతి చేయుట, తామ్రపర్ణీతీర విప్రుల కద్వైత తత్త్వోపదేశము చేయుట, కంచి యందు కామాక్షిని ప్రతిష్ఠించి. శ్రీ చక్రమును నిర్మించి శివశక్త్యైక్య నిరూపణము చేయుట, అనంతానందగిరి ప్రముఖు లాచార్యునకు ప్రణమిల్లి తమకు మోక్షమార్గ ముపదేశింప ప్రార్థింప నా గురుడు జీవేశైక్య భావముచే ముక్తి బడయుడని యుపదేశించుట, కలియుగమున జను లద్వైతవిద్య నధికరింపజాలరని తలచి, యుపాసనా రూపమైన షణ్మతముల ప్రబోధింపదలచి, శైవ, వైష్ణవ, సౌరగాణాపత్యాంబికా కాపాలికములను షణ్మతములను ప్రచారము చేయుటకు పరమత కాలానల, హస్తామలక, దివాకర, గిరిజాకుమార, త్రిపురకుమార, వటుకనాథుల కనుజ్ఞ నొసగుట, ఆచార్యుడు కాంచీపురమున స్వరూపనిష్ఠుడై భౌతిక కాయమును విసర్జించుట మొదలగు విషయము లున్నవి.

ఇందాచార్యుల జీవిత చరిత్ర కథకంటె విశేషముగా నద్వైత తత్త్వ బోధయు, పరమత ఖండనములు గలవు. ఈ గ్రంథ మద్వైత తత్త్వవ్యాప్తి నుద్దేశించి వ్రాయబడినట్లున్నది. అందుచేతనే కాబోలు నవకాశమున్నచోట నెల్ల అద్వైత ప్రశంస చేయబడినది.

ప్రథమాశ్వాసమున, ప్రజల ప్రవర్తనమునుగని ఖిన్నుడైన నారదుడు బ్రహ్మతో విన్నవించు సందర్భమున నిట్లనెను-

"కం॥ నిరుపాధికముగ నిర్గుణ। పరతన్ వెలుగొందునట్టి బ్రహ్మ ముపాస్యం
బరయ ముముక్షుల కెల్లను। నిరతము నూహించి చూడ నిశ్చయ గరిమన్॥

గీ॥ అట్టి యద్వైత సిద్ధాంత మరయలేక
భ్రాంతిని నిఖిలదేవతాభజన లెపుడు
నెరపుచును పెక్కువేషముల్ బరగగాను
మహిజనులు సంచరించుట మాయ యొక్కొ॥"

బ్రహ్మ శివునిగూర్చి చేసిన స్తుతియు శివుడు బ్రహ్మకిచ్చిన ప్రత్యుత్తరమును నద్వైత తత్త్వ పూర్ణములే.

కం॥ ప్రణవము నేనయ్యును త। త్ప్రణవాతీతుండ నగుచు బరగుదు గానన్
ననుపర మాద్వైతుం డని। గని గొలువుము నీవు సర్వకాలములందున్॥

ఆరవ యుల్లాసమున, శంకర మండనమిశ్ర సంవాదము, ఉభయ భారతిని గెలుచుటకు కామశాస్త్ర రహస్యములు తెలియుటకై యాచార్యుడు పరకాయ ప్రవేశము చేయుట, శిష్యులుపదేశముగా చేసిన హెచ్చరికచే స్వకాయమున పునఃప్రవేశ మొనర్చి లక్ష్మీ నృసింహస్తుతి చేయుట, తామ్రపర్ణీతీర విప్రుల కద్వైత తత్త్వోపదేశము చేయుట, కంచి యందు కామాక్షిని ప్రతిష్ఠించి. శ్రీ చక్రమును నిర్మించి శివశక్త్యైక్య నిరూపణము చేయుట, అనంతానందగిరి ప్రముఖు లాచార్యుపకు ప్రణమిల్లి తమకు మోక్షమార్గ ముపదేశింప ప్రార్థింప నా గురుడు జీవేశైక్య భావముచే ముక్తి లభించునని యుపదేశించుట, కలియుగమున జను లద్వైతవిద్య నధికరింపజాలరని తలచి, యుపాసనా రూపమైన షణ్మతముల ప్రబోధింపదలచి, శైవ, వైష్ణవ, సౌరగాణాపత్యాంబికా కాపాలికములను షణ్మతములను ప్రచారము చేయుటకు పరమత కోలాహల, హస్తామలక, దివాకర, గిరిజాకుమార, త్రిపురకుమార, వటుకనాథుల కనుజ్ఞ నొసగుట, ఆచార్యుడు కాంచీపురమున స్వరూపనిష్ఠుడై భౌతిక కాయమును విసర్జించుట మొదలగు విషయము లున్నవి.

ఇందాచార్యుల జీవిత చరిత్ర కథకంటె విశేషముగా నద్వైత తత్త్వ బోధయు, పరమత ఖండనములు గలవు. ఈ గ్రంథ మద్వైత తత్త్వవ్యాప్తి నుద్దేశించి వ్రాయబడినట్లున్నది. అందుచేతనే కాబోలు నవకాశమున్నచోట నెల్ల అద్వైత ప్రశంస చేయబడినది.

ప్రథమోల్లాసమున, ప్రజల ప్రవర్తనమునుగని ఖిన్నుడైన నారదుడు బ్రహ్మతో విన్నవించు సందర్భమున నిట్లనెను-

"కం॥ నిరుపాధికముగ నిర్గుణ। పరతన్ వెలుగొందునట్టి బ్రహ్మ ముపాస్యం
బరయ ముముక్షుల కెల్లను। నిరతము నూహించి చూడ నిశ్చయ గరిమన్॥

గీ॥ అట్టి యద్వైత సిద్ధాంత మరయలేక
భ్రాంతిని నిఖిలదేవతాభజన లెపుడు
నెరపుటను వెఱ్ఱివేషముల్ బరగగాను
మహిజనులు సంచరింపుట మాయ యొక్కొ॥"

బ్రహ్మ శివునిగూర్చి చేసిన స్తుతియు శివుడు బ్రహ్మకిచ్చిన ప్రత్యుత్తరమును నద్వైత తత్త్వ పూర్ణములే.

కం॥ ప్రణవము నేనయ్యును త। త్ప్రణవాతీతుండ నగుచు బరగుదు గానన్
వనుపర మాద్వైతుం డని। గని గొలువుము నీవు సర్వకాలములందున్॥

ఇచ్చట నద్వైత తత్త్వవిశిష్టతను వివరించుచు నొక సుదీర్ఘమైన(రెండుపుటలు) గద్యమున్నది.

ఇట్లు గ్రంథారంభము నుండి తుదివరకు నద్వైత తత్త్వ ప్రసక్తియుప్రశస్తియు నోతప్రోతముగా కనుపించును.

ఆశ్వాసాంత గద్యములందు గ్రంథకర్త "ఆచార్య విజయం"బను మహాపురాణంబు నందు నని యీ గ్రంథమును మహాపురాణముగ పేర్కొని యుండెను గాని యిందు "సర్గశ్చ, ప్రతిసర్గశ్చ, వంశోమన్వంతరాణిచ । వంశాను చరితం చేతి పురాణం పంచలక్షణ"మ్మను పురాణ నిర్వచనమున కనుగుణమైన విషయము లేక యొక మహాపురుషుని సంగ్రహ జీవిత చరిత్రయు నతని జీవిత సారభూతమైన యద్వైత తత్త్వ విషయములు మాత్రమున్నవి. అంశవిభజనము ప్రకరణములుగాను, కావ్యములలో వలెనే యాశ్వాసాంత పద్యములు మాలిన్యాది వృత్తములలోను నున్నవి.

ఇందలి శైలి సరళమై ద్రాక్షాపాకమున నున్నది. భాష సలక్షణమై సుబోధముగా నున్నది.

కవిత ధారాశుద్ధిగలిగి ప్రసాదగుణ భరితమై యున్నది. బ్రహ్మ దేవుడు శివుని స్తుతించు సందర్భమున నొక సంస్కృత పూర్ణకందము రచింపబడినది. అందు చివరి సంబోధనము మాత్రమే తత్సమము.

కం॥ శరణం భజామి శివ తవ । చరణం నాన్యం ప్రజామి సర్వజ్ఞ దయాం
కురు మయి గౌరీవల్లభ । పరమేశ్వర దురితదూర ప్రణతార్తి హరా ॥

ప్రథమాశ్వాసాంతమున నొక నిరోష్ఠ్య కందమున్నది.

పంచమాశ్వాసమున, కాశికాపుర వర్ణనమున నొక సుదీర్ఘ సంస్కృత సమాస భూయిష్ఠ వచనము రెండున్నర పుట లున్నది.

షష్ఠాశ్వాసమున, శంకరులు పరకాయ ప్రవేశముచేసి రాజు శరీరమున ప్రవేశించి రాణులతో సలుపుచున్న కేళీవర్ణనమున నొక ముక్తపదగ్రస్త సీసము రచింపబడినది.

రచనలో సాధారణముగా వాడబడు మత్తేభ శార్దూలాది వృత్తములేకాక ఇంద్రవజ్ర, భుజంగప్రయాత, పృథ్వీ తరళాది సంస్కృత వృత్తము లుపయోగింపబడినవి.

ఇతనికి గల యాంధ్రకాళిదాసను బిరుదము సార్థకమని నిరూపించుటకు తగిన యాధారములిందు తగినన్ని కానరాకున్నను, నితడు మెచ్చుకొనదగిన విద్వత్కవి యనియు, శాస్త్రపాండిత్యము పుష్కలముగా కలవాడనియు నిగూఢమైన తత్త్వ విష

ఇచ్చట నద్వైత తత్త్వవిశిష్టతను వివరించుచు నొక సుదీర్ఘమైన(రెండుపుటలు) గద్యమున్నది.

ఇట్లు గ్రంథారంభము నుండి తుదివరకు నద్వైత తత్త్వ ప్రసక్తియుప్రశస్తియు నోతప్రోతముగా కనుపించును.

ఆశ్వాసాంత గద్యములందీ గ్రంథకర్త "ఆచార్య విజయం"బను మహాపురాణంబు నందు నవి యీ గ్రంథమును మహాపురాణముగ పేర్కొని యుండెను గాని యిందు "సర్గశ్చ, ప్రతిసర్గశ్చ, వంశోమన్వంత రాణిచ। వంశాను చరితం చేతి పురాణం పంచలక్షణ"మ్మను పురాణ నిర్వచనమున కనుగుణమైన విషయము లేక యొక మహాపురుషుని సంగ్రహ జీవిత చరిత్రయు నతని జీవిత సారభూతమైన యద్వైత తత్త్వ విషయములు మాత్రమున్నవి. అంశవిభజనము ప్రకరణములుగాను, కావ్యములలో వలెనే యాశ్వాసాంత పద్యములు మాలిన్యాది వృత్తములలోను నున్నవి.

ఇందలి శైలి సరళమై ద్రాక్షాపాకమున నున్నది. భాష సలక్షణమై సుబోధముగా నున్నది.

కవిత ధారాశుద్ధిగలిగి ప్రసాదగుణ భరితమై యున్నది. బ్రహ్మ దేవుడు శివుని స్తుతించు సందర్భమున నొక సంస్కృత పూర్ణకందము రచింపబడినది. అందు చివరి సంబోధనము మాత్రమే తత్సమము.

కం॥ శరణం భజామి శివ తవ। చరణం నాన్యం ప్రజామి సర్వజ్ఞ దయాం
కురు మయి గౌరీవల్లభ। పరమేశ్వర దురితదూర ప్రణతార్తి హరా॥

ప్రథమాశ్వాసాంతమున నొక నిరోష్ఠ్య కందమున్నది.

పంచమాశ్వాసమున, కాశికాపుర వర్ణనమున నొక సుదీర్ఘ సంస్కృత సమాస భూయిష్ఠ వచనము రెండున్నర పుట లున్నది.

షష్ఠాశ్వాసమున, శంకరులు పరకాయ ప్రవేశముచేసి రాజు శరీరమున ప్రవేశించి కాంతలతో నలుపుచున్న కేళీవర్ణనమున నొక ముక్తపదగ్రస్త సీసము రచింపబడినది.

రచనలో సాధారణముగా వాడబడు మత్తేభ శార్దూలాది వృత్తములేకాక ఇంద్రవజ్ర, భుజంగప్రయాత, పృథ్వీ తరళాది సంస్కృత వృత్తము లుపయోగింపబడినవి.

ఇతనికి గల ఆంధ్రకాళిదాసను బిరుదము సార్థకమని నిరూపించుటకు తగిన యాధారములిందు తగినన్ని కానరాకున్నను, నితడు మెచ్చుకొనదగిన విద్వత్కవి యనియు, శాస్త్రపాండిత్యము పుష్కలముగా కలవాడనియు నిగూఢమైన తత్త్వ విష

చతుర్థాశ్వాసమున, శంకరుల బాల్యము, పితృవియోగము, గురుకులవాసము మొదలగు విషయము లున్నవి.

పంచమాశ్వాసమున, శంకరులు సన్న్యసించుట, గోవిందతీర్థుల శుశ్రూష చేయుట, వారి యానతిని కాశికేగుట, కాశిలో శంకర, చండాలరూప విశ్వేశ్వరులకు జరిగిన సంవాదము, శంకరులు బదరికావనమున కరిగి భాష్యాదులను రచించుట, సనందనుడను శిష్యుడు పద్మపాదుడగుట, శంకర భాష్యప్రాశస్త్యాభి వర్ణనము మొదలగు నంశములున్నవి.

షష్ఠాశ్వాసమున, వ్యాసుడు శంకరుని పరీక్షించి భాష్యరచనమును మెచ్చుట, శంకరులు కుమారిల భట్టును జయింప జనుట, కుమారిలుడు శంకరులను కొనియాడి మండనమిశ్రుని జయించు పని కల్పించుట మొదలగు నంశములున్నవి.

సప్తమాశ్వాసమున, శంకర మండనమిశ్ర సంవాదము, శంకరుల పరకాయ ప్రవేశము, ఉభయభారతి శంకరుల విజయమంగీకరించుట మొదలగునవి ముఖ్య విషయములు.

అష్టమాశ్వాసమున, హస్తామలక త్రోటకాచార్యుల వృత్తాంతములు, శృంగేరి యందు శారదా ప్రతిష్ఠ, శంకరుడు శిష్యులచే అద్వైతతత్త్వబోధక గ్రంథములను వ్రాయించుట, తల్లి కుత్తరక్రియలు చేయుట, పద్మపాదవిరచిత భాష్యటీకాగ్రంథ మతని మేనమామయొక్క దుర్మార్గముచే దగ్ధము గావింపబడగా నా గ్రంథమంతయు శంకరులు చెప్పి మరల వ్రాయించుట, మొదలగు విషయములున్నవి.

నవమాశ్వాసమున నాచార్యులవారు వివిధ మతస్థులనోడించి వారి నద్వైతతత్త్వ మార్గాను వర్తనులనుగా చేయుట వివరింప బడినది.

దశమాశ్వాసమున, శంకరుల కభినవ గుప్తుడు చేసిన ప్రయోగమువలన భగందర రోగబాధ కలుగగా దానిని పద్మపాదుడు నివృత్తిచేయుట. శంకరులకు గౌడపాదులు దర్శనమిచ్చి భాష్యరచనకు మెచ్చుట. శంకరులు కాశ్మీరమున సర్వజ్ఞ శారదా సింహాసన మధిష్ఠించుట. బదరీ కేదారక్షేత్రములలో నుష్ణకుండముల సృష్టించుట, సకల దేవతా ప్రార్థితులై కైలాసమునకేగుట యను విషయములు వివరింప బడినవి.

ఇందద్వైత తత్త్వప్రసక్తి యెడనెడ గోచరించుచునే యుండును. రెండు మూడుదాహరణము లిందు పొందుపరుప బడుచున్నవి.

1. (పంచమాశ్వాసమున) తన శిష్యత్వ మర్థించి వచ్చిన శంకరులను జూచి గోవింద యోగీంద్రులు, "వత్సా! నీవెవ్వడ?" వనియడుగ శంకరులు సవినయముగ విట్లనిరి-

చతుర్థాశ్వాసమున, శంకరుల బాల్యము, పితృవియోగము, గురుకులవాసము మొదలగు విషయము లున్నవి.

పంచమాశ్వాసమున, శంకరులు సన్న్యసించుట, గోవిందతీర్థుల శుశ్రూష చేయుట, వారి యానతిని కాశికేగుట, కాశిలో శంకర, చండాలరూప విశ్వేశ్వరులకు జరిగిన సంవాదము, శంకరులు బదరికాననమున కరిగి భాష్యాదులను రచించుట, సనందనునను శిష్యుడు పద్మపాదుడగుట, శంకర భాష్యప్రాశస్త్యాభి వర్ణనము మొదలగు నంశములున్నవి.

షష్ఠాశ్వాసమున, వ్యాసుడు శంకరుని పరీక్షించి భాష్యరచనమును మెచ్చుట, శంకరులు కుమారిల భట్టును జయింప జనుట, కుమారిలుడు శంకరులను కొనియాడి మండనమిశ్రుని జయించు పని కల్పించుట మొదలగు నంశములున్నవి.

సప్తమాశ్వాసమున, శంకర మండనమిశ్ర సంవాదము, శంకరుల పరకాయ ప్రవేశము, ఉభయభారతి శంకరుల విజయమంగీకరించుట మొదలగునవి ముఖ్య విషయములు.

అష్టమాశ్వాసమున, హస్తామలక త్రోటకాచార్యుల వృత్తాంతములు, శృంగేరి యందు శారదా ప్రతిష్ఠ, శంకరుడు శిష్యులచే అద్వైతతత్త్వబోధక గ్రంథములను వ్రాయించుట, తల్లి కుత్తరక్రియలు చేయుట, పద్మపాదవిరచిత భాష్యటీకాగ్రంథ మతని మేనమామ యొక్క దుర్మార్గముచే దగ్ధము గావింపబడగా నా గ్రంథమంతయు శంకరులు చెప్పి మరల వ్రాయించుట, మొదలగు విషయములున్నవి.

నవమాశ్వాసమున నాచార్యులవారు వివిధ మతస్థులనోడించి వారి నద్వైత తత్త్వ మార్గాను వర్తనులనుగా చేయుట వివరింప బడినది.

దశమాశ్వాసమున, శంకరుల కభినవ గుప్తుడు చేసిన ప్రయోగమువలన భగందర రోగబాధ కలుగగా దానిని పద్మపాదుడు నివృత్తిచేయుట. శంకరులకు గౌడపాదులు దర్శనమిచ్చి భాష్యరచనకు మెచ్చుట. శంకరులు కాశ్మీరమున సర్వజ్ఞ శారదా సింహాసన మధిష్ఠించుట. బదరీ కేదారక్షేత్రములలో నుష్ణగుండముల సృష్టించుట, సకల దేవతా ప్రార్థితులై కైలాసమునకేగుట యను విషయములు వివరింప బడినవి.

ఇందద్వైత తత్త్వప్రసక్తి యెడనెడ గోచరించుచునే యుండును. రెండు మూడుదాహరణము లిందు పొందుపరుప బడుచున్నవి.

1. (పంచమాశ్వాసమున) తన శిష్యత్వ మర్థించి వచ్చిన శంకరులను జూచి గోవింద యోగీంద్రులు, "వత్సా! నీవెవ్వడ?" వనియడుగ శంకరులు సవినయముగ నిట్లనిరి-

నచ్చు తెనుంగులం గూర్చిన పద్యములు కానుపించును. సంస్కృత పదప్రయోగ బహుళమై యున్నందున నొక్కొక్కతరి నారికేళపాక మనిపించినను, పలుతావుల మృదుమధుర పద గుంభితమై ద్రాక్షపాక స్ఫోరకములగు సముచిత వృత్తరీతుల నలరారు పద్యములున్నవి. ఇట్టి ప్రాచీన కవితాశయ్య పట్టుబడిన యీతనికి భాషాంత రీకరణమున గలిగిన నేర్పును, గొన్ని యెడల పెంచి వన్నె తేజాలిన విధంబును తెలుపుట కనేకోదాహరణములు జూపవచ్చును. మూలమున నుపయోగింపబడిన యువ మోత్ప్రేక్షాక్షేప దృష్టాంత నిదర్శనా ద్యలంకారము లనువాదమునందును చక్కగా ప్రయోగింపబడినవి. మరియు నదీనదుల వర్ణనములు, నందందు నానార్థ సంశ్రయం బగు శ్లేషపొందుపరచిన రీతియు, శ్లేషకుదేర్పడిన రామ రాజ భూషణుని శ్లిష్టరూప కోల్లేఖాంగాంగి భావసంకర విలసిత పురవర్ణనమును మదికిదెచ్చున వగును.

శాంతరస ప్రధానమై వైదర్భీరీతిని విరాజిల్లు నీ కావ్యమున తత్తద్రసము లొప్పించిన చొప్పును, కైశిక్యాది వృత్తుల నోజః ప్రసాద సుకుమారతార్థ వ్యక్త్యు దారత్వాది కావ్యగుణంబులును నెడనెడ స్ఫుటముగ గోచరించును. మరియు దిగ్విజ యానంతర సకలేశ స్తుతి యందును, అవతార పరిసమాప్తికగు విబుధాగ్ర్య కర్తృక శంకర స్తవమునను, తనకు గలిగిన చిత్రబంధ, గర్భ, కవితా చమత్కృతి యందలి నేర్పొకింత ప్రదర్శించినాడు.

అఖండయతి, ప్రత్యాప్రాసము వాడబడినవి. సమస్తపదములు వ్యస్తపదములు, పాదపూరణార్థము తాదుహూటుగా నుపయోగించిన యుదాహరణము లచ్చటచ్చట గనుపట్టును.

మొత్తముమీద నీకృతి తన్నాయక గుణగణ చరితాభివర్ణనమున కనువైన శయ్యాపాక వృత్త్యలంకారాది బంధురంబును, చ్యుత సంస్కారాది దోషబహుళంబు గాక, రససింధువై, సహృదయ హృదయాహ్లాద సంధాయకంబు కానోపు ననుటకు సందియము లేదు."

ఇందలి కవితా చమత్కృతిగల పద్యములు :— శ్రీ శంకర సంయామి సార్వభౌముని కైలాసమునకు రమ్మని బిలువ సురలువచ్చి నుతించు సందర్భమున రచితమైన

సకంద మత్తకోకిలా వృత్తాంచత్సీసము :-

సీ॥ దీనపోషణ వామదేవ సుధీమనో । జలజంబునం+దనిశంబు నీవు
మానుగా వసియించి సూర్తశ సమూజము । స్మృప తోడుత+న్వేత నిల్పనెగడి

నచ్చ తెనుంగులం గూర్చిన పద్యములు కానుపించును. సంస్కృత పదప్రయోగ బహుళమై యున్నందున నొకొక్కతరి నారికేళపాక మనిపించినను, పలుతావుల మృదుమధుర పద గుంఫితమై ద్రాక్షపాక స్ఫోరకములగు సముచిత వృత్తరీతుల నలరారు పద్యములున్నవి. ఇట్టి ప్రాచీన కవితాశయ్య పట్టుబడిన యీతనికి భాషాంతరీకరణమున గలిగిన నేర్పును, గొన్ని యెడలపెంచి వన్నెతేజాలిన విధంబును తెలుపుట కనేకోదాహరణములు జూపవచ్చును. మూలమున నుపయోగింపబడిన యువమోత్ప్రేక్షాక్షేప దృష్టాంత నిదర్శనా ద్యలంకారము లనువాదమునందును చక్కగా ప్రయోగింపబడినవి. మరియు సమూల వర్ణనములు, నందందు నానార్థ సంశ్రయం బగు శ్లేషపొందుపరచిన రీతియు, శ్లేషకుపేర్వడిన రామ రాజ భూషణుని శ్లిష్టరూపకోల్లేఖాంగాంగీ భావసంకర విలసిత పురవర్ణనమును మదికిదెచ్చున వగును.

శాంతరస ప్రధానమై వైదర్భీరీతిని విరాజిల్లు నీ కావ్యమున తత్తద్రసము లొప్పించిన చొప్పును, కైశిక్యాది వృత్తుల నోజః ప్రసాద సుకుమారతార్థ వ్యక్త్యుదారత్వాది కావ్యగుణంబులును నెడనెడ స్ఫుటముగ గోచరింపును. మరియు దిగ్విజయానంతర సకలేశ స్తుతి యందును, అవతార పరిసమాప్తికగు విబుధాగ్ర్య కర్తృక శంకర స్తవమునను, తనకు గలిగిన చిత్రబంధ, గర్భ, కవితా చమత్కృతి యందలి నేర్పొకింత ప్రదర్శించినాడు.

అఖండయతి, ప్రాసయతి, ద్విప్రాసము వాడబడినవి. సమస్తపదములు వ్యస్తపదములు, పాదపూరణార్థము తారుమారుగా నుపయోగించిన యుదాహరణము అచ్చటచ్చట గనుపట్టును.

మొత్తముమీద నీకృతి తన్నాయక గుణగణ చరితాభివర్ణనమున కనువైన శయ్యాపాక వృత్త్యలంకారాది బంధురంబయి, చ్యుత సంస్కారాది దోషబహుళంబు కాక, రసనింపమై, సహృదయ హృదయాహ్లాద సంధాయకంబు కానోపు ననుటకు సందియము లేదు.”

ఇందలి కవితా చమత్కృతిగల పద్యములు :— శ్రీ శంకర సంయామి సార్వభౌముని కైలాసమునకు రమ్మని బిలువ సురలువచ్చి నుతించు సందర్భమున రచితమైన

సకంద మత్తకోకిలా వృత్తాంచత్సీసము :-

సీ॥ దీనపోషణ వామదేవ సుధీమనో । జలజంబునం+దనిశంబు నీవు

మానుగా వసియించి మర్త్య సమాజము । నృప బ్రోడుత+న్వేత నిల్పనెగడి

కం॥ వేదచయ ముఖ్య ధవ్యద । పాదవనజ సకలలోక ప పరశివాహ్వా
మోద పరిపూర్ణ భాసుర । నాద నిరత మౌనినిచయ నయ పరిపాలా ॥

గోపురబంధ కందము :-

శ్రీశ । సమర్పిత కరుణా । రాశీ । నీలలిత పదపరాగ వరుడనై । క్లేశముల బాపికొనుటకు । గాశతే ర్చద్రియమునను దగంగొల్తు నినున్ ॥

(నడిమిని శ్రీసకలవ, ౯ని అని తెలును)

షడక్షరకందము :- పరమ దయాకర ! దమిపా । దర ! దామోదరవ ! పారదప్రియ రూపా । కరిగోపరమ కరా ! మో । దరమాపర ! పరపుమయ్య, దయదమి మాపై ॥

పంచాక్షరకందము :- మము మనుపుమయ్య యోసం । యమిపా ! పావ మను మాసి యనయము నిన్నే । సుమి నమ్మినాము మాపై । నమయము నీ నెమ్మి మోపి సాయము సేయన్ ॥

చతురక్షరకందములు :- నెమ్మనమున నినునమ్మిన । మమ్మున్నెమ్మిదగ నోముమా ! మనగనునీ । మమ్మున నీనామమునే । నిమ్మగు మోదమ్ముగదుమ నేమ నెదముగా.

త్ర్యక్షరకందము :- మాయామయ నిన్నేమన । నోయయ్యాయోము మనిన మానిన నెమ్మిన్ । నాయమ్మా మన్నోమన । మేయా ! వీ యానమాన మేయన యమ్మున్.

కృతిపతి నామగర్భిత రథబంధ సీసము :- (ఇది 17 గదుల చౌకము)

సీ॥ శ్రీద ! సఖ ! యలుక జేయకు మేనులే : శమునే నెఱుంగ విశ్వమున మంచి
వమల కృపా రసాఖ్యములైన చూపుల । నర్మిలి దేవ నాయందు గొల్చి
ధరధన్య జేయు దేవర నీ వెయని నమ్మి : నీదరి జేరితి నిర్విశంక
ధీతిని గడపి యోపిక నిచ్చి యకలంక : మతిగూర్చి యోముమో సతతము
నను ॥

గీ॥ రహి మనెద నిన్ను గొలుమహా రవి విధూడు
గణము నింద్రాబ్జజ హరి సంగణితకాయ
జారిహారుణ్యముద్ర శర్వాగొనమ్మ
లెల్ల కాలము నీదయ నుల్ల సిల్ల ॥

గ్రంథకర్తృనామ గర్భిగ రథబంధకందము. ఇది 9 గదుల చౌకము - మూడవ పాలున నుపపద్యము.

కం॥ వేదచయ ముఖ్య భవ్యద । పాదవనజ సకలలోక ప పరశివాహ్వా
మోద పరిపూర్ణ భాసుర । నాద నిరత మౌనినిచయ నయ పరిపాలా ॥

గోపురబంధ కందము :-

శ్రీశ । సమర్పిత కరుణా । రాశి । నీలలిత పదపరాగ వరుడనై । క్లేశముల
బాపికొనుటకు । గాశతె రుద్రియమునను దగంగొల్తు నినున్ ॥

(నడిమిని శ్రీసకలవ, రౌని అని తెలుసు)

షడక్షరకందము :- పరమ దయాకర ! దమిపా । దర ! దామోదరవ !
పారదప్రియ రూపా । కరిసోపరమ కరా ! మా । దరమాపర ! పరపుమయ్య,
దయదమి మాపై ॥

పంచాక్షరకందము :- మము మనుపుమయ్య యోనం । యమిపా ! పాప
మును మాపి యనయము నిన్నే । సుమి నమ్మినాము మాపై । సమయము నీ నెమ్మి
మోపి సాయము సేయన్ ॥

చతురక్షరకందములు :- నెమ్మనమున నినునమ్మిన । మమ్మున్నెమ్మిదగ
నోముసా ! మనగనునీ । మమ్మున నీనామమునే । నిమ్మగు మోదమ్ముగదుమ నేమ
నెదముగా.

త్ర్యక్షరకందము :- మాయామయ నిన్నేమన । నోయయ్యాయోము మనిన
నూనిన నెమ్మిన్ । నాయయ్యా మన్నోమన । మేయా ! నీ యానసూన మేయన
యమ్మున్.

కృతిపతి నామగర్భిత రథబంధ సీసము :- (ఇది 17 గదుల చౌకము)

సీ॥ శ్రీద ! సఖ ! యలుక జేయకు మేనులే ; శమునే నెఱుంగ విశ్వమున మంచి
నమల కృపా రసాఢ్యములైన చూపుల । నర్మిలి దేవ నాయందు గొల్చి
భరధన్య జేయు దేవర నీ వెయని నమ్మి ; నీదరి జేరితి నిర్విశంక
ఫతిని గడపి యోపిక నిచ్చి యకలంక ; మతిగూర్చి యోముమా సతతము
నను ॥

గీ॥ రహి మనెద నిన్ను గొలుమహా రవి విధూడు
గణము నింద్రాబ్జజ హరి సంగణితకాయ
జారికారుణ్యముద్ర భవ్యాగొనమ్మ
లెల్ల కాలము నీదయ నుల్ల సిల్ల ॥

గ్రంథకర్తృనామ గర్భిత రథబంధకందము. ఇది 9 గదుల చౌకము -
మూడవ పాలున సుపపథము.

ఈ గ్రంథము 1948 వ సంవత్సరమున వెంకట్రామా అండ్ కంపెనీ వారిచే ప్రచురితమైనది. ఇంత కిరువది సంవత్సరములకు పూర్వము ఈ కవి 'చిద్విలాస కృత శంకరవిజయవిలాస'మను గ్రంథమననువదించ దలచి రెండాశ్వాసముల నాంధ్రీకరించినట్లును, పిదప దానిని విడిచి మాధవ విద్యారణ్యకృత శంకరవిజయమున కనుసరించి వాదముగా నీ గ్రంథమును రచించినట్లును, గ్రంథకర్త గ్రంథాదియందు తెలిపియుండెను. ఈ రచనయును పూర్తిగా మక్కీకి మక్కీగా చేయబడిన యనువాదము కాదు. కొంతభాగము మాత్రమే యథామూలముగ ననువదింపబడినది. కొన్ని తావుల మూలాతిక్రమణముగా కొన్ని మార్పులు చేయబడినవి.

మూలమున దేవతలు కైలాసమున కేగి ధర్మరక్షణకై శివుని వేడుకొనగా నా మహాదేవుడు శంకరాభిఖ్యతో 'కాలటి' యం దుద్భవించి ధర్మము నుద్ధరింతునని చెప్పిన ఘట్టమిందు విడువబడి, 'కాలటి' యనెడి యగ్రహారమునగల శివగురుడనెడి బ్రాహ్మణుడు శివునిగూర్చి తపము చేయగా నా శివుని యనుగ్రహమున నుద్భవించినట్లు మాత్రము చెప్పబడినది. శంకరు లీశ్వరావతారమని ముందుగా తెలియజేయక క్రమముగా పఠితలు తన్మహిమనెరిగి శంకరులు సాక్షాచ్ఛంకరులే యని గ్రహింపగలుగుటకై చేయబడిన యీ మార్పు మిక్కిలి యుచితముగా నున్నది.

మూలమున శంకరుల జనకుడగు శివగురుని తపమునకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై 'ఆయుష్యంతులను,గుణహీనులననగు పుత్రులు పెక్కండ్రు కావలెనా? అల్పాయుష్కుడును, సుగుణరాశియు నగు నొక్కపుత్రుడు కావలెనా' యని యడిగినట్లును, శివగురుడు, స్వల్పాయుష్మంతుడైనను సుగుణవంతుడైన పుత్రుడే కావలెనని కోరినట్లును గలదు. ఇందు శివగురువునకు శివుడు స్వప్నమున సాక్షాత్కరించి యొక మాతఫల మిచ్చినట్లును దానినతడు చేతబుచ్చుకొనియుండగా నది క్రిందబడి రసముకారి నలువంకలను ప్రవహించినట్లును చెప్పబడినది. దీనివలన శివగురుడు తన కుమారుని తన యింటనుంచుకొన వీలుకాదనియు, నతడు గృహము విడిచి లోకోపకారియైన దనసొందలి యద్వైత తత్త్వజ్ఞానరసమును నలుదిక్కులకు ప్రవహింప జేయగలవాడనియు సూచింపబడినట్లయినది.

శివగురుడు మరణించినప్పుడు దుఃఖించుచున్న తల్లికి శైశవ స్థితిలోనున్న శంకరులు వైరాగ్య మువదేశించినట్లు ఇందు చెప్పబడినది. ఈ విషయము మూలమున లేదు. దీనివలన శంకరులు సహజజ్ఞాన వైరాగ్య సంపన్నులని స్పష్టముగా పఠితలకు బోధపడును గాన నిదియొక యుచితమైన కల్పన.

విద్యాభ్యాస కాలమున భిక్ష కేగినపుడు తన కామలకమును భిక్షగా నొసగిన

ఈ గ్రంథము 1948 వ సంవత్సరమున వెంకట్రామా అండ్ కంపెనీ వారిచే ప్రచురితమైనది. ఇంత కిరువది సంవత్సరములకు పూర్వము ఈ కవి 'చిద్విలాస కృత శంకరవిజయవిలాస'మను గ్రంథముననువదించ దలచి రెండాశ్వాసముల నాంధ్రీక నట్లును, పిదప దానిని విడిచి మాధవ విద్యారణ్యకృత శంకరవిజయమున కను రించి వాదముగా నీ గ్రంథమును రచించినట్లును, గ్రంథకర్త గ్రంథాదియందు తెలిపి యుండెను. ఈ రచనయును పూర్తిగా మక్కికి మక్కిగా చేయబడిన యనువాదము కాదు. కొంతభాగము మాత్రమే యథామూలముగ ననువదింపబడినది. కొన్ని తావుల మూలాతిక్రమణముగా కొన్ని మార్పులు చేయబడినవి.

మూలమున దేవతలు కైలాసమున కేగి ధర్మరక్షణకై శివుని వేడుకొనగా నా మహాదేవుడు శంకరాభిఖ్యతో 'కాలటి' యం దుద్భవించి ధర్మము నుద్ధరింతునని చెప్పిన ఘట్టమిందు విడువబడి, 'కాలటి' యనెడి యగ్రహారమునగల శివగురుడనెడి బ్రాహ్మణుడు శివునిగూర్చి తపము చేయగా నా శివుని యనుగ్రహమున నుద్భవించి నట్లు మాత్రము చెప్పబడినది. శంకరు లీశ్వరావతారమని ముందుగా తెలియజేయక క్రమముగా పఠితలు తన్మహిమనెఱిగి శంకరులు సాక్షాచ్ఛంకరులే యని గ్రహింప గలుగుటకై చేయబడిన యీ మార్పు మిక్కిలి యుచితముగా నున్నది.

మూలమున శంకరుల జనకుడగు శివగురుని తపమునకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై 'అయుష్యంతులను,గుణహీనులనునగు పుత్రులు పెక్కండ్రు కావలెనా? అల్పాయుష్కుడును, సుగుణరాశియు నగు నొక్కపుత్రుడు కావలెనా యని యడిగి నట్లును, శివగురుడు, స్వల్పాయుష్మంతుడైనను సుగుణవంతుడైన పుత్రుడే కావలె నని కోరినట్లును గలదు. ఇందు శివగురువునకు శివుడు స్వప్నమున సాక్షాత్కరించి యొక మాతఫల మిచ్చినట్లును దానినతడు చేతబుచ్చుకొనియుండగా నది క్రిందబడి రసముకారి నలువంకలకును ప్రవహించినట్లును చెప్పబడినది. దీనివలన శివగురుడు తన కుమారుని తన యింటనుంచుకొన వీలుకాదనియు, నతడు గృహము విడిచి లోకోపకారియైన దనసాందలి యద్వైత తత్త్వజ్ఞానరసమును నలుదిక్కులకు ప్రవ హింప జేయగలవాడనియు సూచింపబడినట్లయినది.

శివగురుడు మరణించినప్పుడు దుఃఖించుచున్న తల్లికి శైశవ స్థితిలోనున్న శంకరులు వైరాగ్య ముపదేశించినట్లు ఇందు చెప్పబడినది. ఈ విషయము మూల మున లేదు. దీనివలన శంకరులు సహజజ్ఞాన వైరాగ్య సంపన్నులని స్పష్టముగా పఠితలకు బోధపడును గాన నిదియొక యుచితమైన కల్పన.

విద్యాభ్యాస కాలమున భిక్ష కేగినపుడు తన కామలకమును భిక్షగా నొసగిన

గ్రంథాంతమున శంకరులు దేవతా ప్రార్థితులై కైలాసమున కేగినట్లు మూల మున నున్నది. ఇందు దత్తాత్రేయ ప్రేరణమున శంకరాచార్యులు దక్షిణామూర్తిగా పరిణమించినట్లు మార్చబడినది. అద్వైత తత్త్వ జ్ఞానబోధ చేయుటకై యవతరించిన జగద్గురుత్వము నొందిన శంకరులు దక్షిణామూర్తిగా పరిణమించి స్వరూపనిష్ఠులైనట్లు మార్పు చేయుట యీ గ్రంథమున చేయబడిన మార్పులన్నిటిలో నత్యుత్తమ మైనట్టిది. ఈ మార్పువలన శంకరులు బోధించిన యద్వైత తత్త్వము కేవల వాచా వేదాంతముగాక యనుభవ సిద్ధమనియు దాని ననుసరించిన వారి కట్టిస్థితి కలుగు ననియు నిరూపించినట్లయినది. గ్రంథాదియందు శంకరులు శివుని యవతారమని చెప్పక మానవమాత్రునిగా చిత్రించి చివరకు దక్షిణామూర్తిగా పరిణమించినట్లు చెప్పుటవలన శంకరుల పాత్రౌచిత్య పోషణ పరిపూర్ణమైనది.

ఈ గ్రంథమున చేయబడిన మార్పులు వాని ఔచిత్యము, ఇందలి బహుశాస్త్ర విషయ విశేషములు, భాషాంతరీకరణ విధానము కవిత్వము, ప్రయోగ విశేషములు, కావ్యలక్షణములలో ముఖ్యమైన రసవిషయము మొదలగు వానిని గూర్చి, "తర్క రత్న" "న్యాయ వేదాన్త విద్యాపారీణ" శ్రీ బులుసు అప్పన్న శాస్త్రిగారు వివరముగ చర్చించి ప్రశంసించుచు సుమారు నుప్పది పుటల పీఠికను వ్రాసియున్నారు. వాని నన్నిటిని మరలనిచ్చట పేర్కొనుట చర్వితచర్వణమే యగును. ఈ రచన యీ కవి యొక్క వేదాంత వ్యాకరణ సాహిత్య కవితా ప్రావీణ్యమునకు నిదర్శనమని చెప్పిన చాలును.

ఈ శంకర విజయము తెలుగున రచింపబడిన శంకరాచార్య చరిత్రకు సంబం ధించిన కావ్యములన్నిటిలో సర్వోత్తమమైనదని చెప్పవచ్చును. శాస్త్రవిషయ ములు, వివిధ పాత్రముల ఔచిత్యము, శైలి, రసపోషణ మొదలగు ముఖ్యవిషయ ములన్నిటిలో నీ విషయముపై నింతకు పూర్వము రచింపబడిన కావ్యము లెవ్వియు పూర్ణమైన తృప్తినిచ్చునవిగా లేవు. ఈ రచన సర్వవిధముల పరిపూర్ణమైన సంతుష్టి నీయగలదిగా యీ విషయములను గూర్చి మరెవ్వరును ప్రయత్నింప నవసరము లేదేమో యన్నట్లున్నది. సంస్కృత శంకర విజయములన్నిటిలోను మాధవ విద్యా రణ్యుల రచనయే సర్వవిధముల నుత్తమమైనదిగా ప్రసిద్ధికెక్కినది. దానికి మెరు గులు దిద్దిన యీ రచనయొక్క ప్రాశస్త్యమును గూర్చి వేరుగా చెప్పనవసరము లేదు. చిరస్థాయిగా నుండగల యద్వైత తత్త్వ కావ్యములలో నిదియొకటి యని నిస్సంశయముగా చెప్పవచ్చును.

గ్రంథాంతమున శంకరులు దేవతా ప్రార్థితులై కైలాసమున కేగినట్లు మూలమున నున్నది. ఇందు దత్తాత్రేయ ప్రేరణమున శంకరాచార్యులు దక్షిణామూర్తిగా పరిణమించినట్లు మార్పబడినది. అద్వైత తత్త్వ జ్ఞానబోధ చేయుటకై యవతరించిన జగద్గురుత్వము నొందిన శంకరులు దక్షిణామూర్తిగా పరిణమించి స్వరూపనిష్ఠులైనట్లు మార్పు చేయుట యీ గ్రంథమున చేయబడిన మార్పులన్నిటిలో నత్యుత్తమమైనట్టిది. ఈ మార్పువలన శంకరులు బోధించిన యద్వైత తత్త్వము కేవల వాచా వేదాంతముగాక యనుభవ సిద్ధమనియు దాని ననుసరించిన వారి కట్టిస్థితి కలుగు ననియు నిరూపించినట్లయినది. గ్రంథాదియందు శంకరులు శివుని యవతారమని చెప్పక మానవమాత్రునిగా చిత్రించి తుట్టతుదకు దక్షిణామూర్తిగా పరిణమించినట్లు చెప్పుటవలన శంకరుల పాత్రౌచిత్య పోషణ పరిపూర్ణమైనది.

ఈ గ్రంథమున చేయబడిన మార్పులు వాని యౌచిత్యము, ఇందలి బహుశాస్త్ర విషయ విశేషములు, భాషాంతరీకరణ విధానము కవిత్వము, ప్రయోగ విశేషములు, కావ్యలక్షణములలో ముఖ్యమైన రసవిషయము మొదలగు వానిని గూర్చి, "తర్కరత్న" "న్యాయ వేదాన్త విద్యాపారీణ" శ్రీ బులుసు అప్పన్న శాస్త్రిగారు వివరముగ చర్చించి ప్రశంసించుచు సుమారు ముప్పది పుటల పీఠికను వ్రాసియున్నారు. వాని నన్నిటిని మరలనిచ్చట పేర్కొనుట చర్వితచర్వణమే యగును. ఈ రచన మీ కవి యొక్క వేదాంత వ్యాకరణ సాహిత్య కవితా ప్రావీణ్యమునకు నిదర్శనమని చెప్పిన చాలును.

ఈ శంకర విజయము తెలుగున రచింపబడిన శంకరాచార్య చరిత్రకు సంబంధించిన కావ్యములన్నిటిలో నుత్తమోత్తమమైనదని చెప్పవచ్చును. శాస్త్రవిషయములు, వివిధ పాత్రముల ఔచిత్యము, శైలి, రసపోషణ మొదలగు ముఖ్యవిషయములన్నిటిలో నీ విషయముపై నింతకు పూర్వము రచింపబడిన కావ్యము లెవ్వియు పూర్ణమైన తృప్తినిచ్చునవిగా లేవు. ఈ రచన సర్వవిధముల పరిపూర్ణమైన సంతుష్టి నీయగలదియై యీ విషయములను గూర్చి మరెవ్వరును ప్రయత్నింప నవసరము లేదేమో యన్నట్లున్నది. సంస్కృత శంకర విజయములన్నిటిలోను మాధవ విద్యారణ్యుల రచనయే సర్వవిధముల నుత్తమమైనదిగా ప్రసిద్ధికెక్కినది. దానికి మెరుగులు దిద్దిన యీ రచనయొక్క ప్రాశస్త్యమును గూర్చి వేరుగా చెప్పనవసరము లేదు. చిరస్థాయిగా నుండగల యద్వైత తత్త్వ కావ్యములలో నిదియొకటి యని నిస్సంశయముగా చెప్పవచ్చును.

ఉదా :- శంకరుల దిగ్విజయ సందర్భమున :-.... అవలనచ్చోటు (రామేశ్వరము) వీడి పీడని ప్రతిమత స్థాపనాదృతి నశేషాశావలయ విజయోన్ముఖత ద్రుత గతిం బయలువెడలి శాక్తమత శకలీకరణంబును, సారస్వత మత నిరాసంబును, వామాచార దూరీకరణంబును, పాండ్య చోళాది విషయ విశేషంబుల శైవమత నిబర్హణంబును, లింగ మత భంగంబును, షడ్విధవైష్ణవమత నిహింసనంబును, సుబ్రహ్మణ్య క్షేత్రంబున చతుర్ముఖ మతావోముఖీకరణంబును, అగ్ని, రవి, మత నిరాకరణంబును, గణేశక్షేత్రంబున గణేశమత ప్రణాశంబును, కాంచీ నగర నిర్మాణంబును, కాపాలిక మత నిర్మూలనంబును, గౌడదేశవిజయంబును, చార్వాక క్షపణక జైన, మల్లారి విష్వక్సేన మన్మథ కుబేరేంద్రీయమవాయురుణ మతధ్వంసంబును, శూన్యమత ఖండనంబును వారాహమత వినిహ్నవంబును, సాంఖ్యగుణమత శోషణంబును, కాపిలమత పాతనంబును. అణుమతచ్ఛేదనంబును, శేషమత భేదనంబును, చంద్ర క్షపణక పిత్ర్యమత భంజనంబును, నీలకంఠ విజయంబును, భట్టభాస్కర పరాఙ్ముఖీకరణంబును, దాక్షిణావర్త భరత శూరసేన, కురు, కాశ, కరూశాది, నానా విధ విషయ విజయంబును, సర్వమత నిబర్హణంబును గావించి మించి—

తే॥ భేద భేదక వేద గభీర వాద
భీకరుండై యొసంగె పినాకపాణి
వాదిగెలిచి పొలిపిన యద్వైత గురుడు
వసుధ స్థాపించి నిలిపె నద్వైత మతము ॥

అద్వైత తత్త్వ ప్రసక్తి చేయబడిన తావులలోగూడ కొన్ని చోట్ల విషయము సరళ సుబోధకముగా గాక వివరణ సాపేక్షముగానే యున్నది.

ఉదా :- పద్మపాదాది లన్యాసదేశంబున శంకరుతసూచాహ వృత్తాంతము నెరింగించు సందర్భమున

శా॥ వేత్తల్ లేని నశోష్యశిష్యతతి "కేవిద్యాక్షి బింబాంతరై
జిత్తత్వంబవు, దయ్యదియునే సత్యంబు ను"మ్మంచు త
ద్వ్యక్తత్వత్యమనాన...."నానిగమ వాక్యాళిం ప్రబోధించుచుం
దత్తత్త్వంబు పరంబు నీవు మహహాగ్ర్యా, ప్రాప్త రూపాంతరా॥

వనమయూరము :-

జాతము జగమ్మిది యశాశ్వతము స్వప్న
సీత వన హృద్బద సింధురసమున్మ
పూతతర మప్రమిత మూర్తిరహితమ్మ
ద్వైతపరసౌఖ్యమవు తత్త్వమవు భావా॥

ఉదా :- శంకరుల దిగ్విజయ సందర్భమున :-.... అవలనచ్చోటు (రామేశ్వరము) వీడి పీడని ప్రతిమత స్థాపనాదృతి నశేషాశావలయ విజయోన్ముఖత ద్రుత గతిం బయలువెడలి శాక్తమత శకలీకరణంబును, సారస్వత మత నిరాసంబును, వామాచార దూరీకరణంబును, పాండ్య చోళాది విషయ విశేషంబుల శైవమత నిబర్హణంబును, లింగ మత భంగంబును, షడ్విధవైష్ణవమత నిహింసనంబును, సుబ్రహ్మణ్య క్షేత్రంబున చతుర్ముఖ మతావోముఖీకరణంబును, అగ్ని, రవి, మత నిరాకరణంబును, గణేశక్షేత్రంబున గణేశమత ప్రణాశంబును, కాంచీ నగర నిర్మాణంబును, కాపాలిక మత నిర్మూలనంబును, గౌడదేశవిజయంబును, చార్వాక క్షపణక జైన, మల్లారి విష్వక్సేన మన్మథ కుబేరేంద్రియమవాయురుణ, మతధ్వంసంబును, శూన్యమత ఖండనంబును వారాహమత వినిహ్నవంబును, సాంఖ్యగుణమత శోషణంబును, కాపిలమత పాతనంబును. అణుమతచ్ఛేదనంబును, శేషమత భేదనంబును, చంద్ర క్షపణక పితృమత భంజనంబును, నీలకంఠ విజయంబును, భట్టభాస్కర వరాఙ్ముఖీకరణంబును, బాహ్లావర్త భరత శూరసేన, కురు, కాశ, కరూశాది, నానా విధ విషయ విజయంబును, సర్వమత నిబర్హణంబును బొనరించి మించి—

తే॥ భేద భేదక వేద గభీర వాద
భీకరుండగు లెంచా పినాకపాణి
వాదినెలిపి కొలిపిన యద్వైత గురుడు
వసుధ స్థాపించి గెంచె నద్వైత మతము ॥

అద్వైత తత్త్వ ప్రసక్తి చేయబడిన తావులలోగూడ కొన్ని చోట్ల విషయము సరళ సుబోధకముగా గాక వివరణ సాపేక్షముగానే యున్నది.

ఉదా :- పద్మపాదాది లన్యాసదేశంబున శంకరుతసూచాహ వృత్తాంతము నెరింగించు సందర్భమున

శా॥ చేత్తత్ చేని నరోష్యతిష్యతతి "కేవిక్వాక్షి బింబాంతరై
జత్తత్వంబిది, దయ్యదియునే సత్యంబు ను"మ్మంచు త
ద్వ్యక్తత్సత్యమనె౽న...."నానిగమవాక్యాళిం ప్రబోధించుచుం
దత్తత్వంబు పరంబు నీవు మహహాగ్ర్యా, ప్రాప్త రూపాంతరా॥

వనమయూరము :-

జాతము జగమ్మిది యశాశ్వతము స్వప్న
సీత వన పూర్ణజల సింధురసమమ్మా
పూతతర మప్రమిత మూర్తిరహితమ్మ
ద్వైతపరసౌఖ్యమవు తత్త్వమవు భూపా॥

శ్లో॥ పాముర్త్యన్వయ వేంకయాత్మజ మణేః
కౌండిన్య గోత్రస్య ప్రో॥ త్సాహోచ్ఛింహ పురస్థ
చెంచయ సతస్త్రీ గొల్ల పూడ్యన్వయే
జాతే నాప్పయసూను నాగ్రజనిభాజా
రామలింగేన సం । శ్రోస్త్రాశంకర సత్కథా
వితనుతాం సర్వేప్సితం శృణ్వతాం॥

ఇది పాటలు, శ్లోకములు, తోహరాలు, వచనములు గలిగి శ్రీ శంకరాచార్య చరిత్రమును వివరించునదిగా నున్నది. శాస్త్రవాదములలో మధ్య మధ్య ప్రమాణములుగా శ్లోకము లుదాహరింపబడినవి.

ఉ॥ "లింగాంకితతనుం దృష్ట్వా శంఖచక్రాంకితం తథా।
స్నాన మేవకర్తవ్యా అథవా సూర్య మీక్షయేత్॥"

"అను బృహన్నారదీయాది శ్రుతిస్మృతి నిషిద్ధంబులగు చిహ్నధారణం బయోగ్యంబు" ఇంచెప్పుటకు మన్నిన యొక్క పద్యమైనను కానరాలేదు. ఇందలి కథలో విశేషమేమియును లేదు. "సర్వమత ఖండనకారు డగు శ్రీహర్షుని గండ డంచి" యనునది యొక విశేషము. చిట్టచివర మఠస్థాపన విషయమున కొంతభేదము కానిపించుచున్నది. సర్వజ్ఞపీఠారోహణమైన పిమ్మట "సురేశ్వర పద్మపాద తోటక, హస్తామలకుల శృంగగిరి, పురిగిరి, కామకోటి విరూపాక్షంబుల జగదాచార్యత్వంబు నకు దీరాభ్యషిలంచేసి బదరికాశ్రమనికిం జేరి తాపసుల శిష్యుల గావించి కేదారాటవి కరిగి వృషభ్యూలు కృపనే సుప్తజలంబును సాదరంబున శిష్యులకిడి కేదారేశ్వరు నారాధించి తత్పాదతలాగర వహ్నిపర ప్రవాహంబున శీతభీతులగు శిష్యుల తాపంబులుదీర్చి చతురాస్యాది సురప్రముఖులు నభోగతి విమానము గొనివచ్చి కైలాసమునకు రమ్మని ప్రార్థింప నాయలిపలి పరమ శివరూపముదాల్చి వృషభారోహణుడై పరమపదమున కేగును" అని చెప్పబడినది. ఇందు చెప్పబడిన మఠములలో శృంగగిరిలో మాత్రము శ్రీ శంకరులు మఠస్థాపన చేసినట్లు ప్రసిద్ధి యున్నది. మిగిలిన మూడును తరువాత శంకర శిష్యులచే స్థాపించబడినట్లు తెలియుచున్నది. శ్రీ శంకర విరచితమైన మఠామ్నాయ శ్లోకములలో పూరీ, బదరీ ద్వారకలు పేర్కొనబడియున్నవి. ఇందు సాహిత్యముకంటె సంగీతము, శాస్త్రవిషయము విశేషముగా కనిపించుచున్నవి. ఇందలి భాష లాక్షణికము సంస్కృత పద భూయిష్ఠమునై యున్నది. రచయిత సంస్కృత భాషాపాండిత్యము కవిత్వము గలవాడుగను, సంగీతశాస్త్ర ప్రవేశము గలవాడుగను తెలియుచున్నది. ఇందలి పాటలకు రాగతాళ భేదములు, హిందూస్థానీ బాణీ మెట్లు, సూచింపబడినవి. హిందూస్థానీ జంఝూటీరాగము, జుల్వా తాళము మొదలగునవి పేర్కొనబడుటచే నీకవికి హిందూస్థానీ సంగీతమున

గూడ ప్రవేశముండి యుండవచ్చునని తోచుచున్నది. ఇది శ్రీ "శంకర విజయము"ను హరికథగా చెప్పదలచినవారికి ఎక్కువ యుపయోగకరముగ నుండునని తోచుచున్నది. రచయితగూడ హరికథా కథకు డగుటలో ఆశ్చర్యము లేదు.

దీనిని అద్వైత తత్త్వ బోధకములైన యక్షగానములలో చేర్చవచ్చును.

# శ్రీ శంకర విజయము (నాటకము)

## కర్త :- కవిసార్వభౌమ అచ్యుతుని వేంకటాచలపతిరావు

జగద్గురు శ్రీమదాది శంకరాచార్యులవారి దివ్యచరిత్ర యందలి ముఖ్యమైన ఘట్టములు కొన్ని యిందెనిమి దంకములలో చూపబడినవి. గ్రంథకర్త శ్రీ అచ్యుతుని వేంకటాచలపతిరావుగారు. కవిసార్వభౌమ బిరుదాంకితులు. నియోగి శాఖా బ్రాహ్మణులు. ఈ శతాబ్దమున కృష్ణా గుంటూరు మండలములలో నివసించిన విద్వత్కవి, విమర్శకులు, సనాతన ధర్మపరాయణులునై సమకాలికులలో ఆస్తిక్యమును, ఆర్ష విజ్ఞాన నిరతిని గలిగించు నుద్దేశ్యముతో వేదభూమి, బాల్యవివాహ తత్త్వసారము, వేదప్రసక్తి మొదలగు గ్రంథములను రచించినవారు. వీరు శ్రీ శంకరవిజయ నాటకమునే కాక 'అంపశయ్య' 'పాండవాంకురము' అను నాటకములను, 'మర మురళి' 'బాలాంజనేయము' 'గోలకొండ పాసీషా' యను కావ్యములనుకూడ రచించిరి.

విషయసంగ్రహము : ప్రథమాంకము : ఇందు ప్రథమరంగమున తుంబుర నారద సంభాషణమున శంకరావతార కాలమునాటి భారతదేశ మతధర్మ పరిస్థితులు ప్రకటింపబడినవి. ద్వితీయ రంగమున తుంబుర నారదులు దేవేంద్ర సభలో భారతదేశ పరిస్థితులను వివరించి ఇంద్రాది దేవతలతో కైలాసమునకు బోవుట, తృతీయ రంగమున శివుడు ప్రత్యక్షమై దేవతల కభయమిచ్చి తానద్వైత మత స్థాపనార్థము భూలోకమున నవతరింతునని చెప్పుట యను నంశము లున్నవి.

ద్వితీయాంకము ; ఇందు ప్రథమ రంగమున సుధన్వ మహారాజు సభలో ప్రవేశించి కుమారిలభట్టు సౌగతులతో వాదమునకు సిద్ధమగుట, ద్వితీయ రంగమున కుమారిలభట్టు బౌద్ధులను గెలిచి వారిని రాజ్యము నుండి వెడలగొట్టించుట యనెడి యంశములున్నవి.

తృతీయాంకము : ఇందు మొదటిరంగమున ఆర్యాంబా శివగురుల తపస్సు. శివుడు ప్రత్యక్షమై తాను (శంకరాచార్యులుగా) తమకు పుత్రుడై జన్మింతు నని చెప్పుట, రెండవరంగమున సరస్వతి దూర్వాసుని శాపమున భూలోకమున జన్మించుట, యను విషయములున్నవి.

చతుర్థాంకము : ఇందు మొదటి రంగమున నిద్దరు విద్యార్థులు తమ భిక్షాటనమును గూర్చిన యవస్థలు చెప్పుకొనుట. రెండవ రంగమున శంకరులు వడుగు వేషమున భిక్షాటనకై వెడలుట, దేశము యొక్క దౌర్భాగ్యస్థితిని గూర్చి విచారించుచు చివరికొక బ్రాహ్మణ గృహమున కేగుట, మూడవరంగమున నొకపేద బ్రాహ్మణ గృహమున శంకరు లామలక భిక్షగొని లక్ష్మిని స్తుతించి కనకవర్షము గురి పించుట, యను నంశములున్నవి.

పంచమాంకము : ఇందు మొదటిరంగమున శంకరులు గ్రాహగ్రస్తులై తల్లి యనుమతి పొంది ఆతుర సన్న్యాసమును స్వీకరించుట, రెండవరంగమున నదీప్రవాహ మార్గమును మార్చుట, తల్లికి శ్రీకృష్ణ దర్శనము చేయించుట-శ్రీకృష్ణ విగ్రహమును పునః ప్రతిష్ఠచేసి తల్లి యనుమతి గైకొని యిల్లువెడలి సంచారమున కేగుట, మూడవ రంగమున శంకరుల దేశికాన్వేషణము, నాలుగవ రంగమున శంకరులు శ్రీ గోవిందపాద దర్శనము చేయుట, సన్న్యాసదీక్ష స్వీకరించుట జలార్ణవ ప్రమాదమును తొలగించుట సూత్రభాష్య రచనకొరకు గోవిందపాదుల యాజ్ఞగొని బయలుదేరిపోవుట యను విషయము లున్నవి.

షష్ఠాంకము :- ఇందు, మొదటి రంగమున చండాలరూప శివునకును శంకరాచార్యులకును సంవాదము. రెండవ రంగమున, వ్యాసులు శంకరుల భాష్య మును పరీక్షించుట, బ్రహ్మ, శంకరుల కాయుర్దాయమును హెచ్చించుట, మూడవ రంగమున హస్తామలకుడు శిష్యుడగుట యను విషయము లున్నవి.

సప్తమాంకము :- ఇందు మొదటి రంగమున శంకరులు మండనమిశ్రుని గృహముజేరి వాదమున కాతని నంగీకరింపజేయుట, ద్వితీయ రంగమున శంకరులు మండనమిశ్రుని వాదమున నోడించుట, ఉభయభారతితో వాదించుట, మూడవ రంగమున శంకరుల పరకాయ ప్రవేశము, ఉభయభారతి శంకరుల విజయము నంగీకరించుట యను నంశము లున్నవి.

అష్టమాంకము : ఇందు మొదటి రంగమున శంకరులు కాశ్మీరమునకు బోవ సంకల్పించుట, మృతుడైన బ్రాహ్మణబాలుని బ్రతికించుట, రెండవ రంగమున శంకరులు కాశ్మీరమందలి సర్వజ్ఞపీఠము నధిరోహించుట యను విషయము లున్నవి.

ఆచార్యుల సర్వజ్ఞపీఠారోహణముతో శంకర విజయమను నీ నాటకము సమాప్త మైనది.

చతుర్మఠ స్థాపనము మొదలగు విషయము విడిచివేసిరి.

ఇది గద్యపద్య గేయాత్మకమైన రచన. ఇది రంగస్థలమున ప్రదర్శింపుట కుద్దేశింపబడి రచింపబడిన దగుటచే ప్రేక్షకుల నాకర్షించుటకు కిందటి భాష వాలవరకు సరళీకృతమై యుడుగవుగునను జాతీయములుగ లోకోక్తులతో నింపబడి యున్నది. ఉదా:- (1) గుడ్డములకు కప్పల కళ్ళెములు తగిలించినట్లు, (2) కందకు లేని దుల కత్తిపీట కుందునా. మొ॥ ఇట్టివి నాటకము మొత్తముమీద వందకు పైగా కనిపింపును. ఒకటి రెండుచోట్ల (పద్యాంతమున) ఆంగ్ల భాషయు, కొన్నిచోట్ల వ్యావహారికాంధ్రభాషయు వినియోగింపబడినవి. ఇవి సందర్భమును బట్టియు పాత్రలను బట్టియు నుండుటచేత నయోగ్యమని భావింపదగి నట్లు లేవు. సర్వసాధారణముగ నిందలిభాష ననరళము లక్షణయుతమై యున్నను అచ్చటచ్చట "అవికచకమల కైరవ గంధబంధురోదార సమీర సౌరభ వినోద ములు, (3వ పుట) వంటి సుదీర్ఘ సమాసములు, పాహిమామను, రక్షమామను (13వ పుట) ధర్మశాస్త్ర పేటి (112వ పుట), శంకరకర్త్తెర (134వ పుట) వంటి వ్యాకరణ విరుద్ధ ప్రయోగములును కానవచ్చుచున్నవి.

శంకరులను నదిలో మొసలి పట్టుకొనినప్పుడు శంకరులు భగవంతుని ప్రార్థించిన విధమిట్లున్నది.

"ఇవ్వారిచరమున నెవ్వరడ్డమువత్తు రెవ్వడు నాకాధ్యుడు పరమేశ్వరు డెవ్వాడు కారణుడు సర్వాధారుడెవ్వడు పరమాత్ముడు సర్వాత్మకుడెవ్వడు నిర్గుణుడు మహాత్మకు డెవ్వనిచే గల్గు నెవ్వానిలోనుండు నెవ్వనిలోడించు నీజగమంతయు నెవ్వడేలోకంబులును లోకేశులను లోకస్థులును దెగిన నవ్వలను పెంజీకటిని నేకాకృతిని వెలుగొందు చుండుసు! ॥ఇవ్వారి॥ (64 వ పుట)

ఇది పెక్కు దోషములతో ముద్రింపబడియున్నది. ఇదీ పాటయో వచ నమో సరిగా తెలియుట లేదుగాని మొత్తముమీద నిందలి భావములు పోతనా మాత్యుని గజేంద్ర ప్రార్థనలోనివని మాత్రము స్పష్టమగుచున్నది.

శంకర మండనమిశ్ర సంభాషణము, ప్రారంభమున మాధవీయ శంకర విజయమునందువలె నొక పద్యమునం దమర్చుటకు ప్రయత్నించి కవి యొక సీస మాలిక నిచ్చుట గూర్చెను. (121 పుట)

మండన :- ఎరుగవా నన్ను నీవేడనుండిర బోడి ?
శంకర :- ఎరుగుదు మెడకు పైనెల్ల బోడి.
మండన :- ఏదారి నడిగితిరా పరిభ్రమిత
శంకర :- సరె! ధనికుడా! దారి యేమని వచించె....
మండన :- కాంత సుఖంబెరుగక సన్యసించితే ?
శంకర :- ఏకాంతసుఖము నే నెఱుగగలను.......

ఇది శంకర విజయమున నున్నంత సరసముగ లేకున్నను మొత్తము మీద నిందలి భావములను, నచ్చటి కవిచేసిన పరిశ్రమను కొంతవరకు మెచ్చదగిన దనియే చెప్పవచ్చును.

గ్రంథ ముద్రణ కాలమునకు కవి స్వర్గస్థుడై యుండుటవలన నిందలి దోషములను పూర్తిగా సవరించుట కవకాశము లేకపోయినట్లున్నది. గ్రంథము నందు కనిపించు దోషములన్నియు గ్రంథకర్తవి కావని గ్రంథకర్తయొక్క రచనా సామర్థ్యమును తెలుపు నీ క్రింది యుదాహరణ పద్యములను బట్టి నిశ్చయింపవచ్చును. (1) శంకరులు మొసలిచే విడువబడిన పిదప గట్టుచేరి తల్లితో నిట్లనిరి. (68 పుట)

మ॥ తత దుర్ధాంత మనంత దుర్మత మహాతామిస్ర ఘోరాంధ దూ
షితమై వైరి పరస్పరాహత హతక్షేమాస్పదంబై క్షయ
స్థితిచే గ్రుంగిన పుణ్యభూమి నిదిగో శ్రేయస్కరాద్వైత పా
లితమౌనట్లుల నుద్ధరించెదను తల్లీ నన్ను దీవింపవే॥

(2) కాశీపట్టణమున చండాలిరూపమున వచ్చి శంకరులను పరీక్షించి, చివరకు శంకర రూపమున దర్శన మిచ్చిన శంకరుని శంకరులు స్తుతించిన సందర్భమున రచింపబడిన శ్లోకము (102 పుట)

శ్లో॥ ఆస్యేహాస్య రసం బిభర్తి-గిరిజా లాస్యేచ శృంగార కం ।
భీభత్సం నృకపాలకే వలయే-వీరంచ బాణాసనే!
భోగీ పూత్కరణే భయానక విధిం-నేత్రత్రయే రౌద్రతాం ।
హాలాగ్ని జ్వాలనే మహాద్భుతగుణం-కారుణ్య మర్ధాంగకే ।
శాంతంచేతసి పాతుమాం-నవరసావాసో జగచ్ఛంకరః ॥

ఈ నాటకమునందలి రసము ప్రధానముగ శాంతమేయైనను, దరిద్ర బ్రాహ్మణి శంకరుల కామలక భిక్షనిడు సందర్భమునను, గ్రహగ్రస్తుడగు శంకరుని జూచి తల్లి విలపించు సందర్భమునను, కరుణ రసచ్ఛాయము, శంకరుల బాల్య

మున (చతుర్థాంకము-మొదటి రంగమున) విద్యార్థుల సంభాషణలో హాస్యరసవ్యా యయు గోచరించుచున్నవి.

ఇందలి ముద్రకాది దోషములను సవరించి, తగుమాత్రముగ సంస్కరించినచో నిది రంగస్థలముపై ప్రదర్శించుటకు తగిన నాటకమై జనాకర్షకము కాగల దని చెప్పవచ్చును.

# శ్రీ జగద్గురు విజయము [నాటకము]

ఇది జగద్గురు శ్రీ శంకరాచార్యులవారి జీవిత చరిత్రమందలి కొన్ని ముఖ్యాంశములు కూర్చి రచింపబడిన నాటకము. శ్రీ విద్యారణ్య కృతమను వదంతి గల శంకర విజయ సంస్కృత కావ్యమందలి కథానకము కొంత యాధారముగ దీని విరచించినట్లును శ్రీమచ్ఛంకర భగవత్పాదుల పాత్రమున నౌచితి బరిపోషించు టకై తృతీయాంక ప్రథమరంగమందలి శంకర మండనమిశ్ర వాదోపవాద ఘట్టము నను గొలదిగ మార్పులు గావించినట్లును గ్రంథకర్త పీఠికలో విజ్ఞాపనము చేసెను.

ఈ గ్రంథకర్త శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు. వీరు కాకినాడ తాలూకా లోని తుల్యారామేశ్వర గ్రామ నివాసులు. వీరి జననము క్రీ. శ. 1905వ సంవత్స రము. వీరు ప్రస్తుతము కాకినాడ యందలి యాంధ్రసాహిత్య పరిషత్కార్యాలయ నిర్వాహకులుగను తత్పరిషత్పత్రికా సంపాదకులుగను పనిచేయుచున్నారు. వీరికి "కవికంఠీరవ" "కవిమూర్ధన్య" "విద్వత్కవివర" "ప్రౌఢ కవిచంద్ర" మొదలగు బిరుదములున్నవి. వీరు సంస్కృతాంధ్రములం దనేక గ్రంథములు రచించిరి.

అందు, (1) సంయుక్తాకల్యాణము (2) చంద్రహాస విలాసము (3) కౌశికాభ్యుదయము (4) కందుకక్రీ (5) దివానక్తము (6) నవరస కల్లోలిని (7) కవి (8) లోకావలోకనము ననునవి యాంధ్ర పద్యకృతులు.

(1) ఆంధ్రరాజ్య పునఃస్థాపనము (2) గగనగంగ (3) ప్రద్యుమ్నా భ్యుదయము (4) జగద్గురు విజయము, (5) పాపపు బండి (6) సుడిగుండము (7) బిళ్ళగోచి సింగారము (8) భువన విజయము ననునవి యాంధ్రనాటకములు. అహల్యా సౌశీల్యము సంస్కృత నాటకము.

(1) ప్రత్యక్ష మోక్షసౌధము (2) సదాముక్తి సుధార్ణవము (3) అస్తి-నాస్తి అనునవి సంస్కృత వేదాంతగ్రంథములు. అభయ సిద్ధి రెండు భాగములు

వేదాంత గద్యరచన. ఇవిగాక ఆంధ్రమున పెక్కు నవలలు "పార్వతీపరిణయ," మను హరికథ వీరిచే రచింపబడినవి.

ఈ నాటకీయ రచనకు గ్రంథకర్తను ప్రేరేపించి నాందీ ప్రస్తావనలు వ్రాసినవారు శ్రీ గార్లపాటి రాఘవరెడ్డిగారు. వీరుభయభాషాకవితా ప్రవీణులు. అద్వైత బ్రహ్మ విద్యావిదులు.

ఈ నాటకము 1944వ సంవత్సరమున రచింపబడి ప్రదర్శింపబడినది. 1952వ సంవత్సరమున ముద్రితమైనది.

ఇది మైదంకముల నాటకము. ఇందు మొత్తము ముప్పదినాలుగు పద్యము లున్నవి. ఇందలి నాందీపద్యము శ్రీ శంకరాచార్య స్తుతిపూర్వకమై "శంకరుడు శుభంకరుండు, మిము జ్ఞానసముద్రులజేసి బ్రోచుతన్" అనెడి యాశంసాయుతమై ఇతివృత్తమున కనుగుణమై యున్నది.

ప్రథమాంక ప్రథమరంగమున శ్రీ శంకరులు ప్రాథమిక విద్యాభ్యాస ప్రారంభకాలమందునే "ఓం" అను నక్షరము నట్లేల వ్రాయవలెనో తెలిసికొనగోరుట మొ॥ విషయము లాతని భావి జీవితమందలి తార్కిక శక్తిని విమర్శనాపూర్వక విజ్ఞానమునకును సూచకముగా నున్నది. ఈ ఘట్టము శంకర విజయమున నున్నట్లు లేదు.

ద్వితీయరంగమున శంకరుని సన్న్యాసమునకు తల్లియంగీకరించిన విధ మిట్లున్నది. "శంకరులు నదిలో మునుగుచు" అమ్మా! అమ్మా! మొసలి నన్నీడ్చుకొని పోవుచున్నదే! నన్ను సన్న్యసింపవలదని శాసించి గతులు లేకుండ జేసితివే" యని యాక్రోశించెను. అంతట తల్లి "నా తండ్రి! నీవు సన్న్యాసివిగాకుండ నడ్డిడితిని అపుడంగీకరించిన నెచటనో సుఖముగా బ్రతికి యుందువని" యార్చుచు నొడ్డున నిలువబడెను. శంకరులు నదినుండి బయటకువచ్చి తల్లి "యపుడే యంగీకరించిన" అను మాట నాధారముగా జేసుకొని యందు ధ్వనించు "ఇపుడంగీకరించితి" నను భావములాగి యదియే యామె యనుమతిగా నైకొని సన్న్యసింప సంసిద్ధుడయ్యెను. ఈ మార్పువలన ప్రత్యేక ప్రయోజనమేమియు లేకపోగా శంకరుని తల్లి వాచ్యముగానైనను శంకరుల సన్న్యాసమున కెన్నడు నంగీకరింపనట్లైనది. ఇది కొంతవర కౌచిత్యమును తగ్గించినదనియే చెప్పదగును.

ద్వితీయాంక ప్రథమరంగమున శంకరులు గోవిందభగవత్పాదుల సన్నిధి కేగునరికివారు తమ శిష్యద్వయమును వేదాంత చర్చలోనుంచి వారి ప్రజ్ఞను పరిశీలించు చున్నట్లునది. శంకర విజయమున గోవింద యోగీంద్రులు గుహలోనుండినట్లున్నది,

ఈ మార్పువలనను ప్రత్యేకమైన ప్రయోజనమేమియు కనిపించుటలేదు. గోవింద పాదులు నీవెవ్వడవని యడుగ శంకరులు చెప్పిన సమాధానము.

ఉదా :- కానుసరుండ........నగుడన్ నిజబోధరూపుడన్.

2. ఉ :- కానుశరీర మింద్రియములుగాను....నేను విశిష్టుడన్, శివుడ నిత్యుడ సాక్షిని బ్రత్యగాత్ముడన్ తానదమున్ సుఖంబునకు దాకకుమారథరాదీ దూరుడన్" అను రెండు పద్యములలో "నభూమిర్నవాయు........శివః కేవలోహం" అనెడి శ్లోకముల భావము కొంత యిమిడియున్నది.

ద్వితీయాంక తృతీయరంగమున సనందనుడు నీలకంఠాచార్యుని శిష్యునితో సంభాషించినట్లున్నది. నీలకంఠాచార్యుడు శంకరాచార్యులకు సమకాలికులన్న సంగతి విచార్యము.

శంకరుల పిలుపు విని సనందనుడు సంభ్రమమున తనకు తెలియకుండగనే గంగపై నడచివచ్చినట్లు చెప్పుట యాతని గురుభక్తి యొక్క పరాకాష్ఠను సూచించుచు నాతని పాత్రమున కౌన్నత్య మాపాదించుచున్నది.

శంకర, చండాలరూప విశ్వేశ్వర సంవాదసమయమున సనందనుడుగూడ నచటనుండి యుండు పాల్గొనుటయు నాసంవాదమున శంకరుని పాత్రయందలి యనౌచిత్యమును తొలగించుటకా వాదము కొంత పద్మపాదునిచే చేయించి శంకరులచే నాచండాలరూపుని నిందాస్తుతి రూపముననున్న శ్లేషగర్భితవాక్యములచే "నీవు చెప్పరాని వాడవు. అనాకారుడవు. గుణహీనుడవు. బుద్ధిలేనివాడవు" అనిపించుటయు పద్మపాదుడా చండాలరూపుని మాటలయందలి భావమును గ్రహింపలేక చిలక పలుకులని యాక్షేపించగా శంకరు లాతని పలుకు లనుభవసిద్ధములని చెప్పి యా చండాల రూపునితో ఓ మహనీయుడా! నీవాక్యముల మోఘములు. నామసూచకములు కేవల కల్పితములేకాని దేవదేవా! నీయస్పృశ్యతమాత్రము సుస్థిరమే. మాయకు నీవస్పృశ్యుడవు. మాయాకార్యమగు జగమునకు నీవస్పృశ్యుడవు. కావున నీ వస్పృశ్యుడవే యని నే నపుడును నిపుడును పలికిన- పల్కుచున్న మాట బొంకుగాదు" అనుటయు కవికల్పనమే యైనను సందర్భానుగుణమై యౌచిత్యమును హెచ్చించుచున్నవి.

అతడు తురీయాతీతుడగు నతి వర్ణాశ్రమియని తెల్పి యాతని బోధ సారాంశము నీ సందర్భమున శంకరులు పద్మపాదునకు వాచ్యముగా బోధించుటయును యుక్తముగానే యున్నది.

తృతీయాంక ప్రథమరంగమున గల శంకర - మండనమిశ్ర సంవాదమున

మోక్షము కేవల జ్ఞానసాధనసాధ్యమనియు నది కర్మసాధ్యము కాదనియు సిద్ధాంతీకరింప బడినది. వాద ప్రతివాద సమయమున, మధ్యస్థస్థానీయమగు నుభయ భారతి పరోక్షమున గాక నచ్చటనే యుండినది. ఇది రంగస్థల ప్రదర్శనమున కుద్దేశింపబడిన నాటకమగుటచే మూలమునందలి కథ కొలదిగా నట్లు మార్చుట యవసరమైనది. దానివలన ప్రత్యవాయమేమియును లేదు. అసౌకర్యము మాత్రము నివారింపబడినది. మండనమిశ్రుడు స్వయముగా నోటమి నంగీకరించుటయు ప్రకటితమైనది.

అటుపై విప్రబాలకుడు హస్తామలకుడగుట చక్కగా కూర్చబడినది. "నీ వెవ్వడవు? ఇట్లు జడునిగా నుంటివేమి? అని శంకరులడుగ నాబాలుడు చెప్పిన విషయ మొక్క పద్యములో "నే జడుడ నెట్లగుదున్? జడమే కడున్ ప్రవర్తించుట లేదె? చేతనమురీతిగ మామక సన్నిధానముంగాంచి........" ఇత్యాది విషయములతో ప్రకటింపబడినది. ముందుకాబోవు తోటకాచార్యుల విషయమునవలె నిచ్చటగూడ నింకొకటి రెండు పద్యములలో హస్తామలకీయ సారాంశమును మరికొంత వివరించిన నింకను శోభాయమానముగా నుండెడిది.

పంచమాంక ప్రథమరంగమున శంకరుల "కింజ్యోతిస్తవ?" యను నేక శ్లోకిని శంకర పద్మపాద ప్రశ్నోత్తర విషయముగ పేర్కొని దానిని సురేశ్వరులు యేకసంథాగ్రాహిత్వ ప్రకటన కుపయోగించునట్లు నాటకమున నిముడ్చుట యుచితముగా నున్నది. ఆ శ్లోకానువాద మిట్లున్నది.

ఉదా :- ఎయ్యదిజ్యోతి నీకు? పగలీరవి; రే యుడు చంద్రదీపముల్ । అయ్యవి చూడఁ గంటి? కను; నేయ్యవి మూసిననేది? నామనం, బయ్యది లేనివేళనేది? యపుడు జ్యోతిని నేనే; యందుచే । నెన్యెడ జ్యోతి నీవాకడ నేనుమ; యానవునో గురుత్తమా॥

ఇది "కింజ్యోతిస్తవ?" లను నీ క్రింది శ్లోకానువాదము.

కింజ్యోతిస్తవ భానుమానహనిమే రాత్రౌ ప్రదీపాదికంస్యా దేవం రవిదీప దర్శన విధౌకింజ్యోతి రాఖ్యాహిమే చక్షుస్తస్య నిమీలనాది సమయే కిం ధీర్ధియోz దర్శనే కిం తత్రాహమతో భవాన్ పరమ కంజ్యోతిస్త దస్మిప్రభో॥ అటుపై గిరి, తోటకాచార్యుడైన విషయమున నాత డాచార్యుల, చాటీల సుతుకమునే తన మనమున రచించి మననము చేసికొనుచున్న తోటక వృత్తములను శంకరులడుగగా బహిర్గత మొనరించుట, మూలమునందు విన్నమైనను నిచ్చటగూడ యుక్తముగ నుండుటచేత నీమార్పు యోగ్యముగానేయున్నది. ఇచ్చట శ్రీ గురుమహిమచే నాతనికి తత్త్వ జ్ఞానమును సరసకవిత్వమును సిద్ధించినట్లు గ్రహించుట కవకాశమున్నను మార్పు గిరిమొక్క పాత్రమునకు మరికొంత శోభను కూర్చినది. తోటక వృత్తము లీ క్రింది విధముగ చిత్తప్రబోధమును, బ్రహ్మవిద్యా సారమును ప్రకటించుచున్నవి.

తోటకములు (1) మన మా విషయాస్త్రము మానుమువే! తనువే నను భ్రాంతి వృథావినవే । తనవేనిను ధన్యముగా - నిత వే । యమునూనమదేల గుణాం బుధివే॥

(2) మమకార మహాంకృతి మానుము కో । శమునై దిది వానికి సాక్షివి, నీవమలుండవు నీవధిలాత్మవపీ । వమనస్కుడవ వాప్యతవార మహా ॥

(3) స చరాచరలోకము సర్వము నీ । వి చయం బుపఘించిరి యిజ్జలధిన్ । ప్రమరంబగు - నిల్చుచు - భ్రమించుచు - నీ । వపలుండవనేయుచ వన్యాటికిన్ ॥

(4) పడిమున్గితి సంసృతివారిధిలో । కడమున్ను పథానము గానక నీ యడుగుంగవ నావగ నందితి నే! దడగెన్ గడగంప్లవమా వరదా ॥

పంచమాంక ద్వితీయరంగమున శంకరశిష్య చతుష్టయము శృంగగిరియందు సమావేశమై గురువులయనుజ్ఞత కారణముగ నాటి గోష్ఠి కధ్యక్షస్థానము నుండుటకు సురేశ్వరుల నెన్నుకొనుటయు నాతడానాటి కార్యక్రమమును సమర్థతతో సాగించు టయు నాసమయమున శంకరులచటకు వచ్చి యాకార్యపద్ధతిని చూచి సంతోషించి "సురేశ్వరుని శృంగగిరి పీఠాధిపత్యమునకు నాందీపూజ నిర్వర్తింపబడినదిగదా? నాకిది పరమానంద" మని చెప్పి పీఠచతుష్కమును నిర్వహించుటకు శిష్య చతుష్టయము నాదేశించుటయు కడుచక్కగా కూర్చబడినవి.

చివరకు భరతవాక్య రూపమైన శ్రీ జగద్గురువుల యాశీస్సులిట్లు ప్రకటింప బడినవి.

చం॥ స్థిరగతి నిల్చుగాత జగతిన్ శ్రుతి సమ్మతభూమతత్త్వమే
నిరతము సన్మతామిత తృణీకరణా చరణ ప్రవీణమై
నరులు తరింత్రుగాత జనన ప్రళయావిల సారమారసం
సరణ గభీర నీరనిధి జ్ఞానపరీత తరీ విహారులై ॥

శంకర విజయమును నాటకరూపమున నీ కవి కడుసమర్థతతో రంగస్థల ప్రదర్శనమున కనుకూలమగునట్లు రచించినారు. ఇందలి పద్యము లన్నియు తాత్త్విక భావభరితములై కంఠస్థము చేయదగినవిగా నున్నవి. పద్యములు ధారాశుద్ధి గలిగి భాషాభావముల రెండింటియందును పటుత్వముతో నొప్పియున్నవి. శైలి సరసము, సరళము, జాతీయమునై యున్నది. ఇతి వృత్తమున చేసిన మార్పులలో నించుమించుగా నన్నియును ప్రయోజనాత్మకముగను తత్త్వ్యానసక్తి పాత్రౌచిత్య పరిపోషణ చణములైనవిగను నున్నవి.

ఇది చదివినచో వేదాంతగ్రంథము చదివిన విజ్ఞానమును కావ్యమును చదివిన

యానందమును లభింపనగుటలో సంశయములేదు. ఇది ప్రదర్శన యోగ్యమగుటంకను విశేషము.

ఇది ప్రబోధ చంద్రోదయమువలె తత్త్వగర్భితేతి వృత్త సంకలిత నాటకము గాకపోయినను ప్రసంగవశమున తత్త్వప్రవచన ప్రబోధములను గూర్చు ఘట్టము లతోగూడి శాంతరసప్రధానమై జిజ్ఞాసువులకేగాక సాధారణులకును సంతృప్తిని సమ్మోదమును కలిగించునదిగా నున్నది. ఇది యద్వైత తత్త్వాభిమానులగు జనులలో బహుళ వ్యాప్తినొంది వారి యాదరాభిమానములను విశేషముగా పొందుటకు తగిన యోగ్యతగలిగి యున్నది.

గ్రంథకర్త తత్త్వసాహిత్యశాస్త్రముల యందును, పాండిత్యమును నుభయ భాషా కవితా చాతుర్యమును కలిగినవా డగుటచేతను ఇతివృత్త మద్వైతతత్త్వస్థాప కులును నద్వితీయ ప్రతిభానుభవశాలియు నైన శ్రీ జగద్గురు శంకరాచార్య చరిత్ర మగుటచేతను ఈ నాటకము కడుప్రశస్తమై యున్నది. శంకర మండన మిశ్ర సంవాదము సరళమైన భాషలో సర్వజన సుబోధముగా నుండుటచే శంకర తత్త్వము నెల్ల తెలుగుట కనుకూలముగా నున్నది, ఇందు సందర్భానుసారముగ ననేక శ్రుతి వాక్యము లుల్లేఖించబడినవి.

త్రోటకాచార్యునిచే చెప్పించిన "అగానువాడు కాడు, రుజనంది తపించెడు వాడు మందులం। గైకొన నర్హుడట్లె యధికారులు శోకములందు వారలా। శోకమపాకరింపగ ద్విజుల్ నృపులారు జులంప్రభిజుల్ సతీ। లోకము లంత్యజుల్ జగతిలోన యథోచిత బోధ్యమానులై" ॥ యనెడి పద్యము; సురేశ్వరులచే "మా తోటకుల, మతజాతి సామరస్యము మాననీయ"మని ప్రశంసింప జేయుట, మరియు శంకర శిష్యచతుష్టయము గోష్ఠికి సురేశ్వరుని నేకగ్రీవముగా నెన్నుకొని యధ్యక్షునిగా జేయుట యనునవి ఈ కాలానుగుణములై యొప్పుచున్నవి.

ఆత్మవిద్యకును నంగనా కళాస్థానములకును సంబంధమేమి ? ఏకాదశీ వ్రతములో యువనోత్సవమా ! అకాననివాని కన్నముజీర్తిని కలిగించునట్లు, ముముక్షతలేని వారి కీవిద్య వైపరీత్యమును కల్గింపక మానదు. మొదలగు వాక్యము లాయా సందర్భములయందు కడు యోగ్యముగా కూర్చబడి కావ్యశోభను పెంచినవి.

మొత్తముమీద నీ నాటక ముత్తమస్థాయికి చెంది బహు సుజనామోద యోగ్యమైయున్నది.

— ० —

# యోగతారావళి

## రచయిత :- లోకారెడ్డి రామకృష్ణమాచార్యులు

ఈ గ్రంథ మముద్రితము. దీని ప్రతి యొకటి చెన్నపురిలో ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున నున్నది. గ్రంథసంఖ్య డి. 2173. ఇది శ్రీ శంకరాచార్యులు సంస్కృతమున రచించిన యోగతారావళికి పద్య రూపమున చేయబడిన యనువాదము. దీని రచయిత లోకారెడ్డి రామకృష్ణమాచార్యులు. ఇతని వంశాదికము లెవ్వియు నిందు తెలుపబడలేదు. రెండు పద్యములలో నితని యింటిపేరు, పేరు మాత్రమే తెలుపబడినవి. గ్రంథమున కొల్లలుగా గనబడు తప్పులలో కొన్ని ఈ పద్యములలో కూడ నుండుటచే కొంత యోచనపైగాని భావము స్పష్టముకాదు.

శా॥ శ్రీకల్యాణ గుణుండు ఆశ్రిత జన శ్రేయత్కృపాక్షుండునన్
లోకారెడ్డి కులాద్య డీ భువనముల్ లోవెల్వలన్ జూపునా
రాకా చంద్రుడు రామకృష్ణ గురుడున్ రంజిల్లు తారావళిం
లోకుల్మెచ్చగ జెప్పె తత్త్వ కవితారూఢిం బ్రమోదంబుగన్ ॥

కం॥ శ్రీరాడ్గోవింద గురు స । దారాధ్య సుశిష్యశంకరాచార్యముఖో
దీరిత యగు తారావళి । అరసి తెనిగించె కృష్ణమాచార్యుడిలన్ ॥

ఇందలి రెండవ పద్యమునుబట్టి యీతని పేరు కృష్ణమాచార్యుడనియు, మొదటి పద్యమునుబట్టి ఈతని ఇంటి పేరు "లోకారెడ్డి"యనియు, నూహింపవచ్చును. "రామకృష్ణ గురుడున్" అని యుండుటచే నీతని పూర్తిపేరు రామకృష్ణాచార్యుడై యుండునని నిశ్చయింప నవకాశము కలుగుచున్నది.

ఇతనికాలము నిశ్చయించుట కాధారములు లభించుటలేదు.

ఇందలి విషయము కొంత హఠరాజయోగములకులను విశేషముగ లయయోగమునకు సంబంధించినది. అందు చివరకు నిర్వికల్ప సమాధియు, ముక్తి ప్రదమగు నొక శ్రవణాతీత నాదమును ప్రస్తుతింపబడినవి. తారావళి సాధారణముగ నిరువదియేడు పద్యములతోగూడి యుండును. ఇందు మూలమున నధిక పాఠముగాగల మూడు శ్లోకములతోగలసి మొత్తము ముప్పది శ్లోకములున్నవి. అనువాదకర్త వాని నిరువదియెనిమిది పద్యములలో ననువదించెను. విషయ సంగ్రహము :-

గీ॥ ధర సపాద లక్ష లయావధానములు స
దా శివోక్తంబులై చాల దనరు చుండు

వాటిలో నియమముచే వర్ణ్యమగును
పలరు నాదాను సంధాను నాత్మనెంతు ॥

కం॥ పూరిత రేచక కుంభక । పూరకముల నాడు లన్ని పొలుపొందంగా
తీరియనాహత పద్మపు । దారిన్ స్వాత్మప్రబోధ దా జనియించున్ ।

పిదప నాదానుసంధానము స్తుతింపబడినది. అటుపై హఠయోగ సంబంధమైన జాలంధరోడ్యాణ మూలబంధములచే కుండలిని చలనమగుననియు దాని ఫలితముగ సహస్రారమునుండి స్రవించునట్టి యమృత ధారల పానముచేయువారు ధన్యులనియు చెప్పబడినది. తరువాత కేవల కుంభకము యొక్క ప్రాశస్త్యము తెలుపబడినది.

అటు పిమ్మట రాజయోగమున నున్న నిస్థితినొందుట కుపాయము జగత్తు నుదాసీనభావముతో జూచుచు సంకల్పములను సమూలముగ నాశనము చేయుటే యనియు ప్రత్యగాత్మయందు మనస్సు నిలుపుటవలన ప్రపంచ చింతారహితమును సుఖకరమును నగు నొక యపూర్వనిద్ర యావిర్భవించుననియు ప్రాణవాయువు బ్రహ్మరంధ్రమున ప్రవేశించినప్పు డొక శ్రవణాతీతమగు నాదము వినబడుననియు అప్పుడు ముక్తి నిశ్చయమనియు చెప్పబడినది.

అనువాదము చాలవరకు మూలానుసారిగనే యున్నది. కాని కొన్ని కొన్ని చోట్ల మూలమునకు కొంత భిన్నముగ నున్నది. ఉదా :- మూలము

విశ్రాంతి మాసాద్యతురీయ తల్పే। విశ్వాద్యవస్థాత్రితయోపరిస్థే।
సంవిన్మయీం కామపి సర్వకాలం । నిద్రాంసఖే నిర్విశ నిర్వికల్పం ॥

గీ॥ మూ డవస్థలమీద దా మొనసియున్న
నాలుగో తత్త్వము శాంతి గీలుకొల్పి
నిర్మల జ్ఞాన నిర్విషయ నిర్వికల్ప
యగుచు దనరారు నొకనిద్ర నాశ్రయింతు ॥

ఇందు మూలమున క్రియాపదము మధ్యమ పురుషయం దున్నది. మరియు ) యనువాదమున నున్న "నిర్విషయ" యను పదము మూలమున లేనిది.

ఉదా :- మూలము

బ్రహ్మరంధ్ర గతేవాయౌ । గిరేః ప్రస్రవణం భవేత్ ।
శృణోతి శ్రవణాతీతం । నాదం ముక్తిర్న సంశయః ॥

కం॥ పవనము నెలయేటి గతిన్ । జవనమునం బ్రహ్మరంధ్ర సంగతమగుచో
శ్రవణా తీతం బగునొక । రవము వినం గ్రబడు నదియె ప్రాప్యం బనఘ ॥

ఇందు మూలముననున్న "గిరేః ప్రస్రవణం భవేత్" "ముక్తిర్న సంశయః" అనువాని కనువాదము సరిగా లేదు.

# వి వే క చూ డా మ ణి

## రచయిత :- శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మ

అద్వైత తత్త్వ ప్రతిష్ఠాపకులైన శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారిచే రచింపబడిన ప్రకరణ గ్రంథములలో "వివేక చూడామణి" యగ్రగణ్యమైనది. అద్వైత తత్త్వ విషయమును సంపూర్ణముగ సరళశైలిలో సూత్రప్రాయముగ సంగ్రహించి చెప్పిన గ్రంథమగుటచే దీనికిట్టి ప్రశస్తి కలిగినది. ఇది శంకరాచార్యులవా రేగ్రంథమునకో భాష్యముగనో వ్యాఖ్యానముగనో వ్రాసినదిగాని యే మూలగ్రంథమునో సంగ్రహించి వ్రాసినది గాని గాక స్వప్రతిభతో ముముక్షువుల సుఖబోధోత్పత్తి కొఱకు రచించిన గ్రంథమగుటచే దీనియందు వారి యభిప్రాయములు తర్క వ్యాకరణాది శాస్త్రప్రమేయము విశేషముగ లేకుండుట సహజముగ స్పష్టముగ ప్రకటింపబడినవి. అంతేకాక ఈ గ్రంథమున కింతటి సౌలభ్యము వాటిల్లుటకు కారణము బ్రహ్మతత్త్వమును తన తల్లికి కరతలామలక మగునట్లు బోధించుటకై శంకరాచార్యులవారు దీనిని రచించి యుండుట యను వాడుకయు లోకమున నున్నది. ఆ విషయమునే శ్రీ దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారు తమ యాంధ్రీకృత వివేక చూడామణి పీఠికలో నిట్లు తెలిపియుండిరి.

మ॥ అతిగంభీరము బ్రహ్మతత్త్వము కరస్థామ్రంబుగా దల్లికిన్
బ్రతిబోధింప దలంపుచారి భగవత్పాదుల్ వినిర్మించి రీ
కృతి చూడామణి సంద్రు గొందఱది యన్లైగానిలో సుప్రగ
ల్భత మిన్నందుజగద్గురూక్తి కిటు సౌలభ్యంబు వాటిల్లునే ॥

మరియు నీకృతి యాచార్యులవారి రచనలలో చిట్టచివరిదనియు నందుచేతనే వారు దీనినింత యుత్కృష్టముగను సుగమముగను రచించి వివేక చూడామణి యను పేరు పెట్టిరనియు కొందరద్వైత తత్త్వ శాస్త్రపండితుల యభిప్రాయము. ఈ యభిప్రాయములన్నిటికంటె మిన్నయైన విషయము లొకటి రెండున్నవి. అవి శ్రీ వివేకా

నందస్వామి ఈగ్రంథమునందలి వాక్యములనే ప్రమాణముగా గ్రహించి పెక్కుతావుల నుదహరించియుండుట అంతకంటె ముఖ్యముగా శాస్త్రపరిజ్ఞానమునుగాని గ్రంథాపేక్షనుగాని ప్రోత్సాహపరచు పద్ధతిగాక నాత్మవిచారముతోనే ముక్తినిసాధించు పద్ధతిని తమ జీవితాంతమువరకు ప్రబోధించుచుండినట్టి యనుభవ జ్ఞానియైన భగవాన్ శ్రీ రమణమహర్షులు స్వయముగా దీనిని ద్రావిడ భాషలోనికి వచనముగా ననువదించుట యనునవి.

ఈ గ్రంథ ప్రాశస్త్యమున కింతకంటె వేరు ప్రమాణ మనవసరము.

శ్రీ శంకరాచార్యుల వారీగ్రంథమున తత్త్వ జిజ్ఞాసాధికారా ద్యనుబంధ చతుష్టయ నిరూపణానంతరము శుభేచ్ఛ మొదలు విదేహముక్తివరకుగల జ్ఞానభూమికల నేడింటిని వివరించియున్నారు. ఇందు వారు వారిభావములను సరళమైన భాషలో స్పష్టముగనే ప్రకటించియున్నను అద్వైతులలోనే గల వివిధ సంప్రదాయముల వారు శ్రీ మద్భగవద్గీత వలెనే వీనినిగూడ, వారి వారి పద్ధతుల కనుకూలముగ వ్యాఖ్యానించి బోధించుచున్నారు. ఏది ఎట్లైనను ఈ గ్రంథమున కున్నంత ప్రతిష్ఠ మరి యే ఇతర వేదాంత ప్రకరణ గ్రంథమునకును లేదని చెప్పుటలో నతిశయోక్తి లేదు.

ఈ గ్రంథమును పలువురు పండితు లాంధ్ర పద్యకావ్యముగ ననువదించిరి. అందు మొట్టమొదటివాడు నడకుదుటి రామన యని తెలియుచున్నది. ఇతడు దీని నైదాశ్వాసముల కావ్యముగ రచించెను. శంకరాచార్యులవారి "హరిమీడే" స్తవమను అద్వైత వేదాంతసార ప్రబోధకమగు కృతినిగూడ నీత డాంధ్ర పద్యరూపమున ననువదించెను. కాని ఈ రెండును నేడలభ్యములే.

ఈ కవి 19వ శతాబ్దమున నుండినవాడు. ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. కౌశిక గోత్రజుడు. తూర్పు గోదావరి జిల్లా నివాసి. ఇతడు ప్రభులింగ లీలనుగూడ పద్యకావ్యముగ రచించెను.

ఈ విషయములు శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు తమ యాంధ్రకవి సప్తశతిలో తెలిపియున్నారు.

వివేక చూడామణికి రెండవ యనువాదము శ్రీ కోపూరు పట్టాభిరామ శర్మగారిది. మూడవది శ్రీ మొటపర్తి చినసోమయ్య చౌదరిగారిది. నాలుగవది శ్రీ దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారిది. ఐదవది శ్రీ కావూరి పూర్ణచంద్రరావుగారిది. ఇందైదవది యసమగ్రముగ ముద్రితమునై యున్నది.

వీరందరి యనువాదములు కొంచె మించుమించుగా మూలానుసారులై శ్లోకమున కొక పద్యముగా చేయబడినవి.

# వివేకచూడామణి

## — ఆంధ్ర పద్యానువాదములు

వివేక చూడామణికి గల యాంధ్ర పద్యానువాదములలో ప్రస్తుతము లభ్యమగునవి మూడు మాత్రమే. అందు మొదటిది శ్రీ కోవూరు పట్టాభి రామశర్మగారిది.

శ్రీ పట్టాభి రామశర్మగారు నెల్లూరునకు సమీపమున గల కోవూరు గ్రామ నివాసులుగా నుండిరి. వారు 19వ శతాబ్ది యుత్తరార్ధమునను ఇరువదియవ శతాబ్ది పూర్వార్ధమునను ఉండినవారు. వారి మాతృభాష కన్నడము. వారి పూర్వు లాంధ్ర దేశమునకు వచ్చి స్థిరనివాస మేర్పరచుకొనిరి. శ్రీశర్మగారు కొంతకాలము ప్రభుత్వోద్యోగిగా పనిచేసి యుపకార వేతనము తీసికొనిరి. వీరికి మొదటి నుండియు దైవ భక్తి తత్త్వచింతన హెచ్చుగా నుండుటచే వారు చాల నిరాడంబరముగా నుండి విశేషముగ సద్గ్రంథగోష్ఠిలో నుండువారట. వారి మరణము ప్రారబ్ధవశమున దారుణముగ సంభవించినట్లు తెలిసినది. వారొకరుబయట నిద్రించుచుండగ నెవ్వడో యొక డాతనిని తన శత్రువని భావించి హత్యగావించెనట. సంస్కృతాంధ్రములందు మంచి ప్రవేశముతో పాటు చక్కని రచనచేయు సామర్థ్యము గూడా వీరు సంపాదించిరి. వారి దృష్టి సాధారణ సాహిత్యముపైగాక నద్వైతతత్త్వము వైపునకు మరలియుండుటచే వీరి కవిత్వమూ వైపునకే ప్రసరించినది. వారి గ్రంథములలో ముఖ్యమైనవి మూడు లభ్యమైనవి. (1) వివేక చూడామణి కాంధ్రపద్యానువాదము (2) శ్రీమద్భాగవతైకాదశస్కంధము (3) శ్రీమద్భగవద్గీతాసారము. (ద్విపద). శ్రీ శర్మగారు వివేక చూడామణి యనువాదమున తమ కుల గోత్రముల నిట్లు తెలిపిరి.

సీ॥ బడగణాదటి కన్నడ బ్రాహ్మణుండను బు। గ్వేది వైశ్వామిత్ర విదితగోత్రు
డాశ్వలాయన సూత్రుఁడగుచు గోవూరి వేం। కట రమణార్య సత్కర్మవశత
నాయన పత్ని నారాయణమ్మకు బుట్టి। హరిని పట్టాభిరామాఖ్య నొంది
పెద్దల సేవించి నిష్ఠుర సాలించి। గురు కృపచే నెఱుంగుటచు మాని

గీ॥ శంకరుడు సెప్ప నీ సర్వశాస్త్రసార
మైన గ్రంథంబును తెలుగునందు వ్రాసె
దీనిగని తప్పు లొప్పులుగా నొనర్చి
ధన్యులగు వివేకి మూర్ధన్యులెల్ల ॥....

వీ రీగ్రంథమును రచించిన కాలమును విభూతి వృత్తములో నిట్లు చెప్పిరి.

విభూతి వృత్తము :-

బాణ ఖాజ చంద్రులం బ్రమాణమాన వర్షమం
దే నొనర్చితి బాల్కిలో దీనినాంధ్ర పద్యముల్॥

బాణ, ఖ, అజ సంఖ్యా సంజ్ఞలనుబట్టి యీ సంవత్సరము 1905 అని వ్యక్త మగుచున్నది.

ఈ గ్రంథము 1906వ సంవత్సరమున ముద్రింప బడినది. వారీయనువాదము నప్పటికి పదేండ్లక్రిందటనే చేయనారంభించినట్లును, ననుభవము చాలనందున నాపని సాగకపోవుటచేత నప్పటికి విరమించి కొంతకాలము శ్రీగురు నరసింహదాసుగారి వద్ద వేదాంతవిద్య నభ్యసించి తత్త్వరహస్యములు బాగుగా తెలిసికొని యీ యనువాదము ప్రారంభించి రెండునెలలలో పూర్తిచేసినట్లును ఈ గ్రంథార్థము నందరు నెఱిఁగి ధన్యులుగావలె ననుటయే తమ సంకల్పమనియు, నీ గ్రంథమునకు వారు వ్రాసిన యుపోద్ఘాతములో నున్నది.

ఈ గ్రంథముద్రణమునకు సహాయపడినవారు కడప పురవాసులును గురు నరసింహదాసుగారి శిష్యులును నగు పెంచ్యాల సుబ్బయ్యయను వైశ్యుడును, తంజావూరు గంగయ్య యను చతుర్థుడునని గ్రథమున నున్నది.

ఈ యనువాదము మూలమునందలి శ్లోకమున కొక పద్యముగా చేయబడినది. గ్రంథమందలి విషయము నూట ఇరువది యంశములుగా విభజింపబడి వరుసగా నాయంశములకు సంబంధించిన శ్లోకములు దాని క్రింద యనువాదము వ్రాయబడి ప్రకటింపబడినది.

గ్రంథాదియందు మంగళాచరణమున శ్రీ శంకరాచార్యులు శంకరుని యవతారముగా స్తుతింపబడిరి. పిదప వివేక చూడామణి విశిష్టతయు, అనువాదకర్త యాశయమును నిట్లు తెలుపబడినది.

తే॥ గీ॥ శంకరాచార్య కృతము సంసారబంధ
మోచనము దుఃఖజాలనిర్మూలనంబు
నగు వివేక చూడామణి ననువుమీర
నాంధ్ర మొనరింతు లోకహితార్థినగుచు॥

ఉ॥ శంకర దేశిక ప్రవరుసత్కృతులం దిది బ్రహ్మతత్త్వమున్
మంకులకైన బోధపడుమాడ్కిన కమ్మని తేట మాటలన్
బొంకముగాగ చెల్పుట చెనుంగొనరించెద దీని ప్రేమచే
శంకలు వాయ నిందుగల సత్పథమున్ గొనిపోవువానికిన్.

ఉ॥ కన్నులు లేనిమానవుని గన్నులు గల్గినవాఁడు బ్రోవ నెం
ట న్నడిపింపకొంచు సరి దారిగ వచ్చుట సంభవమ్ముగా
మున్నగువాని నాతనికి బోలగఁజెప్పుచు గాని వాక్రమిన్
జన్నవిధాన శంకరుడు సత్పథ మన్నుల కిందు జూపెడిన్.

గ్రంథాంతమున ఇష్టవాక్య గర్భశార్దూల విక్రీడిత వృత్తమున్నది. అందలి యక్షరములలో మొదటినుండి ప్రతి పదునొకింట మొదటి యక్షరమునుతీసికొన్నచో నిష్టవాక్య మేర్పడును. ఇందేర్పడు నిష్టవాక్యము "ఓం తత్సత్ బ్రహ్మార్పణమస్తు" అనునది.

ఇష్టవాక్య గర్భ శార్దూల విక్రీడితము :

ఓంకార ప్రతిపాదితా, తత మహావ్యాహార్థ: సత్సత్క్రియా
వంక ధ్వంసక బ్రహ్మపూజిత పదా బ్రహ్మే హ్యహమా దుర్భ్రమా
హం కార్పణ్య విమోచన ప్రవణ నిత్య శ్రీపదా తత్త్వము
స్యం త్రైకాకృతి నీవె స్తుత్యుడవు నీకా మ్రొక్కు శ్రీ శంకరా।

వివేక చూడామణికి గల ముద్రితాంధ్ర పద్యానువాదములలో రెండవది శ్రీ మొటపర్తి చిన సోమయ్య చౌదరి గారిది.

శ్రీ చౌదరిగారు పశ్చిమ గోదావరి జిల్లాలోని వెంపలూరు వాస్తవ్యులు. వీరీశతాబ్దివారే. వీరి తల్లిదండ్రులు సీతమాంబా సుబ్బయ్యలు. వీరు సువర్ణ ఫల గోత్రులు. వీరి గురువు శ్రీ చింతలపాటి లక్ష్మీపతి. గ్రంథాంతమున నున్న గద్యలో 'శ్రీరామచంద్ర కరుణారస సంప్రాప్త సరస కవితా చిత్ర' యను విశేషణము తమ నామమునకు జేర్చుకొనిరి· వీరీగ్రంథమును తమ సోదరుడగు రామస్వామి చౌదరి కంకితము గావించిరి· వీరికిసంబంధించిన వివరము లింతకంటె విశేషముగ నేమియు తెలియలేదు. ఈ గ్రంథము శ్రీ శంకరాచార్యకృత వివేక చూడామణికి ప్రథమాను వాదమని తమ యభిప్రాయమును తెలిపియుండుటచే వీరు శ్రీ కోపూరి పట్టాభిరామ శర్మగారి యనువాదమును గూర్చిగాని, నడకుదుటి రామసోమిక్క యనువాదమును గూర్చిగాని వినియుండలేదని స్పష్టమగుచున్నది. గ్రంథపీఠికలో వీరు శ్రీ శంకరా చార్యులవారి జీవితమును గూర్చి ప్రస్తావించి, యందు శ్రీ శంకరుల యవతారము విక్రమశకము 14వ సంవత్సరము ఈశ్వర సంవత్సర వైశాఖ శుద్ధ పంచమి యని 'ఆర్ష విద్యా సుధాకరము'న నున్నట్లు తెలిపిరి.

వీ రీయనువాదమును మూలమందలి ప్రతి శ్లోకమున కొక్కొక్క పద్యముగా చేసిరి.

లభ్యమైన వివేక చూడామణి యాంధ్ర పద్యానువాదములలో మూడవది శ్రీ పన్యాల సుబ్రహ్మణ్యశర్మగారిది. శ్రీ పన్యాల సుబ్రహ్మణ్య శర్మగారు నెల్లూరు వాస్తవ్యులు. ఈ శతాబ్దమున ప్రసిద్ధికెక్కిన విద్వత్కవి శ్రేష్ఠులలో నొకరు. విమర్శ విద్యాస్వతంత్ర, అభినవ తిక్కన, సాహిత్యస్థాపక మొదలయిన బిరుదములు పొందినవారు. అద్వైత సంప్రదాయ మర్మజ్ఞులు. వీరి దీక్షా గురువులు శ్రీ సోమపూడి లక్ష్మీనారాయణగారు. (పరమ గురువులు) రామబ్రహ్మేంద్ర స్వాములవారు. పరమేష్ఠిగురువులు శ్రీ సచ్చిదానంద స్వాములవారు). తల్లిదండ్రులు కామాంబికా సాంబాచార్యులు. కౌండిన్యస గోత్రులు- ఆశ్వలాయన సూత్రులు. వీరింతకు పూర్వ మాచార్యులవారి సౌందర్యలహరిని యనువదించియుండిరి. వీరీకృతిని 1942 వ సంవత్సరమున రచించి శ్రీ శంకరాచార్యులవారికే యంకిత మొనర్చిరి. కృత్యవతారికయం దాచార్యులవారిని స్తుతించి, వారి మహిమాతిశయమును వర్ణించి

శా॥ ఆముష్మైక సుఖ యున్న నీదగు ప్రసాదా వాప్తియే యున్నదే
వా యుష్మచ్చరితామృతమ్ము వటుకావ్యస్థాళి నిండించి వే
మాయాంధ్రాళికిఁ బంచ గోర్కి కల దాత్మన్......."

అని వ్రాసియుంటిన దానినిబట్టి వీ రీకృతిని తమ వృద్ధాప్యమున వ్రాసినట్లు తెలియుచున్నది. వారి యీ రచనోద్దేశమును, అనువాదమును గూర్చిన యభిప్రాయమును తెలుపు నీ క్రింది పద్యములు పరిశీలింపదగినవి.

సీ॥ కృతి వ్రాయుమని యహర్నిశమునన్ ప్రేరించు
హితులకు సంప్రీతి హేతు వనియు
పెడత్రోవలం జరించెడు మానసికవృత్తి
మరించి మరలింప మార్గ మనియు
ఏ నిమిత్తము చేతనేని యాచార్యోక్తు
ల దలంపఁ గలిమి కల్యాణ మనియు
ప్రకరణార్థముఁ బఠింబడి చింత సేయుట
బ్రహ్మపగలి కొందు బాట యనియు
తే॥గీ॥ తలచి బుధ లొక్కరుండు మండలమువాడె
(శ్రీ కోపూరి పట్టాభిరామశర్మగారు)
తెలుగు చేసిన చెరిగియు దీని మరల
నాంధ్రమున జెప్ప సువిహితోద్యముడ నైతి
బాహ్మవిస్మానమర్యాద బతపడంగ॥

మ॥ పదమొక్కండును హర్షదాయకము చెప్పన్ రాని శాస్త్రార్థ సం
పద సొంపారు జగద్గురూక్తి సుధ: యీ గ్రంథంబు చేకొంచు నే
ర్కం దెలిగింప వశంబె దీని, విబుధుల్ కావ్యప్రభావోజ్జ్వలి
య్యాడి పాటింపి గ్రహింపఁగాత గుణలేశాంశంబు లున్నట్లుగన్॥

శ్రీ కోపూరి పట్టాభిరామశర్మగారి యనువాదమును గూర్చి మాత్రమే ప్రస్తావించి యుండుటచే వీరు శ్రీ మొటపర్తి చిన సోమయ్యగారి యనువాదమును చూచి యుండలేదని తోచుచున్నది. వీరి యితర కృతులు (1) అభినవ సుమతిశతకము (2) అభిజ్ఞాన శాకుంతలానువాదము (3) భరతుడు మొదలగు వచనగ్రంథములు.

ఈ మువ్వురి యనువాదములను మొదట నొకదానితో నొకటి పోల్చి తారతమ్యమును గమనించి పిదప విడివిడిగా వారి భాష, శైలి మొదలగువానినిగూర్చి విచారించుట యుక్తము.

వివేకచూడామణియందలి మొదటిశ్లోకము నిర్గుణ బ్రహ్మ పరముగను, సగుణ పరబ్రహ్మమైన గోవిందుని పరముగను ఆచార్యులవారి గురువులైన గోవింద యోగీంద్రుల పరముగను అన్వయింప ననువుగా నిట్లున్నది.

శ్లో॥ సర్వవేదాన్త సిద్ధాంతగోచరం త మగోచరం
గోవిందం పరమానందం సద్గురుం ప్రణతోఽస్మ్యహం
దీనిని శ్రీ సుబ్రహ్మణ్యశర్మగా రిట్లనువదించిరి.

తే॥గీ॥ సర్వవేదాంతసిద్ధాంత సమధిగమ్యు
డనధిగమ్యుండు వాఙ్మనసాద్యములకు
సకలసుఖమూర్తి గోవిందునకు విభునకు
సద్గురునకేను భక్తి నంజలి ఘటింతు॥

ఇందు "పరమానందం" అను శబ్దము "సకల సుఖమూర్తి"గా ననువదింపబడినది. మిగిలిన భాగము మూలమునందలి భావమును బాగుగా స్ఫురింపజేయుచున్నది. దీనికి శ్రీ మొటపర్తి చినసోమయ్య చౌదరిగారి యనువాద మిట్లున్నది.

కం॥ సకలాగమాంత సిద్ధాం । తక విజ్ఞు డగోచరుండు తత్త్వానంద
ప్రకటిత చిత్తుండగు వే । శివకరు గోవిందు నతులు సేసెద నెప్పుడున్॥

ఇందు గోవింద దేశికునకే ప్రాధాన్య మిచ్చినట్లున్నది.

శ్రీ కోపూరి పట్టాభి రామశర్మగారి యనువాద మిట్లున్నది.

తే॥గీ॥ సర్వవేదాన్త సిద్ధాంత సత్యవాక్య
గోచరు నింద్రియాది కాగోచరాత్ము
నిత్యపరమాద్వయానంద నిర్మలాత్మ
మూర్తి గోవింద సద్గురు పేర్తు మదిని॥
ఇందును గోవింద సద్గురునకే ప్రాధాన్య మిచ్చినట్లు తోచుచున్నది.

మూలము :-
వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్
వైదుష్యం విదుషాం తద్వ ద్భుక్తయే నతు ముక్తయే.

మన్నా సుబ్రహ్మణ్య శర్మగారి యనువాదము:-
తే॥గీ॥ శబ్దఝరియు వాగ్వైఖరి శాస్త్రవ్యాఖ్య
వివరణాఖండపాండిత్యవిలసనమ్ము
విబుధులకును సాక్షాత్కారవిభవులకును
భుక్తికే కాని కాదు విముక్తి కెపుడు ॥

ముటపర్తిం పిన సోమయ్యాచార్యగారి యనువాదము :
కం॥ నదములగు వాగ్వైఖరి । పదమాధుర్యమ్ము శాస్త్రపరిచయమును గో
విదులకు నన్నప్రదములు । బుధచంద్రమ ముక్తిబోధములు గా వెపుడున్॥

కోప్పూరి పట్టాభి రామశర్మగారి యనువాదము:-
గీ॥ అటులె పండితులగువారి యలఘువిద్య
మాటపొంక ముపన్యాసపాటవంబు
శాస్త్రముల సర్థములు సెప్పుశక్తి యెల్ల
పొట్టకే గాని ముక్తికి త్రోవ గాదు॥

ఇందు మొదటిది మూలమందలి పదములతోగూడి సరియైన యనువాదముగ నున్నది. రెండవది మూలమునకు కొంత సన్నిహితముగ నున్నది. గాని మూలమందలి 'శాస్త్రవ్యాఖ్యాన కౌశలమ్' అను పదమునకు "శాస్త్రపరిచయ"మని యనువాదమును చేయబడినది. ఇందు కొంత పటుత్వము తగ్గినది. మూడవదియు మూలమునకు సరియైన యనువాదము కాదు. కాని మూలభావములు గ్రహించుటకవకాశమున్నది ఇందలి "యుపన్యాస పాటవంబు" అనునది మూలములో నిది కాదుగాని "వ్యాఖ్యాన కౌశలమ్" అను పదమునకు బదులు వాడబడినది.

మాయాలక్షణము: మూలము:-
సన్నా ప్యసన్నా ప్యుభయాత్మికానో। భిన్నా ప్యభిన్నా ప్యుభయాత్మికానో।

సాంగా వ్యసంగా ప్యుభయాత్మికానో। మహాద్భుతా నిర్వచనీయరూపా॥

అనువాదములు :- దు.సు.శర్మ :-

తే॥ గీ॥ సత్యమొ యసత్యమో ద్విలక్షణమొ మఱియు
సాంగమొ యనంగమో యుభయాత్మకంబొ
భిన్నమొ యభిన్నమో గాక ద్వివిధగుణమొ
మాయ తత్త్వం బనిర్వచనీయ మౌర॥

ఇందు మూలమున నున్న నేతి భావము పరిహరింపబడి సంశయగ్రస్తముగ విడువబడినది. భావము మూలానుసారికాదు. మూలమున సదసదాదు లేవియు కావని స్పష్టముగ నున్నది. ఏదియు కాకపోవుటచేత ననిర్వచనీయమగుటేకాక మహాద్భుతమైనదనియు చెప్పబడినది. ఈ యనువాదమున నా భావములు లేవు.

మొ. చి. సోమయ్య:-

గీ॥ కా దసత్తును సత్తును గా దుభయము
గా దభిన్నము భిన్నము గా దుభయము
కా దనంగము సాంగము గా దుభయము
నగు ననిర్వచనాద్భుత మగును మాయ॥

భాషాభావములు రెండింటను ఇది మూలమునకు చాల సన్నిహితమై యున్నది. అనిర్వచనీయ మనవలసిన చోట ననిర్వచనమనుట వ్యాకరణ దోషము.

కో. వ. శర్మ:-

గీ॥ ఉండునది లేనిదియు నుండి యుండనిదియు
వేఱది యటుకాని దీరెంటి వెరసినదియు
నవయవియు నిరవయవియు నా యుభయము
గాక కడు చిత్రమై చెప్పరాక యుండు॥

ఈ యనువాదము భావమున మూలము ననుసరించియే యున్నది.

అనాత్మవస్తు నిరూపణము: మూలము:-

మాయా మాయా కార్యం సర్వం మహదాది దేహ పర్యంతం।
అస దిద మనాత్మకం త్వం విద్ధి మరుమరీచికాకల్పం॥

అనువాదములు :- దు. సు. శర్మ:-

తే॥ గీ॥ అలమహత్త్వమాది దేహమ్మువరకు
నైన తత్కార్యములును మాయను గూడ
అరయు మీ వసత్యముగ ననాత్మగాగ
ఖకుసుమములట్లు మరుమరీచికలయట్లు॥

ఇది మూలమునకు చాలవర కనుగుణముగానే యున్నది. కాని "ఖకుసుమములట్లు" అనెడి యుపమానము విశేషమును అయుక్తమునై యున్నది. మరుమరీచికలకును గగన కుసుమమునకును లక్షణమున కొంత భేదమున్నది. ఈ రెండును ఒకేరకమైనవి కావు. గగనకుసుమము, కుందేటి కొమ్ము ఒక రకమైనవి. కొంచెమించుమించుగా శుక్తి రజతము, మరుమరీచికలు నొక రకమైనవి.

మొ. చి. సోమయ్య :-

గీ॥ అవని మహదాది దేహపర్యంత మెల్ల
మాయచే గల్పితం బని మాయ యనియు
నెండమావులవలె దోచుచుండు ననియు
నసదనాత్మకము లనియు నరయు మీవు॥
ఇది పూర్తిగా మూలానుసారియే యనవచ్చును.

మహావాక్యవివేకము : మూలము :-

తత్త్వంపదార్థ్యౌ మభిధేయ మానయోః బ్రహ్మాత్మనోః శోధితయోర్య దీత్థం
శ్రుత్యా తయోస్తత్త్వమసీతి సమ్యగేకత్వ మేవ ప్రతిపాద్యతే ముహుః ॥

అనువాదములు : (మ. సు. శర్మ :-)

చం॥ రవి యొకడుండగా జలములందు దరంగము నందును వార్ధియందు దా
నవిరతి వేఱు వేఱు గనవైనటు బ్రహ్మ మొకండె తా నుపా
ధివశత జీవుడై తగ్గునవేక్రియ నీశ్వరు డట్లు దోచు నీ
ద్వివిధుల నైక్యమున్ సుదువు వేదము "తత్త్వమసీ"తి వాక్యములన్॥
ఈ యనువాదము మూలమునకుపరిమితముకాకలఘు వ్యాఖ్యవలెనున్నది.

మొ. చి. సోమయ్య :-

గీ॥ అదియు నీ వనుపదముల నధిగమింప
నట్టి జీవాత్మ లేకీతి నరయబడగ
నదియు నీ వైతి వని తెల్పునట్టి శ్రుతుల
నైక్య మాపాద్యమయ్యె జీవాత్మలందు॥
ఇది మూలమునకు సన్నిహితమై యున్నది.

కో. వ. శర్మ :-

గీ॥ అదియు నీ వనుమాటల బొదలు నట్టి
బ్రహ్మమును నాత్మ నీరీతి బరగ నరయ

తత్త్వమసి యను శ్రుతి నవి తడవ తడవ
కొక్కటిగ నుంచె లెస్సగా నిక్కపగును॥

ఇదియును మూలానుసారముగనే యున్నది గాని మొ. చి. సోమయ్యగారి యనువాదమంత స్పష్టముగ లేదు.

బ్రహ్మభావమును బొందవలసిన విధము : మూలము :-

జాతినీతికులగోత్రదూరగం । నామరూపగుణదోషవర్జితం
దేశ కాల విషయాతివర్తియ । ద్బ్రహ్మ తత్త్వమసి భావ యాత్మని॥

అనువాదములు :- (దు. సు. శర్మ) :-

తే॥గీ॥ కులము గోత్రంబు జాతి నీతులును లేక
నామరూపములు గుణాగుణములు లేక
పరగుదిక్కాలముల దాటి బ్రహ్మ మెద్ది
'తత్త్వమసి' దీని దలపు డెందమునయందు।.

ఇది మూలానుగుణముగ నున్నది. తత్త్వమసి వాక్యముతో సహా మూల మందలి పదములు పెక్కుపయోగింపబడినవి.

మొ. చి. సోమయ్య :-

గీ॥ జాతికులగోత్రములు లేక నీచనామ
రూపగుణదోషములు లేక రూఢి దేశ
కాలవిషయాతివర్తియై క్రాలునట్టి
యాపరబ్రహ్మ మీ వని యరయు మెదను॥

మూలమందలి తత్త్వమసి వాక్యమొక్కటిం దుపయోగింపబడకపోయినను మిగిలిన పదములు పెక్కుపయోగింపబడినవి. మూలభావము స్పష్టముగ తెలియు చున్నది. భేద మిసుమంచితయు లేదు.

కో. వ. శర్మ :-

గీ॥ జాతియును నీతికులగోత్రచయము బాసి
నామరూపాదికమును గుణం బగుణము
లేక దిక్కాలములు నంద రాక యుండు
నది యె నీ వైతి విది మది గుదురు పఱుప॥

ఇదియు మూలానుగుణముగనే యున్నది.

మూలము :-

యత్పరం సకలవాగగోచరం । గోచరం విమలబోధచక్షుషా

శుద్ధచిద్ఘనమనాదివస్తు యః । బ్రహ్మ తత్త్వమసి భావ యాత్మని॥

అనువాదములు :- (దు. సు. శర్మ :-)

తే॥గీ॥ పరము సకలవాక్కులకగోచరము గోచ
రము విమలబోధదృష్టికి సమ మనాది
వస్తు వమలచిద్ఘన మైనబ్రహ్మ మెద్ది
తత్త్వమసి దీని దలపు మెందమునయందు॥

ఇది మూలము ననుసరించియున్నది.

మొ. చి. సోమయ్య :-

గీ॥ వచనముల కందరానిది పరము విమల
బోధచక్షువునను గన బొనగునదియు
శుద్ధచిద్ఘన మాదిన జూడబడని
యాపరబ్రహ్మ మీ వని యరయు మెదను॥

ఇదియును మూలానుసారిగానే యున్నదిగాని మూలమునందలి 'యనాది వస్తు' యనుచోట 'నాదిని జూడబడని' యను ప్రయోగము యుక్తముగా లేదు.

కో. వ. శర్మ :-

గీ॥ కడది మాటల కందంద కల్మష మగు
జ్ఞాననేత్రమునకు గాని రానరాదు
స్వచ్ఛ మగునొక్క తెల్వియనాది యేది
యది నీ వైతి విది మది గుదురుపఱుము॥

ఇది మూలమునందలి పద మొక్కటియైనలేక మూలభావమును భేద మేమియు లేక ప్రకటించుచున్న యనువాదమనవచ్చును. "చిద్ఘన" మనుదాని "కొక్క తెల్వి" యను ప్రయోగము కొంచెగా పటుత్వము తగ్గించునట్లనిపించును. "అనాది" శబ్దమొక్కటే మూలములోనిది ప్రయోగంపబడినది.

గ్రంథోప సంహారము : మూలము :-

సంసారాధ్వనితాపభానుకిరణప్రోద్భూతదాహవ్యథా
ఖిన్నానాం.........................................

అనువాదములు :- (దు. సు. శర్మ :-)

మ॥ సారిదిన్ సంస్కృతిమార్గదావతపనాంశుప్రోత్థదాహార్తులై
మరుభూమిన్ జలకాంక్షమై బహుగతిన్ భ్రాంతిల్లుపాంథాళికిన్
దరినే యున్న సుధాంబుధిన్ సుఖదముల్ బ్రహ్మైక్యముల్ జూపుధీ

నిరతిన్ శంకరుఁడివ్యవాజి యఁది యా నిర్వాణసంధాత్రి యై॥

ఇది ప్రౌఢముగ నున్నది.

మో. చి. సోమయ్య

సీ॥ పరమనిర్వాణసౌభాగ్యసంపద నొసఁగు । [illegible] తపనము
సంసార మను ధనుజనదుర్గమునందు । తా[illegible]ం బను లోనయుఁ బని
వరలుదాహవ్యథాభరమున ఖిన్నులై । భ్రమ[illegible] జలకాంక్ష బడి మరుభువి
సంచరించుచు నుండుజనముల కలరంగ । నిర[illegible]వ్యమ్ము సు గరపునట్టి

గీ॥ అద్వయం బగు పరమాత్మ యనగ వెలుగు
నతిసమీపాన తనలోన నలరునమృత
జలధి దాహము బోకార్చి శాంతిసౌఖ్య
మొసగి యాచంద్రతారమై యుండుగాక॥

ఇది సరళముగను, వివరముగను నున్నది. ఇందు "తనలోన నలరు" అను మాట మూలమున లేకున్నను నిందు జేర్చుట మూలమునకు మెరుగు బెట్టినట్లు శోభస్కరముగ నున్నది.

కో. వ. శర్మ :-

మ॥ నరులై సంస్కృతి బాట....................

ఇందు మూలమునందలి భ్రాన్త్యా (పరిభ్రమ్యతామ్) యను పదమును "అత్యాసన్న" (సుధాంబుధిం) అను పదమును విడువబడినవి. అందువలన భావ పుష్టి కొంత తగ్గినది. మిగిలిన విషయము మూలానుగుణముగనే యున్నది.

మొత్తముమీద నీ మూడనువాదములును మూలానుసారులుగా తృప్తికర ముగనే యున్నవి. కాని కొంత తారతమ్యమున్నట్లు పైన చూపిన యుదాహరణము లను బట్టి స్పష్టమగుచున్నది. వివరముగ విచారించిన నిట్టివి పెక్కు సందర్భములు గోచరించును.

శ్రీ దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారి యనువాదము కొంత ప్రౌఢమై తత్సమపద విశిష్టమై కొంత భాషాపాటవము గలవారికే యనుకూలముగ నున్నది. మూలము నిర్వచనమైనను నీ యనువాదమున నొక్కచోట (మహావాక్య విచార సందర్భమున) రెండు శ్లోకములు వచనముగ ననువదింపబడినవి. కవిత్వము భాషా శుద్ధి గలిగి కదళీ పాకమున నున్నది. భాష లాక్షణికము, నిర్దుష్టమై యున్నది. అను వాదము కొన్నిచోట్ల మూలమునందలి భావమును వివరించునదిగా నున్నది.

శ్రీ మొదలి చినసోమయ్య చౌదరిగారి యనువాదము మూలమున

దోషములేక, హెచ్చుతగ్గులు లేక, వ్యర్థపదము మచ్చున కొక్కటియైన లేక మూల మందలి గాంభీర్యము ప్రతికి పుష్టికొన్నట్లున్నది. భాషయు మూలమునందువలె సరిసరళమై సాధారణ భాషా పరిజ్ఞానము గలవారికి గూడ ననాయాసముగ బోధపడు నట్లున్నది. తత్త్వ విషయబోధ కిట్టి భాష మిక్కిలి యనుకూలమై యున్నది. కవిత్వము ధారాశుద్ధికలిగి ద్రాక్షాపాకమున నడచినట్లుండి చదువ చవులూరించునట్లు న్నది. అన్వయ క్లిష్టతగాని, యర్థసందిగ్ధతగాని యెచ్చటను గోచరింపదు. భాష లాక్షణికము నిర్దుష్టమునై యున్నది. చిట్టచివరి పద్యమొక్కటి మూలముకంటె కొంత వివరముగ నున్నది గాని మిగిలినవన్నియు మూలమునకు ప్రతిబింబములే యన్న ట్లున్నవి.

వివేక చూడామణికి గల యాంధ్ర పద్యానువాదములలో నిది యుత్తమ మన దగినది.

శ్రీ కోపూరి పట్టాభిరామశర్మగారి యనువాదముకూడ భావమున మూలాను సారిగనే యున్నది. భాషా విషయమున మూలమునకు కొంత దూరముగనున్నది. సాధారణముగ నిందు కొన్నిచోట్ల మూలమందలి పదము లుపయోగింపకుండుటకు ప్రయత్నము జరిగిన దనిపించును. తద్భవ దేశ్య పదప్రయోగ మెక్కువగా కనిపించు చుండుటచేత భావబోధ కప్పుడప్పుడు కొంచెము యోచన యవసర మనిపించును. అనువాదమున నెడనెడ కొంత వివరణము గోచరించును. కవిత్వము ధారాశుద్ధి గలిగి యెచ్చటను కుంటుపడక ఖర్జూరపాకమున నున్నది. భాష లాక్షణికము నిర్దుష్టము నై యున్నది.

ప్రాచీన కవులు, లాక్షణికులు, గర్భకవిత్వమున పలువిధములు ప్రదర్శించిరి. కాని "ఇష్టవాక్య గర్భితవృత్తము" నెవ్వరును రచించినట్లు కానరాదు. ఇది శ్రీ పట్టాభిరామశర్మగారి స్వయం ప్రతిభాకల్పితమని తోచుచున్నది.

మొత్తముమీద ఈ అనువాదములుమూడును మెచ్చదగినవిగానేయున్నవి.

# వేదాన్తగీతాడిండిమము

రచయిత :- శ్రీ పెండ్యాల నారాయణశర్మ

ఇది యాదిశంకరాచార్యులవారి వేదాన్తడిండిమమునకు తేటగీతి పద్యములలో చేయబడిన యాంధ్రానువాదము. రచయిత శ్రీ పెండ్యాల నారాయణ

శర్మ. ఇతడు వృత్తిచేత నుపాధ్యాయుడు. (తూర్పు గోదావరి జిల్లా) మేడపాడు వాస్తవ్యుడు. ఇత డీగ్రంథమును తనకులదైవమగు పెండ్యాల వెంకయ్యచే మేడపాడు పురమున ప్రతిష్ఠింపబడిన మహాలింగమునకంకిత మొనర్చెను. ఈ గ్రంథము పిఠాపుర విద్వాంసులగు వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే పరిష్కరింపబడి 1930వ సంవత్సరమున ప్రకటింపబడినది.

ఈ గ్రంథ మీశ్వరుని కంకిత మీయబడినను ప్రారంభమున చివరను కృష్ణసంబోధన యున్నది. శివకేశవుల కభేదమని చాటుటకై యుల్లేఖించియుండ వచ్చును.

వేదాంతడిండిమము మూలమున "ఇతి వేదాంతడిండిమః" అను మకుట ముతో తొంబది మూడు శ్లోకములలో నున్నది. ఇందు శ్రీ శంకరాచార్యులవా రద్వైత వేదాంత తత్త్వసారమును జనసామాన్యమునకుమును ముఖ్యముగా బోధ పడునట్లు సూత్రప్రాయముగ రచించిరి. ఇం దేశ్లోకమున కాశ్లోకము పూర్ణార్థముపై యద్వైత తత్త్వాంశములను ప్రకటించుచుండును.

విషయ సంగ్రహము:- వేదాంతభేరీ నినాదము లే యేకమాత్ర తత్త్వము నుద్ఘోషించుచున్నవో, దక్షిణామూర్తి సంజ్ఞకమగు నాతేజము నాకు సాక్షాత్కరించుగాక.

ఆత్మయనియు ననాత్మయనియు పదార్థములు రెండు. ఒకటి భోక్త, రెండవది భోగ్యము. బ్రహ్మమే ఆత్మ. దేహాదులు కావు. అని వేదాంతభేరీ మ్రోగుచున్నది. జ్ఞానమనియు నజ్ఞానమనియు పదార్థములు రెండు. జ్ఞానమువలన ముక్తియు నజ్ఞానము వలన బంధమునని వేదాంత భేరీ నినాదము. ప్రియ విప్రియ కారకములగు సుఖ దుఃఖము లను రెండు పదార్థములున్నవి. సుఖము బ్రహ్మము, జగత్తు దుఃఖము నని వేదాంతభేరీ ఖాంకారము. సమష్టి వ్యష్టియని రెండు పదార్థములు. సమష్టి ఈశ్వరుడు, వ్యష్టి జీవుడు. జ్ఞాన కర్మము లను రెండు పదార్థములు. జ్ఞాన మాత్మ తంత్రము. రెండవది కర్తృతంత్రకము. జ్ఞానమువల్లనే మోక్షము. కర్మలవలన గాదు; ధ్యానింపదగినది, కూడనిది, యని రెండు పదార్థములు. మొదటిది చిత్తమునకు సమాధిని, రెండవది విక్షేపమునుగూర్చును. యోగికిని, భోగికిని; త్యాగికిని, రాగికిని గూడ జ్ఞానమువలన మోక్షము గలుగును. సందేహము లేదు. వర్ణాశ్రమ సంకేత ముచేగాని, కర్మోపాసనాదులచేగాని, బ్రహ్మజ్ఞానము లేక మోక్షము సిద్ధింపదు.

సంసార మసత్యము, రసాభాసాది దోషయుతము. ఇది యుపేక్షింప తగినది.

బ్రహ్మమే తెలియదగినది. వ్యర్థ కార్యప్రసంగవాద వాంఛలను విడిచి బ్రహ్మ మొక్కటే తెలియదగినది. జీవుడే బ్రహ్మము బ్రహ్మమే జీవుడు ననెడి యైక్యజ్ఞానము వలననే ముక్తి కలుగును.

పరబ్రహ్మ యాత్మగానే యుండుటచే తత్త్వమును తెలుపుటలో ప్రయాస లేదు. అద్వైతమనియు ద్వైతమనియు రెండు వాదములు. మొదటిది సూక్ష్మము రెండవది స్థూలము. అద్వైతవాదము వలననే మోక్షము. బ్రహ్మజ్ఞానము లభింపనిచో పాండిత్యమును కర్మలును వ్యర్థములు. పరబ్రహ్మము నెరిగినచో యాగ యోగ ధనాదులతోగాని వేదశాస్త్రపురాణాదులతోగాని పనిలేదు. కర్మలు చిత్తశుద్ధికిని, ఉపాసన యేకాగ్రతకును బ్రహ్మజ్ఞానము మోక్షము కొఱకును నని వేదాంత డిండిమము.

పరస్పర విలక్షములగు దృశ్యపదార్థములు రెండు. ద్రుక్కు బ్రహ్మము, దృశ్యము మాయ, జీవునకుపాధి యవిద్య. ఈశ్వరునకుపాధిమాయ. ఈ రెండిగుణ ముల కతీతమైనది బ్రహ్మము. పరబ్రహ్మ తత్త్వము సాకారము, నిరాకారము సగుణము, నిర్గుణమునుగూడనై యున్నది.

కార్యకారణము అభిన్నములు. కాన సర్వము బ్రహ్మమై బ్రహ్మము సర్వ మునై యున్నది. సర్వవస్తువులయందును సత్ చిత్ ఆనంద లక్షణములు భాసించు చున్నవి. అందుచే సర్వమును బ్రహ్మమయమే. నేను దేహమును కాను. దేహ సాక్షి యగు దేహి నను నిశ్చయమువలననే జననమరణరహితుడగును. సచ్చిదానంద రూప త్వమువలన నాత్మయే బ్రహ్మ. సంశయములేదు. నామరూపములు మిథ్యయగుటచేత నామరూపములనుబట్టియు జీవబ్రహ్మములకు భేదములేదు. బ్రహ్మసత్యము జగత్తు మిథ్య. జీవుడు బ్రహ్మమేగాని వేరుకాదు. ఇది తెలిసినవాడే జీవన్ముక్తుడు. నామరూప ములు స్థిరములు గాకపోవుటచే నామరూపాత్మకమైన విశ్వ మింద్రజాలమని బుధులు భావింతురు. అనులోమ విలోమములగు నధ్యారోపాప వాదములను చింతింపగా మిగులునది పరతత్త్వమే. సర్వదేహాదులకును నామరూపాభిమానమే సంసార (కారణ) మగుచున్నది. సచ్చిదానంద దృష్టియే ముక్తి కారణ మగును. నామరూప ముల మిథ్యాత్వమును సచ్చిదానంద సత్యత్వమును గ్రహించినచో తెలియవలసిన దింకేమున్నది? సర్వము బ్రహ్మమేయని స్మరించుచు నన్యకర్మలు చింతలు లేక సుఖ ముగ నుండవలెను.

సర్వమాత్మయేయని తెలియుటచే విద్వాంసుడు కరణాకరణములగూర్చి బాధ నొందడు. మోహముతో నిమిత్తములేదు. ఆత్మయే బ్రహ్మమని నిర్ణయమైనది. వేదాన్తభేరి శ్రుతిరంజకముగ వినబడుచున్నది. శ్రీ దక్షిణామూర్త్యనుగ్రహమున ప్రతివాది భయంకరమైన వేదాంతభేరి ఝంకారమును బ్రాహ్మణులు విందురుగాక.

శ్రీ నారాయణశర్మగారి యనువాదము, మూలమందలి యొక్కొక్క శ్లోకమున కొక్కొక్క తేటగీతి పద్యముగా నున్నది. మూలము అనువాదము—

వేదాన్త డిండిమా స్తత్వం ఏకముద్ఘోషయ న్తియత్ ।
అస్తాం పురస్తాత్ తత్తేజో దక్షిణామూర్తి సంజ్ఞితమ్ ।

గీ॥ అలరు వేదాంత డిండిమం బిలను నొకటె
తత్వ మగు నంచు ఘోషింప దనరుచుండె
దక్షిణామూర్తియను పేర దనరుదాని
ముంగిటను నిల్వ వరము నొసంగు కృష్ణ

ఇందు "అస్తాం పురస్తాత్ తత్తేజః" అనుదానికి "దానిముంగిటను నిల్వ వరము నొసంగు" ననునది సరియైన యనువాదము కాదు. "ఆ తత్వము నాకు సాక్షాత్కరించుగాక" యని మూలమందలి భావము.

న వర్ణాశ్రమసం కేతైః న కర్మోపాసనాదిభిః
బ్రహ్మజ్ఞానం వినా మోక్షః। ఇతివేదాంత డిండిమః॥

గీ॥ వర్ణ మాశ్రమ మనుభేదభావపరులు
కర్మల నుపాసనాదుల గడుపుగాదు
బ్రహ్మ విజ్ఞానులైనచో బడయుముక్తి
ఇతరులకులేదు మోక్షంబు నెపుడు కృష్ణ॥

ఇది మూలానుసారియైన యనువాదము కాదనుట స్పష్టము.

"స్థితో బ్రహ్మాత్మనాజీవో బ్రహ్మజీవాత్మ నాస్థితమ్
ఇతి సంపశ్య తాం ముక్తిః ఇతి వేదాంత డిండిమః॥

గీ॥ జీవుడే బ్రహ్మమై మది చెలగి యుండు
బ్రహ్మమే జీవుడై యెద వరలుచుండు
నీవిధంబున గనుగొన నెట్టివాడు
ముక్తినొందుట తథ్యంబు ముద్దుకృష్ణ॥

ఇందు మూలమునలేని, "మది యెద" అను పదములు చేరినవిగాని లేనిచో నిది మూలానుగుణమైనదని చెప్పవచ్చును.

ద్విజత్వం విద్యనుష్ఠానాత్। విప్రత్వం వేదపాఠతః
బ్రాహ్మణ్యం బ్రహ్మవిజ్ఞానాత్ ఇతి వేదాంత డిండిమః॥

గీ॥ ఉపనయనకర్మచేత నీయుర్వి ద్విజుడు
వేదపాఠంబువలనను విప్రవరుడు

బ్రహ్మ విజ్ఞానమొందిన బ్రాహ్మణుండు
నసుమ వేదాంత డిండిమం బలరె కృష్ణ॥
ఇది యోగ్యముగానే యున్నది.
షట్కోషహత్యా త్రయం హిత్వా। ద్వయం భిత్వా శిలాతిగం
ఏకం బుధ్వా ప్నుతే మోక్షం ఇతివేదాన్త డిండిమః ॥

గీ॥ అరిటిని మూటి రెంటిని జేరి వేగ
జంపి విడిచియు భేదించి సర్వమునకు
నవల నుండినయొకటిని గవయు నపుడె
ముక్తినొందును మనుజుండు పుడమి కృష్ణ॥
ఇందు భావము మూలానుగుణముగనే యున్నది.
బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నావరః
జీవన్ముక్తస్తు తద్విద్వాన్। ఇతి వేదాంతడిండిమః॥
సత్య మెప్పుడు బ్రహ్మము జగము మిథ్య
జీవుడే బ్రహ్మ మితరని చెప్పవలదు
దీని తెలిసిన మనుజుడు దేజరిల్లు
ముక్తి నొందుట తథ్యంబు ముద్దుకృష్ణ॥
ఇదియును మూలానుసారముగానే యున్నది.
అవిజ్ఞాతే జన్మనష్టం। విజ్ఞాతే జన్మ సార్థకం
జ్ఞాతురాత్మా మహారేస్యాత్ ఇతి వేదాన్తడిండిమః॥

గీ॥ ఆత్మ తెలియని జన్మంబు నవని వృథయు
తెలియుగో జన్మ సార్థక మెలమినగును
ఆత్మవిజ్ఞాని కరయగా నాత్మమూర
మందు లే దని యెంచగా నగును కృష్ణ॥

ఇది మూలభావమును కొలదిగా విస్తరించి స్పష్టము చేయునదియై యున్నది. (బాగుగ)

పరమే బ్రహ్మణి స్వస్మిన్ ప్రవిలాప్యాఖిలంజగత్
గాయ న్నద్వైత మాత్మానం ఆస్తే వేదాన్త డిండిమనః॥

గీ॥ ఆత్మ విజ్ఞాని యూతయు నాత్మయందు
సర్వజగములు విలయింప శక్తి గలిగి

యనయ మద్వైత సంతోషమందు దేలి
గానమును జేయుచుండును గడిది కృష్ణ॥

ఇదియును మూలమందలి భావమును సువ్యక్తముచేయుచు వివరముగ నున్నది.

వేదాన్త భేరి ఝుంకారః ప్రతివాదిభయంకరః
శ్రూయతాం బ్రాహ్మణైః శ్రీమద్దక్షిణామూర్త్యనుగ్రహం॥

గీ॥ ఇతరవాదుల కనయము మతి గలంచు
వసుధ వేదాన్త భేరి కాభాంకృతులును
దక్షిణామూర్తి దయచేత ధరణిసురుల
వలన వినబడుగాత శ్రీ జెలగి కృష్ణ॥

ఇందు మూలమునమున్న "బ్రాహ్మణ" శబ్దమును "ధరణిసురులు" గా ననువదించుట కంటె నట్లే ప్రయోగించిన బాగుగా నుండెడిది. "బ్రాహ్మణ్యం బ్రహ్మ విజ్ఞానాత్" అని యింతకుపూర్వమిందే చెప్పబడియుండుటచేత నాశబ్ద మాయర్థమననే ప్రయోగించుట యుచితముగా నుండును.

మూలమున ననుష్టుప్ శ్లోకములలోనున్న యీ వేదాన్త డిండిమము కడు సులభశైలిలో సర్వసాధారణ జనులకు తత్త్వము బోధపడునట్లున్నది. అట్లే ఈ యనువాదము కూడ చిన్నదిగా నుండు తేటగీతి పద్యములలో కడు సులభశైలిలో పామరులకు గూడ సుబోధ మగునట్లు చేయబడినది. ఇందు భాషాపటుత్వము, చెప్ప దగినంతగా లేకున్నను చాలవరకు భావములు మూలానుగుణముగనే యున్నవి. అచ్చటచ్చట కొంచె మెచ్చుతగ్గుగా నున్నను విషయమున దోష మాపాదించదగినంతగా లేదు.

ఒకటి రెండుచోట్ల "బ్రహ్మ విజ్ఞానులైనచో బడయుముక్తి" మొదలైన వాక్యరచనాదోషము లున్నవి.

మరి యొకటి రెండుచోట్ల "ఆత్మ దెలియని జన్మంబు నవనిపుథయ" "ఇతరులకులేదు మోక్షంబు యెప్పుడు కృష్ణ" మొదలగు తాపుల నుత్తుపై ద్రుత యదాగమములు కనిపించుచున్నవి.

అనువాదకర్త విశేష భాషాపాటవముగలిగినవాడు కాకపోయినను అద్వైత తత్త్వాభిమానియు సౌమ్యుడునై కొంత కవితాభిలాష గలిగియున్నవాడుగ గోచరించుచున్నాడు. ఈ గ్రంథము సాధారణ మాతృభాషాజ్ఞానము గలిగిన యాంధ్ర జన సామాన్యమునకు బాగుగ నుపయోగించును. పద్యములు చక్కని ధారగలిగి, బాల

బాలికలు చిన్న వయసులో కంఠస్థము చేయుట కనుకూలముగనున్నవి. పిల్లలకు సామాన్య జనులకు నీ యనువాదము మిక్కిలి ఉపయోగకారిగా నుండును.

# ఆత్మబోధ

శ్రీమదాది శంకరాచార్యులవారు రచించిన గ్రంథములలో నరువది యెనిమిది శ్లోకములతో గూడిన యాత్మబోధ యొకటి. ఈ గ్రంథము పరిమాణమున చిన్నదిగా నున్నను, విషయమునుబట్టి మిన్నయై తత్త్వసంగ్రహమనదగి యున్నది. ఇది శాస్త్ర గ్రంథమైనను వివిధాలంకార భరితమై యున్నది. ఇందు సుమారిరువదికి పైబడి యుపమాలంకారములు, మూడు నాలుగు తావుల రూపకాలంకారములు, రెండుచోట్ల రూపకానుప్రాణిత శ్లేషాలంకారములును, నొకచో నుల్లేఖాలంకారమును గలవు. దీనిని పలువురు కవులాంధ్ర పద్యరూపమున ననువదించిరి.

ఇందలి ముఖ్య విషయము, వివిధోపమానములచేతను, దృష్టాంతములచేతను, ఆత్మ యద్వితీయమనియు, నిత్యమనియు, సర్వవ్యాపియనియు సచ్చిదానంద స్వరూపియనియు, దానికంటె భిన్నమైన వస్తు వింకొకటి లేదనియు, వేరొక వస్తువున్నట్లు గోచరించుట కజ్ఞానమే కారణమనియు, నట్లు కనుపించునది మరుమరీచికల యందలి జలమువలె మిథ్యయే యనియు, నీ మిథ్యాజ్ఞానము నశించి సత్యస్వరూప జ్ఞానమును పొందుటవలననే నిత్య నిరతిశయానంద రూపమైన ముక్తి లభించుననియు, నిరూపించి యాజ్ఞానసిద్ధికి, భక్తి వైరాగ్యములుగల ముముక్షువునకు సద్గురూపదిష్ట తత్త్వమస్యాది మహావాక్య శ్రవణ మనన నిదిధ్యాసలే సాధనము లనియు, వేరు సాధనములు పూర్ణ ఫలప్రదములు కావనియు బోధించుట.

ఆత్మబోధ నాంధ్ర పద్యరూపమున నాంధ్రీకరించినవార నేకులున్నారు. వారు (1) అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి, (2) తిరుపతి వేంకటకవులు (అసమగ్రము - కలగూరగంపలో కలిపి ముద్రించబడినది), (3)జె. కృష్ణారావుగారు, (4)మోచర్ల రామకృష్ణగారు, (5) కాపూరి పూర్ణచంద్రరావుగారు, (6) పిశుపాటి నారాయణశాస్త్రిగారు. ("అద్వైత ప్రకరణములు" అను గ్రంథములో చేర్చి ముద్రింపబడినది.) ఈ యనువాదము లెట్లున్నవో స్థూలముగ పరిశీలింపబడుచున్నవి.

# ఆత్మబోధము

## అనువాదము :- అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి

ఆత్మబోధమును పద్యరూపమున నాంధ్రీకరించిన వారిలో ప్రథము డల్లమ రాజు సుబ్రహ్మణ్యకవి. ఇతడారామ ద్రావిడ శాఖాబ్రాహ్మణుడు. హరితస గోత్రుడు. ఇతని తల్లి గంగమాంబ. తండ్రి రంగశాయి. జన్మస్థానము పిఠాపుర సమీపమున నున్న చేబ్రోలు గ్రామము. జననము క్రీ. శ. 1831. నిర్యాణము క్రీ. శ. 1892.

ఇతడు తన యిరువది రెండవయేటనే యాశుకవితచెప్పి రాజుల యాస్థానములలో సన్మానముల నొందినవాడు. ఆ యా యాస్థానములలోని పండితుల ధాటకు తట్టుకొని నిలువగలిగిన దిట్ట. ప్రతిభావ్యుత్పత్తులు సమానముగాగల కవివరుడు.

ఇతని యితర రచనలు (1) శ్రీకృష్ణ భూపతి అలామశతకము, (2) శేష ధర్మములు, (3) పాపయమంత్రి శతకము, (4) మణిధ్వజచరిత్రము, (5)సింహాద్రి రామాధిప శతకము, (6) భద్రాపరిణయము, (7) శ్రీకృష్ణ లీలా కల్యాణము, (8) చాటుధారా చమత్కార సారము. మొ॥

ఆత్మబోధానువాదము నీ గ్రంథకర్త, రాజమహేంద్రవర ప్రాంతమున నున్న వీరవర గ్రామ నివాసియగు తోట పద్మనాభదాస్యున కంకితముచేసి సన్మానము నొందెను. అందుచేత నిందలి పద్యములన్నియు "పద్మనాభ" యను మకుటముతో నున్నవి. ఇందలి పద్యములు చాలవర కాటవెలదులు తేటగీతులునై యున్నవి.

ఈ యనువాదము కడు సరళమై మూలానుసారియై యున్నది. ఉదాహరణములుగా కొన్ని పద్యము లిచ్చుట నీయబడుచున్నవి. మూలము –అనువాదము–

బోధోఽన్యసాధనేభ్యో హి సాక్షాన్మోక్షైక సాధనమ్
పాకస్య వహ్నివత్ జ్ఞానం వినా మోక్షో న సిద్ధ్యతి ॥ 2

గీ॥ అన్య సాధనముల కన్న నరయ బ్రహ్మ
బోధ మొక్కడె మోక్షైక సాధనంబు
పాకమున కగ్నివలె దానగాక మోక్ష
పదవి వేరొంట గలుగదు పద్మనాభ ॥

నిత్యశుద్ధ విముక్తయిక మఖండానంద మద్వయం
సత్యం జ్ఞాన మనన్తం యత్ పరబ్రహ్మమేవచ ॥ 36

ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా
హరత్యవిద్యావిక్షేపాన్ రోగా నివ రసాయనం ॥ 38

గీ॥ అద్వయము శుద్ధము విముక్త మవ్యయం బ
నంత మానందమయము, సత్యమగు జ్ఞాన
మెట్టి యట్టి పరబ్రహ్మమేన యనుచు
భావన మొనర్పవలయును పద్మనాభ ॥

తే॥ ఇవ్విధమున పరబ్రహ్మమేన యయితి
ననెడు మనసంబు చిరకాల మభ్యసింప
నది తొలగించు నొగి నవిద్యావికృతుల
వ్యాధుల మహౌషధము వోలె బద్మనాభ ॥

దిగ్దేశకాలాద్యనపేక్ష సర్వగం
శీతాది హృన్నిత్య సుఖం నిరంజనం
యః స్వాత్మ తీర్థం భజతే వినిష్క్రియః
స సర్వవిత్ సర్వగతోఽమృతో భవేత్ ॥

తే॥ ఎవడు దిగ్దేశ కాలాదు లెన్నకఖిల
గతము నిర్ద్వంద్వ నిత్య సౌఖ్యదము స్వాంత
తీర్థమూరక పొందు సర్వార్థవిదుడు
వాడె సర్వగు డమృతుండు పద్మనాభ ॥

ఇందలి భాష లాక్షణికమై సర్వజన సులభ సుబోధమై యున్నది. గ్రంథము చివర నొక గోమూత్రికాబంధ గీతము, నొక చక్రబంధము, నొక స్రగ్విణీవృత్తము కృతిభర్త యగు పద్మనాభుని పేర రచింపబడియున్నవి.

ఆత్మబోధమునకు గల యాంధ్రానువాదములలో నిది కడు సరళమైనదని చెప్పవచ్చును.

# ఆత్మబోధము

## అనువాదకర్త :- శ్రీ జె. కృష్ణారావు

ఆత్మబోధమును పద్యరూపమున నాంధ్రీకరించినవారిలో శ్రీ కృష్ణారావుగా రొకరు. వీరు చిత్తూరుజిల్లా వాస్తవ్యులు. న్యాయవాదులు కవితా రసికులు. సద్గుణ

గరిష్ఠులు. జ్ఞాన సంపన్నులు. వీరీ యనువాదమును తొలుత వృత్తములలో వ్యాఖ్యార్థము వచ్చునట్లు వ్రాసిరట. అది ప్రకాశితమైనట్లు లేదు. కంద పద్యములలో నున్న యీ యనువాదము 1934 సం॥లో ప్రచురింపబడినది. వీరి యితర కృతులు 'మాతృలటము' వేంకటేశ్వర స్తవము మొదలగునవి.

ఈ యాంధ్రీకరణ సులభముగాను మనోహరముగాను నున్నది. అనువాదము మక్కికి మక్కిగాగాక తెలుగు నుడువు గోల్పోవక మూలభావానుసారిమై, యలతి మాటలలో పూర్ణభావమును ప్రకటించునదిమై యున్నది. మూలమున నున్న యలంకారములన్నియు నిందు యథాతథముగా నవతారించబడినవి.

గ్రంథ ప్రారంభమున నీ యనువాదకర్తయొక్క ప్రార్థన పద్యమువాడ శ్లేషాలంకారయుతమై యున్నది.

కం॥ శ్రీ దివ్యామృత సుఖసం। పాదన కార్యావరోధ పటు విమత విషా
ఖాదన ధీరుండగున। య్యాదిమ శంకరుని భక్తినారాధింతున్ ॥

ఇందు శివపరముగాను, ఆదిశంకరాచార్యస్వామి పరముగాను రెండర్థములు స్ఫురించుచున్నవి.

శివపరముగా దేవత అమృత సంపాదనకు చేయు ప్రయత్నమునకు విఘాతముగా నుద్భవించిన విషమును భక్షించిన శంకరు నారాధింతుననియు: నాది శంకరాచార్య పరముగా - మోక్ష సుఖ సంపాదన కవరోధకరములగు విమత విషహరుడగు నాది శంకరాచార్యు నారాధింతులనియు, నిందలి యర్థద్వయము వ్యక్తమగుచున్నది. మూలము యనువాదమున కుదాహరణములు :-

తపోభిః క్షీణపాపానాం శాన్తానాం వీత రాగిణాం
ముముక్షూణా మపేక్ష్యోఽయ మాత్మబోధో విధీయతే ॥ 2

కం॥ శాంతులు మోక్షాసక్త। స్వాంతులు నిర్ముక్తకిల్బిషవ్రాతతపో
వంతులు విదళితసకల। భ్రాంతులు నీయాత్మబోధ పఠనార్హు లిలన్॥

అరుణేనైవ బోధేన పూర్వం తత్తిమిరే హతే।
తత ఆవిర్భవే దాత్మా స్వయమే వాంశు మానిక ॥ 43

కం॥ మునుమున్నుగ సంతమసం। బును, జొక్క పుంజెరుక యొనెడువాడు పుంజాయల్
తునిచిన యంతట ప్రద్యో। తను చాడ్పున నాత్మ తనకు తానె వెలుంగున్ ॥

తీర్త్వా మోహార్ణవం హత్వా రాగద్వేషాదిరాక్షసాన్ ।
యోగీ శాన్తిసమాయుక్తో హ్యాత్మారామో విరాజతే ॥ 40

కం॥ యోగియు మోహాబ్ధి గడచి । రాగద్వేషాది దైత్యరాజి నడచి తా
రాజిలు నాత్మారాముం । డై గెంటని శాంతి మదిని నలరారంగన్ ॥

ఉపాధి విలయా ద్విష్ణౌ నిర్విశేషం విశేన్మునిః ।
జలే జలం వియ ద్వ్యోమ్ని తేజ స్తేజసి వా యథా ॥

కం॥ జ్ఞానియు నుపాధి విలయం । బై సంతన నిర్విశేషు డయి విష్ణువునన్
లీను డగు నీరు నీరను । లో నగ్గని నగ్ని మిన్నులో మిన్ను క్రియన్ ॥

సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షు ర్నిరీక్షతే ।
అజ్ఞానచక్షు ర్నేక్షతే భాస్వన్తం భాను మన్ధవత్ ॥ 65

కం॥ జ్ఞానేక్షణుండు సత్య । జ్ఞానానంద స్వరూపు సర్వగు గను న
జ్ఞానేక్షణుండు విలస । ద్భానుని నంధుండువోలె దర్శింప డొగిన్ ॥

ఇందలి భాష లాక్షణికమై సుబోధమై యున్నది. ఇది 'యాత్మబోధ'కు మూలభావానుగుణమైన యనువాదమని చెప్పదగియున్నది.

— ౦ —

# ఆత్మబోధము

## అనువాదకర్త :- శ్రీ మోచర్ల రామకృష్ణయ్య

శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారీశతాబ్దమువారు. నెల్లూరులో న్యాయవాద వృత్తిలోనున్నారు. చిన్ననాటి నుండియు కవితా వ్యాసంగము గలిగి పరిణతిజెందిన విద్వత్కవులు.

వీరి యితర రచనలు :- సౌందర్యలహరి ఆంధ్రపద్యానువాదము, లక్ష్మీస్తుతి మొదలగునవి. వీరు నెల్లూరు వాస్తవ్యులై "యభినవ తిక్కన" బిరుదునొందిన సుప్రసిద్ధ విద్వత్కవివర్యులగు దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి శిష్యులు. ఈ గ్రంధము వారికే యంకితము చేయబడినది. ఇందలి యనువాదము చాలవరకు మూలానుసారిగను, కొన్నిచోట్ల కొలది వివరణము కలిగినదిగ నున్నది.

ఈ యనువాదము 1936 వ సం॥న చేయబడినది. ఇందలి యనువాదపద్ధతికి, రచనా విధానమునకును ఉదాహరణములు :— యథామూలానువాదము.

శ్లో॥ అజ్ఞాన కలుషం జీవం జ్ఞానాభ్యాసా ద్వినిర్మలం ।
కృత్వాజ్ఞానం స్వయంనశ్యేత్ జలం కతకరేణువత్ ॥ (5)

తే॥ గీ॥ జీవు నజ్ఞానకలుషంబు వోవజేసి
జ్ఞాన మవల దాన నాశనము నొందు
సలిల మాలిన్యమంతయు వొలగజేసి
చిల్ల గింజ యవల దా నశించునట్లు॥

శ్లో॥ రజ్జుసర్ప వదాత్మానం । జీవోజ్ఞాత్వా భయం వహేత్ ।
నాహం జీవః పరాత్మేతి । జ్ఞానంచేత్ నిర్భయో భవేత్॥ (72)

రజ్జువును గాంచి పామని భ్రమయువగిది
తాను జీవుం డనెడి భ్రాంతి తవిలి భయము
బొందు పరమాత్మ 'నేను జీవుడగా' న
టం చెరింగి విగలభయుం డగు జనుండు ॥

శ్లో॥ వ్యాపృతే ష్వింద్రియే ష్వాత్మా వ్యాపారీ వా వివేకినా ।
దృశ్యతే z భ్రేషు ధావత్సు ధావ న్నివ యథాశశీ॥ (19)

ఉ॥ వెన్నెలరేల మింట బరువెత్తెడుమబ్బుల గాంచి వెఱ్ఱినా
గన్నలు చందమామ వడిగా జనుచుండె, నటంచు నెంతు,రా
తెన్నున నింద్రియైక వికృతిన్ గని తద్గతులెల్ల నాత్మవే
యన్న భ్రమన్ వహింతు రకటా పరతత్త్వవిచారదూరగుల్॥

శ్లో. అరుణేనైవ బోధేవ పూర్వంత త్తిమిరే హృతే ।
తత ఆవిర్భ వేదాత్మ స్వయం మేవాంశుమానివ ॥ (43)

చం॥ అరుణుడు ప్రాఙ్మహీధ్ర శిఖరాగ్రమునం దుదయంబు నొందగా
నిరులు లయించి పోయెడువిధిన్ విమలంబగు బోధ పేర్మి
నత్వరముగ దా నవిద్య చను దప్పుగ పిమ్మట నంశుమాలియ
ట్లిరిదిగ నుద్భవించు తనయంతన యాత్మ పటుప్రకాశతన్ ॥

శ్లో॥ తీర్త్వా మోహార్ణవం హత్వా । రాగద్వేషాదిరాక్షసాన్ ।
యోగీశాన్తి సమాయుక్తో హ్యాత్మారామో విరాజతే॥ (50)

మ॥ ఘనమోహార్ణవమున్ దరించి పటురాగద్వేష ముఖోగ్ర దు
ష్ట నిశాట ప్రకరంబు నుక్కడచి స్వేచ్ఛన్ శాంతి సామ్రాజ్య ల
క్ష్మిని జేపట్టి, వికల్పముల్ విడిచి నిశ్చింతన్ సదానంద ని
త్య నిమగ్న స్థితి బ్రహ్మవేత్తతగ నాత్మారాముడై భాసిలున్॥

ఇందలి భాష లాక్షణికము, జాతీయము నై యున్నది. 'ఇందలి పద్యములు సంస్కృతశ్లోకముల తీరునుమించి మంచి నుడికారముతో ప్రసాదగుణముతో

నొప్పారుచున్న'వని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, 'వేదాంత విషయములను సుబోధముగ జదువరుల చిత్తముల హత్తింపుటయందేకాక పదగుంభనాదులగు రచనా చమత్కృతుల యందును, ఈ గ్రంథము నందలి కొన్ని పద్యములు పోతనా మాత్యుని పద్యములను బోలియున్న'వని శ్రీ ప్రయాగ వేంకటశాస్త్రిగారును ప్రశంసించియున్నారు.

# ఆత్మబోధము

## అనువాదకర్త :- శ్రీ కావూరి పూర్ణచంద్రరావు

శ్రీ కావూరి పూర్ణచంద్రరావుగారు ప్రస్తుతము విజయవాడ ఆంధ్ర లయోలా కాలేజీలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేయుచున్నారు. వీరు సాహిత్యపిపా సతో సమానముగ తత్త్వజిజ్ఞాసగలవారు. వీరు శ్రీ శంకరాచార్య కృతులలో ప్రసిద్ధ మైన వివేక చూడామణినికూడ కొంతవరకు పద్యకావ్యముగ ననువదించిరి. వీరి మరొకకృతి శారదాస్తుతిపరముగ వ్రాసిన 'నమస్సుమాలు' అను ప్రార్థన పద్యసంపుటి. వీరి రచనలు విశేషముగ భక్తిజ్ఞాన పరములుగ నుండును.

వీరియాత్మబోధ 1962వ సంవత్సరంలో ప్రచురించబడినది. ఈ యను వాదము కేవల మూలశబ్దానుగుణమైన యనువాదముకాక చాలవరకు వివరణాత్మకమై యున్నది. కొన్ని తావుల మాత్రము మూలమునందు వలెనే సంగ్రహముగా నున్నది.

మూలము - యనువాదపద్ధతుల కుదాహరణములు :

తపోభిఃక్షీణపాపానాం శాన్తానాం వీతరాగిణాం ।
ముముక్షూణా మపేక్ష్యోఽయ మాత్మబోధో విధీయతే॥ 1

ఉ॥ శ్రీకరమైన యాత్మపదచింతనసేయగనీని రాగ కో
పాకర మానసంబున మహోత్తరశాంతి గుణంబునింపి పా
పాకులతం దపో నిరతి నంతముజేసి ముముక్షులైనవా
రీకృతిజాడ నర్థులు జయింప భవప్రతిబంధకావళిన్॥

ఇది మూలమునకు వివరణాత్మకమైన యనువాదమున కుదాహరణముగా గ్రహింపబడినది.

నానోపాధివశాదేవ జాతినామాశ్రమాదయః
ఆత్మన్యారోపితా స్తోయే రసవర్ణాదిభేదవత్॥ 11

మ॥ ఒక విద్యుత్తు విభిన్నమార్గముల దానుత్పన్నమై స్వేచ్ఛదీ
పికలై యంత్రపుఁజాలనమ్ములయి పెన్వింజామరాకారులై
సకలోపాధిగతానమప్రభల వీసందేని యేకత్వమూ
నకయున్నట్లు పరాత్మ జాతికులభిన్నత్వాన భాసించెడున్॥

మూలమునలేని కల్పనాయుతమైన యనువాదమున కిది యుదాహరణముగా గ్రహింపబడినది.

ఒక్కొక్కచోట భావవివరణమువలన ఒక్కొక్క శ్లోకము రెండేసి పద్యములుగా ననువదింపబడినది.

శ్లో॥ పంచకోశాదియోగే న తత్తన్మయ ఇవస్థిత ।
శుద్ధాత్మా నీలవస్త్రాది యోగేన స్ఫటికోయథా॥ 15

ఆ॥వె॥ నరుని దేహమందు వఱలుకోశము లైదు
జ్ఞానమానసములలోన రెండు
ప్రాణమయత నొకటి యానందమయ మొక్క
టన్నమయత నొకటి గ్రోలు॥

చం॥ స్ఫటికము చుట్టుపట్ల గలవర్ణములం దనయందు జూపుచ
క్కటి నట పంచకోశములగాటపు సంగతి నాత్మభావవి
స్ఫుట మదిలేక కోశగుణపూర్ణ వికారత గోచరించు సం
కటపడుగాని కోశవిముఖంబున జీవుడు దేవుడయ్యెడిన్॥

మూలమునకు సన్నిహితమై సంగ్రహముగా నున్న యనువాద పద్ధతికి ఉదాహరణము :

స్వబోధేనాన్యబోధేచ్ఛా । బోధరూపతయాత్మనః
న దీప స్యాన్యదీపేచ్ఛా । తథా స్వాత్మా ప్రకాశతే॥ 29

ఆ॥వె॥ దీప మన్యవస్తుదీపనంబున కగు
దీపమెరుగ వేఱు దీపమేల
సర్వ మెఱుగవలయు సచ్చిదానందంబు
సచ్చిదాత్మ నెఱుగ జ్ఞానమేల॥

యథామూలానువాదమున కుదాహరణము :-

నిర్గుణో నిష్క్రియో నిత్యో నిర్వికల్పో నిరంజనః ।
నిర్వికారో నిరాకారో నిత్యముక్తోఽస్మి నిర్మలః

ఆ॥వె॥ నిర్గుణుండ నిత్యనిర్వికల్పుండను
నిష్క్రియుండ నేను నిర్వికార
నిత్యముక్తభావ నిరతనిరాకార
నిర్మలుండ మోద నిర్భరుండ॥

ఇట్లు పలువిధములుగా నున్న యీ యనువాదము మూలములోని భావము లను యథాతథముగ పాఠకుల కందీయలేక పోయినను మొత్తముమీద మూలమందలి భావముల నన్నింటిని కొంచె మించుమించుగా గ్రహింపజేయగల దనుటలో సందేహములేదు.

ఇందలి పద్యములు ధారాశుద్ధి కలిగి ద్రాక్షాపాకమున నున్నవి. భాష సలక్షణమైనాతికఠికమై సులభసుబోధమైయున్నది.

# శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము

## కర్త :- శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు

శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు రచించిన పెక్కు స్తోత్రములలో హరిమీడే స్తవము: దక్షిణామూర్తి స్తోత్రము అను రెండు స్తోత్రములు కేవలాద్వైత తత్త్వమే విషయముగాగలిగినవి. అందు "హరిమీడే" స్తోత్రమును పందొమ్మిదవ శతాబ్దిలోనుండిన 'నడకుదుటి రామన' యను నతడు పద్యకావ్యముగా రచించెనట కాని యది యలభ్యము.

శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము శ్రీమదాది శంకరాచార్య కృతమైన యద్వైత తత్త్వబోధక స్తోత్రములలో ముఖ్యమైనది. దీనికి సంస్కృతమున పెక్కు ప్రసిద్ధ మైన వార్తికములును వ్యాఖ్యలును గలవు. సాధారణముగా దక్షిణామూర్తియనగా దక్షిణదిక్కునకు తిరిగియున్న గురుస్వరూపుడగు శివుడని వాడుక. దక్షిణామూర్త్యు పనిషత్తునందు "శేముషీ దక్షిణా ప్రోక్తా, సాయస్యాభీక్షణే ముఖం దక్షిణాభిముఖః ప్రోక్తః శివోఽసౌ బ్రహ్మవాదిభిః" అని యున్నది. ఇచ్చట "దక్షిణా" శబ్దమునకు దక్షిణదిక్కుగాక "శేముషీ"యనెడి యర్థము చెప్పబడినది. దీని ననుసరించియే కాబోలు నా స్వామికి "మేధాదక్షిణామూర్తి" యనియు ప్రసిద్ధియున్నది. అద్వైత సంప్రదాయమున దక్షిణామూర్తిస్వామికి ఆదిగురువుగా నత్యంత ప్రాముఖ్యమున్నది. ఈ సంప్రదాయమున: జ్ఞానమునకును, గురువునకును నత్యంత ప్రాధాన్యముండుటచే శ్రీ శంకరాచార్యులవారే తత్త్వజ్ఞానబోధక స్తోత్రము నాదిగురు మూర్తియు, మౌన

వ్యాఖ్యచేతనే తత్త్వబోధచేయువాడను నగు దక్షిణామూర్తిస్వామి స్తోత్రముగా రచించి నట్లు తోచుచున్నది.

శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమున కాంధ్రపద్యానువాదములు రెండు ముద్రితము లైనవి యున్నవి. అందు మొదటిది మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రికృతము. ఇది వావిళ్ళవారిచే ప్రచురింపబడినది. రెండవది రాజమహేంద్రవర నివాసియగు అల్లక వీరభద్రకవి కృతము. ఇది రాజమహేంద్రవరమునలో ప్రసిద్ధ పుస్తకప్రచురణ కర్తలైన "కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్" వారిచే ప్రచురింపబడినది. ఈ రచయిత లిరువురు నీ శతాబ్దివారేయని తెలియుచున్నది. వీరిని గురించిన ఇతర వివ రము లేవియు తెలియవు.

ఈ యనువాదములు రెండును మూలభావానుగుణముగ నున్నవనియే చెప్ప వచ్చును. ఈ రెండింటికిని కొన్ని సన్నిహితమైన పోలికలు కూడ కనిపించుచున్నవి. ఈ రెంటి యనువాద పద్ధతి, పరస్పర సంబంధము తెలియుట కనువుగా కొన్ని పద్యము లిచట నుదాహరింపబడుచున్నవి—మూల సహితముగా.

శ్లో॥ మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం
వర్షిష్ఠాం తే వస దృష్టిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్రమానందమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే ॥ 1

(1) సుబ్రహ్మణ్య కవి యనువాదము :-

శా॥ మౌనుల్ వృద్ధులు శిష్యభూతులును బ్రహ్మధ్యాన నిష్ఠాపరుల్
ధ్యానింపంగను జిన్నవానినిఁ దనున్ దా బ్రహ్మతత్త్వమ్మునన్
మౌనవ్యాఖ్యను దెల్పునట్టిగురు నాత్మారాముఁ జిన్ముద్రితున్
ధ్యానింతున్ స్మితవక్త్రి హర్ష యుతు మేధా దక్షిణామూర్తి నిన్.

(2) వీరభద్రకవి యనువాదము :-

మ॥ మునులున్వృద్ధలు శిష్యమాత్రులును, సద్బోధంబునన్ ధ్యానమున్
బొనరింపంగనుజిన్ననైన ననుమున్ బొల్పొందబ్రహ్మంబునున్
మునివృత్తిన్ దగుబోధసేయుగురునిన్ మోదంబునం గొల్తు నా
త్మను జిన్ముద్రితు హర్షవక్త్రియుతుమేధాదక్షిణామూర్తినిన్ ॥ 1)

మూలమునందున్న "యువానం" అను పదమునకు అనువాదములు రెండింటను "చిన్నవానిని" ("దనున్")- (1) "చిన్ననైన (నను) (2)," అని "చిన్న" శబ్ద ముపయోగింపబడినది అంతకంటె "యువకు"డనెడి పదము వాడినచో మేలుగా

నుండును. మొదటియనువాదమున "తనున్" అనియుండగా రెండవదానియందు "నను" అని యున్నది. నను శబ్దముచట యుక్తముగా తోచదు.

"ధ్యానింపగను"-(1) "ధ్యానముం బొనరింపంగను",-(2) అని రెండింట నన్నధ్యానపదము అమూలకము, మూలమునందలి "అవృతం" అనెడి పదమునకు బదులుగా నిది యుపయోగింపబడినట్లు తోచుచున్నది.

శ్లో॥ దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధించ శూన్యం విదుః
శ్రీబాలాంధజడోపమా స్త్వహమితి భ్రాన్తాభృశం వాదినః
మాయాశక్తి విలాసకల్పిత మహా వ్యామోహసంహారిణే
తస్మై శ్రీ గురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 6

మ॥ మతభేదమ్ములచే "నహమ్ము" నెవరుం బ్రాణంబు దేహంబుకుం
బిత విజ్ఞానము శూన్యమింద్రియము లన్నింటిం బ్రసంసింత్రో వా
రతి మూఢాంధవధూశిశూపములు మోహభ్రాంతు లామోహసం
హృతి గావించెడు వాని కీనతి గురు శ్రీ దక్షిణామూర్తికిన్ ॥

మ॥ నిజమున్ దాము గ్రహింపలేక తనువున్ జీవంబు చిత్తం బబ
ద్ధజగంబున్ బరమంచు భ్రాంతివడి మిథ్యావాదముల్ సల్పు వీ
రు జడుల్ శ్రీ శివతుల్యులౌదురని కారుణ్యంబునన్ బ్రోవగా
సృజనంబైన మహాత్ము నిన్గొలిచెదన్ శ్రీ దక్షిణామూర్తినిన్ ॥ 6

ఈ రెండనువాదములలోను, మూలముననున్న పటుత్వముకనిపింపుట లేదు. అనువాదములు రెండింటిలోను మూలముననున్న "మాయాశక్తి విలాసకల్పిత మహా వ్యామోహ సంహారిణే" యను భాగములో "మయాశక్తి విలాసకల్పిత మహా" యను భాగము విడువబడినది. అనువాదము (1)లో "మోహ సంహృతి గావించెడు" అని యున్నది. అనువాదము (2) లో ఆ మాత్రమును లేక "కారుణ్యంబునన్ బ్రోవగా సృజనంబైన" అనెడి యమూలకకల్పన చేయబడినది.

ఉదా: మూలము అనువాదము

భూరంభాంస్యనలోఽనిలోఽంబర మహర్నాథో హిమాంశుః పుమా
నిత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవ మూర్త్యష్టకమ్
నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మా ద్విభో
స్తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే॥

మ॥ భువియున్ వారియువహ్ని వాయువునభంబున్ భాస్కరుండున్ సుధాం
శువు జీవుండను జంగమాచర జగంబున్ వెల్గు నేదేవు మూ

త్రివిశేషంబుయు యేరికంబు నింక బ్రహ్మంబంగ నీ యందున్
శివజిజ్ఞాసికి వాని కీనతి గురు శ్రీ దక్షిణామూర్తికిన్॥

మ॥ భువియున్ దోయము వహ్నివాయు గగనంబున్ సూర్య చంద్రాత్ములున్
నివృతాద్యఖిల ప్రపంచము ల్లీలగు నేనేత ప్రభావంబునో
న విమర్శింబగ నేరికిన్ వెలియు మున్ జర్చింపగా బ్రక్కృతిన్
శివతత్త్వజ్ఞుడు వాని కీస్తుతి గురు శ్రీ దక్షిణామూర్తికిన్॥

ఇందనువాదము (1) యథామూలము మనోహరమున్నది. అనువాదము (2)లో: మూలమునందలి "ఇత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకమ్" అను భాగమునకు "నివృతావ్యఖిల ప్రపంచము ల్లీలగు నేనేత ప్రభావంబునో" యనెడి యనువాదము. "నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః" అనెడి భాగమునకు, "నవిమర్శంబుగ నేరికిన్ వెలియుమున్ జర్చింపగా బ్రకృతిన్" అనుటయు తృప్తికరముగా లేవు. ఇందు "బ్రకృతిన్" అనుచోట ఛందోభంగమైనది. అనువాదము రెండింటను మూలమునందలి "విమృశతాం" అను పదము శివజిజ్ఞాసికి- (1) శివతత్త్వజ్ఞుడు- (2) గా అనువదింపబడినది.

శ్రీ శంకరాచార్యుల స్వామివారి స్తోత్రములను- అందును వేదాంత శాస్త్ర సారమనదగినదియు, అతిప్రౌఢమైనదియు నగు శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమును యథామూలముగ ననువదించుట సులభసాధ్యము కాదు. మొత్తముమీద నీ యనువాదములు రెండింటను మూల విరుద్ధ భావములు లేనందున నవి చాలవరకు మూలానుగుణముగనున్నవనియే చెప్పవచ్చును.

అనువాదముల తారతమ్యమును, విచారించినచో అనువాదము (శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారిది) అనువాదము (2) (అజ్ఞాతకవికృతమైనది) కంటె మేలుగా నున్నదని చెప్పనగును. అనువాదము- (2) లో కొన్నిలోపములు, విరుద్ధములు కానున్నను, అనవసర కల్పన లున్నవి. మరియు నీ యనువాదము, అనువాదము- (1)ని చూచిచేయబడినట్లుగా భావింప నవకాశమున్నది. ఆ మూలకములై అనువాదము (1)లో నున్న పదములు కొన్ని యందు కనిపించుట దీనికి మూలాధారము. మూలమును చదివి, యర్థమును తెలిసికొనలేనివారి కీ యనువాదములు కొంతవరకు మూలభావములను తెలిసికొనుట కుపకరించును. అనువాదము -2కన్న అనువాదము-1 మరింత ప్రయోజనకరమని చెప్పవచ్చును.

(10-C)

# అద్వైత ప్రకరణమాల

## ఆంధ్రీకర్త: శ్రీ పిసుపాటి నారాయణశాస్త్రి

శ్రీ శంకర భగవత్పాదుల రచనలలో నిరువది ప్రకరణముల శ్రీ పిసుపాటి నారాయణశాస్త్రిగారిచేత ననువదింపబడి యద్వైత ప్రకరణము అనుపేర నొక గ్రంథముగ కూర్చబడినవి. ఇంపైన్న ప్రకరణములు (1) అద్వైతానుభూతి (2) అనాత్మశ్రీ విగర్హణము (3) లఘువాక్యవృత్తి (4) ప్రౌఢానుభూతి (5) జీవన్ముక్తానందలహరి (6) సదాచారము (7) వేదాంత డిండిమము (8) అద్వైతోపదేశ పంచరత్నములు (9) తత్త్వోపదేశము (10) ఆత్మబోధ (11) స్వాత్మప్రకాశిక (12) యోగతారావళి (13) భజగోవిందము (14) ప్రశ్నోత్తర రత్నమాల (15) వాక్యసుధ (16) వాక్యవృత్తి (17) తత్త్వోపదేశసారము (18) బ్రహ్మజ్ఞాన లీలావళి (19) బ్రహ్మచింతనము (20) నిర్గుణమానస పూజ.

ఇవి యన్నియు నద్వైత తత్త్వశాస్త్ర విషయబోధకములైనను, వివిధాలంకార భరితములై, మనోహరములై హృదయమును కదలించునవిగనున్నవి. వీనిలో వేదాంత డిండిమమునకును, నాత్మబోధకును యోగతారావళికిని, నింతకు పూర్వపు కవులు చేసిన యనువాదములు కొన్నియున్నవి. మిగిలినవాని నింకెవ్వరు ననువదించినట్లు తెలియరాదు.

ఈ ప్రకరణములన్నియు నద్వైతతత్త్వబోధకములే. ఆచార్య శంకరుల భాష్యములు తప్ప ప్రకరణగ్రంథములతో సహా మిగిలిన రచనలన్నియు శాస్త్ర విషయకములైనను కావ్యములవలెనే యుండును. ఉపమారూపకాద్యలంకారములు ఉక్తివైచిత్రి-శాంతరసస్ఫూర్తి, రచనాశైలి మొదలగు లక్షణములారచనలకు కావ్యత్వమును సిద్ధింపజేయును. వానిని చదువనారంభించిన సహృదయుడు వానిని విడువలేడు. అట్టివానిలో పైనతెల్పిన యిరువదింటికి శ్రీ పిసుపాటి నారాయణశాస్త్రిగారు చేసిన యాంధ్రపద్యానువాదము మూలానుగుణ్యమైన శైలి శయ్యాపాకములు గలిగి యుచ్చట గొల్పుచు మూలము చదివి యానందించలేని సంస్కృత భాషానభిజ్ఞులకు తల్లోపములేకుండ చేయునని నిస్సంశయముగ చెప్పదగినట్లున్నది.

ఆంధ్రభాషా పాండిత్య మవసరములేక, సాధారణ భాషాజ్ఞానమున్నవారికెల్ల సుబోధమగున ట్లున్నదీయనువాదము. అచ్చటచ్చట వచ్చిన సంశయాత్మక కఠిన పదములకు వారే యర్థములుకూడ వ్రాసి యున్నారు. ఈ యనువాదము కొన్నిచోట్ల యథామూలముగనున్నను సాధారణముగ పెక్కుతావుల స్వాభావికమైన వారి యితరానువాదములవలెనే పక్కికి పక్కిగా రాక కొన్నిచోట్ల లఘువ్యాఖ్యగాను కొన్నిచోట్ల వివరణాత్మకముగాను సాగినది. ఈ ప్రకరణము లన్నిటిని సంపూర్ణముగ విమర్శింప బూనినచో నదియొక ప్రత్యేక గ్రంథమగును. కావున స్థాలీపులాకన్యాయముగ మాత్రమే సమీక్షచేయబడుచున్నది. దీనినిబట్టి ఈ యనువాదయోగ్యత తెలిసుకొనవచ్చును.

అద్వైతానుభూతి:- ఇందు మూలమున నెనుబదిమూడు శ్లోకములున్నవి. వివిధ దృష్టాంతములతో జీవబ్రహ్మైక్యానుభవమిందు వివరింపబడినది. సాధారణముగ ప్రతిశ్లోకమున కొక దృష్టాంతమో, రూపకమో, లేక యుపమయో యిందు కనుపించును. ఈ యనువాదము శ్లోకమునకొక పద్యము చొప్పున నున్నది. ఇందలి శ్లోకములలో 36, 37, సంఖ్యలుగల శ్లోకముల భావము కొంచెమించుమించుగ నొకే విధముగ నున్నది. అనువాదమున నారెంటి భావము నొకే పద్యమున కూర్చబడుటచేత నీయనువాద పద్య సంఖ్య యెనుబదిరెండైనది.

మూలము-అనువాదమున కుదాహరణలు-

యస్యప్రసాదాదహమేవ విష్ణుః ర్మయ్యేవ సర్వం పరికల్పితంచ
ఇత్థం విజానామి సదాత్మరూపం। తస్యాంఘ్రియుగ్మం ప్రణతోస్మి నిత్యం(2)

గీ॥ "ఏనెవిష్ణుండ, నాయందె యెల్లభువన
మయ్యె పరికల్పితం" బనునట్టిజ్ఞాన
మెవనిదయగల్గె ఎవడు నిత్యాత్మరూపు
డా'గురూత్తము' పదముల నాశ్రగొల్తు ॥ (2)

ఇందు మూలమునలేని "గురూత్తము" నను శబ్దము వివరణాత్మకము. "ఇత్థం విజానామి సదాత్మరూపం" అను పాదమును మూలముననున్న ట్లనువదింపబడలేదు. "ఎవడు నిత్యాత్మరూపుడు" అనెడి విశేషణము గురునకు మూలమునలేనిది చేర్చబడినది. ఇది యథామూలానువాదము కాకున్నను, ఉచితముగనే యున్నది. భావము స్పష్టమగుచు, గురుని విశిష్టతను తెలుపుచున్నది.

రజ్జురంధ్రస్థ దోషాది, సూర్యాభం నస్పృశేద్యథా ।
తథాక్షేత్రస్థ దోషాది, సర్వగం మాం న సంస్పృశేత్ ॥ (36)

తద్రజ్జురంధ్రనా శేషనైవనశ్యతి సూర్యభాః ।
తథాక్షేత్ర వినాశేషు నైవనశ్యామి సర్వగః ॥ (37)

గీ॥ రజ్జురంధ్రాదికము చెడన్ రవిప్రకాశ
మునకు నాటంకమనునది పొడమనట్లు
చితికినను దేహములు, సర్వగతుడనగుట
నాకు నేనాడులేదు వినాశమనుచు ॥

మూలమున చూపిన రెండు శ్లోకములు కొద్ది భేదముతో నొకే తాత్పర్యమును ప్రకటించుచున్నవి. అందు మొదటి 36 సంఖ్యగల శ్లోక మనువదింపబడలేదు. ఆ శ్లోక మీయనువాదకర్తకు లభించిన పాఠమున లేకపోవచ్చును. తరువాతి శ్లోకమున కనువాద మీయబడినది. అది యథామూలముగ నున్నదనవచ్చును.

జ్ఞస్యనాస్త్యేవసంసారోయద్వ దజ్ఞస్య కర్మిణః ।
జానతో నైవసర్వత్వవద్రజ్జు సర్ప మజానతః ॥ (42)

గీ॥ ఆత్మవేత్తకు సంసార మనుచు లేదు
కాపురమ్మలి అజ్ఞాని కర్మికునకె
"రా"డని యెరుంగువా డేల తత్తరపడు
"పా"మనుచు భ్రాంతిగొనువాడె భయముగాంచు ॥ (51)

శ్లో॥ శివఏవసదాజీవో జీవఏవ సదాశివః ॥
వేత్త్యైక్య మనయోర్యస్తు స ఆత్మజ్ఞోన చేతరః ॥ (66)

గీ॥ జీవుడే యగు సర్వదా శివు డనంగ
శివుడె యగు నన్యముంగాడు జీవు డనగ
ఇరుపురను నొక్కడే యని యెరుగుజనుడె
ఆత్మవిదు డగు, కాడు తదన్యులెవరు ॥ (75)

ఈ యనువాదములు మూలానుగుణముగ నున్నవి.

2 అనాత్మ శ్రీవిగర్హణము :- ఆత్మ జ్ఞానములేనివా రెన్ని మహిమలున్నను ఎంత పాండిత్యైశ్వర్యాధికారాదులున్నను నిత్య సుఖకాంతులుండవని వానిని గర్హించుట యిందలి సారాంశము. ఇందు మొత్తము పదునెనిమిది శ్లోకములున్నవి. అనువాదమున పదునేడు పద్యములున్నవి. మూలమునందలి చివరి రెండు శ్లోకములు నొక సీసపద్యముగ ననువదింపబడినవి.

మూలము :-

శ్లో॥ అబ్ధిః పద్భ్యాం లంఘితోవా తతః కింవాయుః కుంభే స్థాపితోవా తతఃకిం మేరుఃపాణావుద్ధృతోవా తతఃకిం॥ యేన స్వాత్మానైవ సాక్షాత్కృతోzభూత్ ॥ (9)

గీ॥ కాలినడక సముద్రంబు గడచుగాక
దీక్ష బ్రాణానిలము నిరోధించుగాక
హేమశైలము చేతిలో నెత్తుగాక
నున్న ఫలితంబు కనకున్న దన్ను తాను ॥ (9)

ఈ యనువాదము మూలానుగుణముగ నున్నది.

య స్యేదం హృదయే సమ్యగనాత్మ శ్రీవిగర్హణం ।
సదో దేతి సవీవాత్మ సాక్షాత్కారస్య భాజనం ॥ (17)

శ్లో॥ అన్యేతు మాయికజగద్ భ్రాంతివ్యామోహమోహితాః ।
న తేషాం జాయతే క్వాపి స్వాత్మసాక్షాత్కృతి ర్భువి ॥ (18)

ఆత్మేతరంబగు నఖిలసంపద అనేక విధాల గర్హించునట్టి
యీ ప్రకరణము నెవ్వండు తన హృదయంబున సర్వదాహత్తుకొనగ
జేసి తన్మననంబు సేయునో లెస్సగా ! ఆత్మసాక్షాత్కృతి కర్హుడతడె
అన్యులుమాయికమగు జగద్భ్రాంతి దా । ముంపంగ వ్యామోహమోహితులయి ॥

తే॥ గీ॥ అష్టకష్టాలు పడిపొద రాత్మదర్శనం
బు గాబోదు జన్మజన్మాలకేని
విరచితం బయ్యె నిది బ్రహ్మవిద్వరు
డగుఆదిశంకరాచార్యునిచేత నాదృతముగ ၊ (17)

ఈ యనువాదము చివరిభాగమున నున్న "అష్టకష్టాలు పడిపొదరు" "జన్మజన్మాలకేని" మొదలగునవి మూలమునలేని వివరణాత్మకమైన కూర్పులు. ఇది శ్రీ శంకరుల కృతియని తెలుపుటయు మూలమున లేనిదే. మొత్తముమీద నీయనువాదము తృప్తికరముగనున్నది.

3. లఘువాక్యవృత్తి :- శ్రీ శంకర భగవత్పాదు లద్వైతశాస్త్రసారమని చెప్పదగిన "వాక్యవృత్తిః" అను ప్రకరణము నేబదిమూడు శ్లోకములలో రచించిరి. లఘువాక్యవృత్తి దానికి సంగ్రహరూపమని చెప్పదగినది. ఇందు పదునెనిమిది శ్లోకములు గలవు. అందలి కొన్ని శ్లోకములు వానికి శ్రీ నారాయణశాస్త్రిగారి యనువాద పద్యములు నిచట నుదాహరింపబడుచున్నవి. (మూల సహితముగా)

శ్లో॥ శక్యః సర్వనిరోధేన సమాధి ర్యోగినాం ప్రియః
తదశక్తౌ క్షణం ఋద్ధా శ్రద్ధాలు ర్బ్రహ్మతాత్మనః
శ్రద్ధాలు ర్బ్రహ్మతాం స్వస్యచింత యేద్ బుద్ధివృత్తిభిః
వాక్యవృత్త్యా యథాశక్తి జ్ఞాత్వా భావ్యస్యతాం సదా
తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్త్వ బోధనమ్
ఏత దేకపరత్వఞ్చ బ్రహ్మాభ్యాసం విదు ర్బుధాః
దేహాత్మధీవ ద్బ్రహ్మాత్మధీ దార్ఢ్యే కృతకృత్యతా
యదాతదాయం మ్రియతాంముక్తో సౌనాత్ర సంశయః॥ (15, 16, 77)

సీ॥ అన్ని వ్యాపారాల నరికట్టి జాలినయతడు
యోగిప్రియ మగుసమాధి
నంద నర్హుం డగు; అందుల కసమర్థు
డైనను, శ్రద్ధాళువగుచునొక్కక్షణకాలము
నిరోధసంగతి నుండినన్, మార్వంగనోపు బ్రహ్మముగతీవు
బుద్ధి వృత్త్యవలంబనన శ్రద్ధావంతు
డగువ్యక్తి తనదుబ్రహ్మత్వగరిమ
విడక చింతింపనగు వాక్యవృత్తినాత్మ
శక్తికొలది గ్రహించి ప్రశాంతభంగి ఆచరింపవలయు
బ్రహ్మభ్యసనము నతతంబు సంసారోపశాంతి కొరకు॥

సీ॥ ఆత్మకుబ్రహ్మకు నైక్యంబు సర్వదా
భావనసేయుట, పలుకుటయును
ఆ విషయముగూర్చి యన్యోన్యమును
సముదంచిత మతి హెచ్చరించుకొనుట
అయ్యదియే పరమూపధియని నమ్మి
తన్మయుడగుటఏతచ్చతుష్టయమ్మును
బుధులు "బ్రహ్మాభ్యాస" మనుచు జెప్పుచు
సుంద్రు, దేహాత్మ బుద్ధిపోలె॥
పొడమి బ్రహ్మాత్మ బుద్ధియెప్పుడు దృఢపడు
అపుడు కృతకృత్యుడగును శుద్ధాత్ముడతడు
బ్రతికియున్నను మఱి గతప్రాణుడైన
ముక్తుడే వానిగానిబూడు ముజ్జగములు ॥ (11)

ఈ యనువాదము వివరణాత్మకముగ నున్నదని సులభముగ గ్రహింప వచ్చును. ఇందు మూలమున నున్న పదునెనిమిది శ్లోకములు పదునొకండు పద్యము లలో ననువదింపబడినవి. కొన్ని యొక్కొక్క శ్లోకమున కొక్కొక్క పద్యము చొప్పునను, పై నుపహరింపబడిన వానివలె కొన్ని రెండు మూడు శ్లోకముల కొక సీసపద్యము చొప్పునను అనువదింపబడినవి. మూలభావము అనువాదమున సంతృప్తి కరముగ నుక్తములైనవి.

4. ప్రౌఢానుభూతి :- ప్రౌఢానుభూతియందలి విషయమెట్టిదో యీ ప్రకరణ మందలి ప్రథమ శ్లోకమే యిట్లు విశదము చేయుచున్నది. శ్లో॥ ప్రౌఢప్రౌఢనిజాను భూతిగతి తద్వైతేంద్రజాలో గురుర్గూఢం గూఢమఘౌఘ దుష్టసుధియాంస్పష్టం సధీ శాలినాం స్వాన్తే సమ్యగి హానుభూతమపి సచ్ఛిష్యావ బోధాయతత్ । సత్యం సంస్కృతవాన్ సమస్త జగతాం నైజం నిజాలోకనాత్ ॥

అనువాదము :-

ఆత్మస్వరూపమా అత్యంత సత్యము । పాపమూషిత దుస్స్వభావులకదే । గోచరింపక కడు గూఢంబుగానుండు । పరిణత బుద్ధులౌ పండితులకు । స్పష్టంబుగా దోచు ప్రౌఢతరంబు నద్భుతమునైన నిజానుభూతివలన । ద్వైతేంద్రజాలముం దరిమి వైచి సుఖించు దేశికుం డంతతో తృప్తిపడక ॥ తెలివిగల్గు శిష్యుల ప్రబోధించు కొరకు, జగము పారమార్థిక రూపమగు నిజమును సంస్మరించును మఱిమఱి సన్నుతించు । ఆశ్రితోద్ధరణంబు ముఖ్యంబుగాన॥ (1)

ఇదియొక మహాత్ముని యనుభవ ప్రకటనమని పై శ్లోకానువాదములవలన స్పష్టమగుచున్నది.తన భావములను ప్రకటించుటే కవిత్వమని భావించు నాంగ్లేయ కవి ప్రముఖులున్నారు. ఇది వారల కవిత్వ నిర్వచనములకనుగుణమైనదని చెప్పవచ్చును. ఆధునిక కవిత్వనిర్వచముల కనుగుణమైన కవిత్వమును క్రాంతదర్శియైన కవి రావు ననే వేయి సంవత్సరములకు పూర్వము తదనుగుణమైన కవిత్వమునుతాత్వికముగ శ్రీ శంకరాచార్యులు ప్రకటింపగలిగినారు. ఇది శాంతరసభరితమైనది. ఇందు మొత్తము పదునేడుశ్లోకములు శార్దూల విక్రీడిత వృత్తమున నున్నవి. అనువాద మొక్కొక్క శ్లోకమున కొక్కొక్క సీసపద్యముగా చేయబడినది. ఈ ప్రకరణమునందలి యొండు రెండు శ్లోకములు వాని యనువాదములు నిచట నుదాహరింపబడుచున్నవి.

ఆత్మానాత్మ వివేచనాపి మమ నో విద్వత్కృతా రోచతే
నాత్మానాస్తి యదస్తి గోచరపుః కోవా వివేక్తుం క్షమః

మిథ్యావాదవిచారవిస్తర మహాశోకుర్వు స్త్వదృష్టాత్మకా
భ్రాన్తా ఏవ సనాతనా దృఢధియ స్తూష్ణీం శిలావత్ స్థితాః ॥ (పుట 166-13)

సీ॥ ఏదియాత్మ? అనర్థమేది?
యుగయుగంబుల యుక్తిప్రయుక్తి ప్రయోగసరణి
సతతంబు నేను విచారించు
నెవ్వాడు అధిగమించలేడు నాకంతగాను
ఉన్నది కనబడుచున్నది, ఆత్మయే
తలప నవాత్మకు తావులేదు
ఆత్మవిచార సమర్థులు తక్కువ ఆత్మను చూడలేనట్టివారె
నలుపుదురు వ్యర్థవిచారములను॥
మూలమెరుగరు భ్రాంతియే మూలమిచట. అశ్వములవోలె ధృఢ
చిత్తుల చలవృత్తి మది ప్రకాశించుచుందురు మౌననిష్ఠ॥ 13

స్వారస్యైక సుబోధవాదు మనసే ప్రోక్షానుభూతి స్త్వియం
దాతన్యానరు యోగముగ్రకుధియే దుష్టాన్తరంగాయచ
మేzయం రమ్య విదన్విలోత్తమ శిరః ప్రాప్తా చతా స్తిస్వయం
సాచేన్మర్కట హస్త దేశపతితే కిం రాజతే కేతకీ.॥ 17

సీ॥ మూర్ఖులు మోహైక బుద్ధులు దుష్టాంత। రంగులు నైన వారలకు చెప్ప
బోకుమీ ప్రాభానుభూతిని, తేకువతోడ స్వారస్య ముం దొప్పదోగ
ననుభవింప గల యుపమల మానసునకే । బోధింప దగు మనః పూర్వకముగ
కారణంబేమన? కడురమణీయమై తావులం । జిమ్ము గేదంగిపూవు
రసికుచేతబడిన రాణించు దలకలం
కారమగుచు నట్లుగాక
కోతిచేతబడిన నింక జెప్పెడి దేముండు?
విలువ మెల్ల చెల్ల చెదరుగాదె॥ (17)

ఈ యనువాదము మూలానుగుణమై యున్నది. ఇందలి చివరి శ్లోకాను వాదములందలి దృష్టాంతము రమ్యముగా నున్నది. మూలమందలి భావము లను వాదమున చక్కగా ప్రతిఫలించినవి.

5. జీవన్ముక్తానందలహరి :- ఇది "మునిర్న వ్యామోహం భజతి గురు దీక్షాక్షతతమాః" అను మకుటముతో పదునెనిమిది శ్లోకములలో చెప్పబడిన జీవన్ముక్తుని కనుభవమైన యానందలహరి. ఇదియు శాంతరస ప్రధానమైనది. లౌకిక

సీ॥ ఏకాగ్ర బుద్ధితో నెవ్వడు జ్ఞానసమంబు । నెదవెడి మేటి పండితులతోడ
రసవత్ప్రబంధ నిర్మాణధౌరే । యులన్ వాసిగాంచిన కవివరులతోడ
కలసి తద్గోష్ఠి వర్తిలుగాక అనుకరించే । ప్రధానంబుగా నెంచు తర్క-
కుశలులతోడ డీకొని గెలిచి సమ్మత । సరణిని వాదంబు సలుపుగాక॥
సద్గురు కటాక్ష వీక్షణైశ్వర్య ధుర్యుడైన
ముని సింహమునకు మోహద్విపంబు
వలని భయమని యుండునా! వాస్తవమున
కతని అజ్ఞాత విజ్ఞాన హేతుముగాదె! (5)

శ్లో॥ మానే మానీ గుణిని గుణవాన్ పణ్డితే పణ్డితశ్చ
దీనే దీనః సుఖిని సుఖవాన్ భోగిని ప్రాప్తభోగః
మూర్ఖే మూర్ఖో యువతిషు యువా వాగ్మిని ప్రౌఢవాగ్మీ
ధన్యః కోపి త్రిభువనజయీ యోఽవధూతేఽవధూతః ॥ (18)

సీ॥ మౌనిగా వర్తించి మౌనవ్రతులలోన । గుణ వజ్జనులలోన గుణిగ మెలగ
పండితకోటిలో ప్రజ్ఞానిధిగ । నుండి సుఖిగా విరాజిల్లి సుఖులలోన
భోగులలో మహాభోగి గా దీపించి । మూర్ఖుండుగా దోచి మూర్ఖులందు
యువకులలో మేటి యువకుడై నట్టి । వక్తలలో మంచి వక్తయు నయి॥
గణనకెక్కిన సన్న్యాసి గణములోన సాధు
సన్న్యాసిగానుండ జాలు నెవడు
వాడె ధన్యుండు త్రిభువనవశియు వాడె
ఇన్నియేల? జీవన్ముక్తు డిన్న సతడె॥ (12)

ఈ యనువాదము మూలానుగుణముగనే యున్నదని చెప్పవచ్చును. చివరి యుదాహరణములో మూలమున చివరనున్న "యోఽవధూతేఽవధూతః । అను భాగ మనువాదమున" జీవన్ముక్తుడని యున్నది. ఇది స్థూలముగ చూచిన సరిగనే యున్నట్లున్నది కాని వాస్తవమున కొంత భేదమున్నది. అవధూత జీవన్ముక్తుడే కాని జీవన్ముక్తులందరు నవధూతలుకారు. అవధూత పదము జీవన్ముక్త పదము కంటె విశిష్టార్థ యుతము. ఇట్టి సూక్ష్మమైన భేదము లీ ప్రకరణానువాదమున నొకటి రెండున్నవి. మిగిలిన యన్ని విషయములలో నీ యనువాదము సమంజసముగనే యున్నది.

6. సదాచారము:- ఇందు పరంపరగా నాచారమున నున్న స్నాన సంధ్యాది కర్మ కలాపములు, సన్న్యాస సత్య శౌచాదులు లౌకికార్థమున గాక తాత్త్విక

భావముతో నద్వైత పరముగా తెలుపబడినవి. ఆచారకాండ యందలి ప్రతియంశము నిందద్వైత పరముగ నన్వయించి తెలుపబడి యదే సదాచార మని చెప్పబడినది. "సత్" అనగా పరమాత్మ లేక పరబ్రహ్మము. దానికనుగుణమైన యాచారమే సదాచారము. ఇందట్టి తాత్పర్యము స్పష్టము చేయబడినది. ఇందు మూలమునమొత్త మేబదియైదు శ్లోకములున్నవి. అవి. అనువాదమున నలుబదియారు పద్యములలో కూర్చబడినవి. కొన్ని శ్లోకముల కొక్కొక్క దాని కొక్కొక్క. చిన్ని పద్యము గాను కొన్ని శ్లోకములకు రెండుమూడింటి కొక సీసపద్యముగాను ననువాదము చేయబడినది. మూలానువాదములనుండి యిచ్చట మచ్చునకు కొన్ని యుదాహరింప బడుచున్నవి.

మూలము:-

అత్యంతమలినో దేహో దేహీ చాత్యంతనిర్మలః
అసఙ్గోఽహమితి జ్ఞాత్వా శౌచ మేతత్ప్రచక్షతే॥ (6)

అనువాదము:-

ఆ॥ వె॥ తెలియ మిగుల కొంప దేహంబు,
దేహియా నింగి భంగి చాలనిర్మలుండు,
మేనిపొత్తు నాకు నేనాడు లేదని
సంస్మరించుకొనుట శౌచ మగును. (6)

ఈ యనువాదము మూలమునందలి అసంగోహం అను దానికి "మేని పొత్తు నాకు నేనాడు లేదను" దేహీ చాత్యంత నిర్మలః" అను దానిని "దేహి యా నింగి భంగి చాలనిర్మలుండు అనుటలో "నింగి భంగి" యనెడి యుపమానము మూల భావమును వివరించుచు సుబోధము చేయుచున్నవి.

శ్లో॥ హస్తాభ్యాసోఽపి సన్న్యాసో నైవ కాషాయవాససా
నాహం దేహోఽహమాత్మేతి నిశ్చయోన్యాస లక్షణమ్॥ (6)

గీ॥ కావిగుడ్డలు కట్టినన్, కఱ్ఱనూతము
పట్టినన్ రాదు సన్న్యాసపదముఫలము
'నేనెపో ఆత్మ' నను దృఢనిశ్చయమున
తనుగతాభిమానము వోవ ధన్యు డగును॥

ఇందు మూలమందలి "నాహం దేహోఽహమాత్మేతి నిశ్చయః" అనునది 'నేనెపో అత్మ' నను దృఢ నిశ్చయమున తనుగతాభిమానము వోవో యని యనువ దించుట మూలమునకు మెరుగు పెట్టినటున్నది.

"జ్ఞాన విజ్ఞాన నిష్ఠో....।। బ్రహ్మచారీ స ఉచ్యతే॥ [50] [51]

సీ॥ జ్ఞాన విజ్ఞాన నిష్ఠా కరణంబగు। అమల స్వరూప బ్రహ్మార్పణంబె
భోగంబు, శేషంబు భుజియింపు। నది శుద్ధ సత్త్వగుణము భోగసాధన మగు
నది రజోగుణము భోగ్యంబు తమో। గుణ మీ గుణ త్రికమున కట్టిశక్తి
నొదవించి మెఱయింపుచుండును పర। మాత్మ: అనునది వేదాధ్యయనరతుడయి॥
వీర్య ధారణా వ్రతము పవిత్రతరము
నాచరించుచు నుండి సమస్తజగము
"అద్వితీయ పరబ్రహ్మ"మని గ్రహించు
నతని సద్బ్రహ్మచారిగా శ్రుతి వచించు॥ (41)

రెండున్నర శ్లోకముల భావమిచట నొక సీస పద్యమున కూర్చ బడినది. మూలమందలి "బ్రహ్మాధ్యయన సంయుక్తో బ్రహ్మచర్య రతస్సదా" యను శ్లోక పాదము "అనుదిన వేదాధ్యయనరతుడై వీర్యధారణా వ్రతము పవిత్రతరము నాచరించుచునుండి" యని యనువదింపబడినది"

"బ్రహ్మాధ్యయన" మను పదమునకు 'వేదాధ్యయనరతుడై వీర్య ధారణావ్రతము పవిత్రతరము నాచరించుచునుండి యని యనువదింపబడినది.

"బ్రహ్మాధ్యయన" మను పదమునకు "వేదాధ్యయన మనునదిస్థూలముగ సరిపోవును. కాని యిచ్చట "వేదాంత" శబ్ద ప్రయోగమింతకంటె యోగ్యతరముగ నుండును. "అట్లే"బ్రహ్మచర్యరతః" అనుపదమునకు "వీర్యధారణావ్రతము పవిత్ర తరము నాచరించుచునుండి" యనుటయు లౌకికముగసరిపడునుకాని తాత్త్వికముగ తృప్తికరముగ నుండదు. "సర్వం బ్రహ్మేతియోవేద" యను శ్లోక పాదభాగమును "సమస్తజగము అద్వితీయ పరబ్రహ్మమని గ్రహించు" ననుటలో "అద్వితీయ" అను పదము భావమును మరింత స్పష్టము చేయుచున్నది.

శ్లో॥ సదాచారమిమం నిత్యంయోను సన్ధతే జనః।
సంసారసాగరా ద్ఘోరం సముక్తోత్ర సంశయః॥

గీ॥ ప్రత్యహం బీసదాచారపద్ధతి గొని
బుద్ధితో ననుసంధానమును బొనర్చు
వ్యక్తి దుస్తరసంసార వార్ధిదాటి:
స్వపదమును గాంచగల్గు నిస్సంశయంబు॥ [43]

ఇందు మూలమందలి"ముక్తః"అనుపదము "స్వపదముంగాంచగల్గు"నని యనువదింపబడినది. ఇది తాత్పర్యముగ సరిపోవునుగాని మూలమందలి "ముక్త"

పద మంత యుక్తముగా లేదు. మొత్తముమీద నీ యనువాదము తృప్తికరముగ నున్నదనవచ్చును.

7. వేదాంత డిండిమము.- వేదాంత సత్యముల నిందు డిండిమ నాదము వలె బాహాటముగా చెప్పుటచే దీని నాచార్యశంకరులు వేదాంత డిండి మమనిరి. దీని కితరానువాదములు కూడ ఉన్నవి. ఇందు మూలమున మొత్తము తొంబదిమూడు శ్లోకములున్నవి. అవి అనువాదమున శ్లోకమున కొక పద్యముగా తొంబదిమూడు గీతపద్యములలో ననువదింప బడినవి. అందుకొన్ని యుదాహరింపబడుచున్నవి.

శ్లో॥ ఆత్మానాత్మ పదార్థౌ ద్వౌ భోక్తృ భోగ్యత్వ లక్షణౌ
బ్రహ్మైవాత్మాన దేహాదిః ఇతి వేదాంత డిండిమః॥ (2)

గీ॥ ఆత్మయు ననాత్మయనెడి పదార్థయుగము
పొలుచుదాన నొక్కటిభోక్త; భోగ్యమొకటి
ఆత్మబ్రహ్మ, మనాత్మ దేహాదికంబు;
ఈ రకంబుగ వేదాంతభేరి మ్రోగు॥

ఇందు మూలమున "బ్రహ్మైవాత్మానదేహాదిః" అని యున్నదానిని "ఆత్మ బ్రహ్మ, మనాత్మదేహాదికంబు" అని ఆత్మఅనాత్మలను రెంటిని స్పష్టముగ నిర్వ చించుచు ననువదించుట మెచ్చదగినది.

శ్లో॥ న వర్ణాశ్రమ సంకేతైః న కర్మోపాసనాదిభిః,
బ్రహ్మజ్ఞానం వినా మోక్షః ఇతి వేదాంత డిండిమః॥ (11)
క్షితిని వర్ణాశ్రమోచిత చిహ్నములును
కర్మలు నుపాసనలును, మోక్షమ్ము గూర్ప
దగవు బ్రహ్మవిజ్ఞానమే తగు నటంచు
మ్రోగు వేదాంతభేరి యమోఘముగను॥ [11]
అద్వైతద్వైతవాదౌ ద్వౌ సూక్ష్మస్థూలదశాం గతౌ॥
అద్వైతవాదా న్మోక్షస్స్యాత్ ఇతి వేదాంత డిండిమః॥

గీ॥ ద్వైతమద్వైత మనెడివాదములు రెండు
గలవు స్థూలమొకండు సూక్ష్మందొకండు
ముక్తి యద్వైతవాదాన మొనయు"నని ది
గంతములు నిండమ్రోగు శ్రుత్యంతభేరి॥ (18)

శ్లో॥ ద్విజత్వం విద్యనుష్ఠానాత్ విప్రత్వం వేదపాఠతః
బ్రాహ్మణ్యం బ్రహ్మవిజ్ఞానాత్ ఇతి వేదాంతడిండిమః (32)

గీ॥ "కలుగు విద్యనుష్ఠానంబుకతన ద్విజత
వేదపఠనంబు నన్జేసి విప్రతయును
బ్రహ్మవిజ్ఞానబలమునన్ బ్రాహ్మణత్వ"
మట్లు ననుచు ఘోషించు వేదాంతభేరి॥ (32)

శ్లో॥ అభేదదర్శనం మోక్షః సంసారో భేదదర్శనః
సర్వవేదాంతసిద్ధాన్తః ఇతి వేదాంతడిండిమః॥ (70)

గీ॥ భేదదృష్టి సంసార, మభేదదృష్టి
మోక్ష మనబడు వేదాంతములు సకలము
తలచి, తలచియు దీని సిద్ధాంతపరచె
ననుచు నుపనిషద్భేరి మ్రోయంగ దొడగె॥ (70)

ఇందు మూలమందలి "సర్వ వేదాంత సిద్ధాంతః" అను పాదమును "వేదాంతములు సకలము తలచి, తలచియు, దీనిసిద్ధాంతపరచెనని యనువదించుటలోతలచి తలచియు అనుపదము ప్రయోగము, విషయమును ఒకింకతో నొక్కి (tress) చెప్పుచున్నట్లు యోగ్యముగా నున్నది.

మూలశ్లోకము లన్నిటికిని "ఇతి వేదాంతడిండిమః" అను మకుట మున్నది. అనువాదమున నామకుటము భిన్నభిన్నరీతుల నదేభావము వచ్చునట్లు చక్కగా మార్చి కూర్చబడినది.

8. అద్వైతోపదేశ పంచరత్నములు :- 'సాధనపంచకమ్, అను పేరుతో నద్వైతతత్వసాధకు లాచరింపదగిన విషయముల నాచార్య శంకరు లైదు శ్లోకము లలో బోధించిరి. వానికి "పంచరత్న మాలిక" యనియు "ఉపదేశపంచకమ్" అనియు వాడుకయున్నది. ఆ శ్లోకము లిందు "అద్వైతోపదేశ పంచరత్నములు" అను పేరుతో ననువదింపబడినవి. ఇందు మూలముననై దుపదేశకశ్లోకములు, నొక ఫలశ్రుతి శ్లోకము మొత్త మారు శ్లోకములున్నవి. అనువాదకర్త మూలోపదేశ శ్లోకము లందలి యొక్కొక్క యంశమును వివరించుచు నొక్కొక్క చిన్న పద్యముగ కూర్చెను. ఈ శ్లోకపంచకమున కుపోద్ఘాతముగా రెండు పద్యములను చెప్పెను. ఇట్లు మొత్తమీ యనువాదమున ముప్పదియారు పద్యములున్నవి. ఈ క్రింది యుదాహరణములనుబట్టి యనువాద పదతి స్పష్టముకాగలదు. మూలానువాదములు :-

శ్లో॥....భవసుఖే దోషోZ నుసంధీయతాం
ఆత్మేచ్ఛా వ్యవసీయతాం॥ నిజగృహాత్ తూర్ణం వినిర్గమ్యతాం॥

గీ॥ మానసంబు నిష్కల్మషమైన లోన
నిరవధికదుష్టసంసారనిష్ఠ విషయ
జాత సౌఖ్యమ్మునకు చాలరోతపడుచు
"నశ్వరము దుఃఖయుత" మను నమ్మకమున॥
విధి విహితకర్మలనెల్ల విసువకుండ
భక్తిమైచేయునలవాటు పడిన పిదప
ఫలము శ్రీపరమేశ్వరార్పణము సేసి
సలుపనగు పూజ కర్మపుష్పాలతోడ॥
ఆత్మవిషయక మగు ప్రేమ మంకురించి,
ధ్రువపడినవెంటనే మహోత్సవముకయి
తరలు మాత్మగేహమునుండి, మరలపోకు
దారపుత్రాది నిందలం దలకుగొనకు॥ (8,9,10)

శ్లో॥ సద్విద్యా నుపసర్ప్యతాం అనుదినం తత్పాదుకే సేవ్యతాం
బ్రహ్మైకాక్షరమర్థ్యతాం, శ్రుతిశిరోవాక్యం సమాకర్ణ్యతాం. (2)

గీ॥ పండితుడు బ్రహ్మవిదుడు నైవరగుగురుని
సన్నిధిం జేరి వినయసంపన్న బుద్ధి
అనుదినమ్ము తదీయపదాబ్జసేవ
చేసి తదనుగ్రహం బుపార్జింపవలయు॥
అపరిమితం బేకాక్షర । మపురూపము, బ్రహ్మవస్తువర్ధించి గురున్
కృప నతడుపదేశింపగ । ఉపనిషదర్థమ్ము తెలియు టుచితము సుకృతీ॥
(15, 16)

శ్లో॥ వాక్యార్థశ్చ విచార్యతా శ్రుతిమతః పక్షః సమాశ్రీయతాం
దుస్తర్కా త్సువిరమ్యతాం శ్రుతిమత స్తర్కోZను సంధీయతాం
బ్రహ్మాస్మీతి విభావ్యతామహరహర్గర్వః పరిత్యజ్యతాం
దేహోZహమ్మతి రుజ్ఝిత్యాబుధజనై ర్వాదస్సముత్సృజ్యతాం॥ (3)

సీ॥ అవ్వల జీవపరాభేదరూపమై । యలరెడి తత్త్వమస్యాది వాక్య
ములయర్థము సమగ్రముగ విచారించుట । సముచితంబు విచారసమయమందు

ఆగమశతంబు లగ్రహీయమైప చెప్పెడి। ముని మహర్షి ప్రకీర్తితమైనను.
వేదశాస్త్రంబులు మరి యుక్తి। ద్వైతానందపోల యేరానొకరుము॥

గీ॥ వెలయు వేదాంత వాక్యార్థములకు నను
గుణరహితమైన తత్త్వమింకొరు గ్రాహ్యంబు
విపుల "అనగతోపాధికంబు బుద్ధ్యాత్మకమగు
బ్రహ్మమే"నని ఘోషించు శ్రుతిదినంబు।

గీ॥ అంతమాత్రాన లేదు నాయంతవాడు
జ్ఞానియును లేన అని అభిమానపడకు
ఎత్తరిని అజ్ఞానవినివృత్తి బొందెడు
నీవడినయట్టి శ్రమమెల్ల నిష్ఫలమగు॥

గీ॥ స్థూలసూక్ష్మకారణ శరీరాలయందు
స్థాయిపడిన అహంబుద్ధి సాగనంపు
దూరముగ నీవు దాని పోవోలవేని
నిలదు బ్రహ్మాహ మస్మీతి నిశ్చయంబు॥ (17, 18, 19, 20)

పై యుదాహరణములనుబట్టి యీ యనువాద మెంత వివరణాత్మకముగ నున్నదో స్పష్టము కాగలదు. మూలమున సూత్రప్రాయముగనున్న యంశము లీయనువాదమున సులభ సుబోధములగుచున్నవి. ఈ శ్లోకముల కిట్టి యనువాదమే యుక్తమైనది. ఈ యనువాదమున కీరచయిత ప్రత్యేకాభినందనీయుడు.

9. తత్త్వోపదేశము :- ఇందు గురుదేవుడు శిష్యునకు చేసిన యద్వైత తత్త్వబోధ శ్రుతియుక్త్యనుభవ పూర్వకముగ తెలుపబడినది. ఇందు మూలమున నెనుబది యెనిమిది శ్లోకములున్నవి. అనువాదము కొన్ని తావుల రెండు మూడు శ్లోకములకొక సీసపద్యము చొప్పునను, కొన్ని శ్లోకములకు ఒక్కొక్కదాని కొక్కొక్క చిన్నపద్యము చొప్పునను చేయబడినది. మొత్త మీయనువాదమున నేబది యొక్క పద్యములున్నవి. ఉదాహరణములు :- మూలము-అనువాదము

అశ్రోత్రో రూపహీన స్త్వం జాతిహీనోఽ ప్యభౌతికః ।
శుద్ధ నిత్యోఽసి దృగ్రూపోఽఖిలో యద్వన్న దృగ్భవేత్ ॥ (3)

గీ॥ ఆకృతియు, జాతియును చెప్ప నీకు లేవు
తగులమూ లేదు పంచభూతాలతోడ
నిత్యతయు, నిర్మలత్వమ్ము నీగుణాలు
జ్ఞానమయుడవు నీవెడ? మే నదేడ? (2)

ఇందు మూలమున రెండవపాదము సరిగా ననువదింపబడలేదు. మూలమున నున్న ఘటోపమానమిందు విడిచివేయబడినది. పద్యమునందున్న చివరిపాదము అమూలకము.

శ్లో॥ శోధితే త్వం పదార్థేహి తత్త్వమస్యాది వస్తితః ।
సమ్యగ్వేద్యో న్యథా తస్మాచ్ఛోధనం కృతమాదితః॥ (22)

సాధుమతి । త్వంపదార్థ సంశోధనంబు । ప్రథమ కర్తవ్య "మది పట్టు వడినగాని । తత్త్వమస్యాది వాక్య చింతనము పట్టు । వలెనది మెలంగి యత్నింపవలయు శ్రద్ధ॥

ఇది మూలానుగుణమైన యనువాదము.

శ్లో॥ అహం బ్రహ్మేతి విజ్ఞానం యస్య శోకంతరేత్యహో ।
ఆత్మప్రకాశ మానోపి మహావాక్యై స్తథైకతా ॥ (43)
తత్త్వమోర్బోధ్యతే భాసి పౌర్వాపర్యానుసారతః
తథాపి శక్యతే నైవ శ్రీగురోః కరుణాం వినా॥ (44)
అపరోక్షయితుం లోకా మూఢైః పండితమానిభిః ।
అన్తఃకరణ సంశుద్ధౌ స్వయం జ్ఞానం ప్రకాశతే॥ (45)
వేదవాక్యైరతః కింస్యాద్ గురుణాతిన సాంప్రతమ్ ।
ఆచార్యవాన్ పురుషోహి వేదేత్యేవం శ్రుతిర్జగౌ ॥ (46)

సీ॥ నేనె బ్రహ్మమునను జ్ఞానముం బడసిన । జనుడు శోకం బనుజలధిదాటు
ఆత్మ స్వయం ప్రకాశాత్మకమైన, మహా । వాక్య సమతి పూర్వాపరముల
సరణి నేకత్వమున్ సాధింపఁ దత్వం । పదములకు ముఖ్యము తామటన్న
యభిమానమునఁ మాగియాడు మూఢులకు।ప్రత్యక్షమ్ము గా దాత్మ తనదుగురుని॥

గీ॥ కరుణయును జిత్త శుద్ధియుఁ గల్గినపుడె
జ్ఞానమునకు స్వయం ప్రకాశత లభించు
"ఏలగురుఁ డాగమోక్తులే చాలు ననగ
వలవ దాచార్యవంతుడే తెలియజాలు
నాత్మతత్త్వంబు" నని చెప్పు నాగమంబె॥ (22)

ఇదియు మూలానుగుణముగనే యున్నది.

శ్లో॥ విచారణీ యా వేదాన్తా వన్దనీయో గురుః సదా
గురూణాం వచనం పథ్యం దర్శనం సేవనం న్నృణామ్॥ (84)

గీ॥ తెలియతగినవి యుపనిషత్తులసలుకులె
సర్వదా వందనీయుండు సద్గురుండె
గురువచ శ్రవణంబును, గురునిసేవ,
గురునిసందర్శనమె హితకరము లోయి॥ (47)

మొత్తముమీద నీయనువాదము మూలానుగుణమై మిక్కిలి యోగ్యముగ నున్నది.

10. ఆత్మబోధ :- ఆత్మబోధ శంకరాచార్య స్వామివారి ముఖ్యమైన లఘుప్రకరణ గ్రంథములలో మిక్కిలి ప్రసిద్ధమైనది. దీని రచనోద్దేశమీ యనువాద కర్తచే నిట్లు తెలుపబడెను.

గీ॥ ఉత్తమాధికారుల కుపయోగపడగ
శంకరాచార్యుడాది భాష్యత్రయంబు
చేసి మందబుద్ధుల గటాక్షింప నొండు
ప్రకరణము వ్రాయగా బూని పలికెనిట్లు॥ (1)

దీనిని పలువురు కవులింతకుపూర్వ మాంధ్రీకరించిరి. ఇంతవరకు లభ్యమైన వానిలో నిదియే కడపటి (Latest) యనువాదముగా తెలియుచున్నది. ఇందు మూలమున నరువది యెనిమిది శ్లోకములున్నవి. అనువాదము సీస గీత కంద పద్యములలో మొత్త మరువది మూడు పద్యములుగా చేయబడినది. మూలము - అనువాదపద్ధతి కుదాహరణములు ;-

శ్లో॥ బోధోన్యసాధనే భ్యోహి సాక్షాన్మోక్షైక సాధనమ్।
పాకస్య వహ్నివద్ జ్ఞానం వినామోక్షోన సిధ్యతి॥ (2)

సీ॥ "తపమును మఱియు మంత్రంబు కర్మంబు। యోగంబాదిగా అనేకమ్ములైన
సాధనంబులు ముక్తి సాధింపనుండ, బోధమ్మున కంత ప్రాధాన్యమేల"
అనరాదు; తపములోనగు సాధనంబులు తమంతతా। మోక్షసంధాయకములు కానేరవు;
క్రమంబుగా జ్ఞాన మొదవింపజాలు; నంతియ; మఱి జ్ఞాన మన్న ॥
బొడముతోడనె అజ్ఞానమును హరించి
మోక్షరాజ్యంబు గట్టు ముముక్షువునకు
పావకు డొకండు లేనిచో పాక మగునె
కట్టెలును నీరు లోనుగాఁ గలుగుమాత్ర ॥

కం॥ జ్ఞానమునకు దూరంబయి। మానవు డెవ్వడును మోక్షరాజ్యము
పడయంగా నేరడు; తలపోయగ। జ్ఞానమె ముఖ్యంబు మోక్షసాధనములలో॥
(3, 4)

మూలమందలి యొక్క అనుష్టుప్ శ్లోకము రెండు పద్యములలో ననువదింపబడుటను బట్టి యీ యనువాద మెంత వివరణాత్మకమో సులభముగ తెలియగలదు. ఇందు జ్ఞాన ప్రాధాన్యము సహేతుకముగ నిరూపింపబడినది.

స్వబోధే నాన్యబోధేచ్ఛా బోధరూపతయాత్మనః ।
న దీప స్యాన్యదీపేచ్ఛా తథా స్వాత్మా ప్రకాశతే॥ (29)

ఆత్మ బోధస్వరూపకు డగుట గాన
అతని వెలుగ ననవసర మన్యబోధ
ప్రభల నీనుచు వెల్గుదీపమును చూడ
ఒండు దీపంబుతో పని యుండ నొక్క

ఇది యథా మూలానువాద మనవచ్చును.

శ్లో॥ ఉపాధిస్థోపి తద్ధర్మై ర్నిర్లిప్తో వ్యోమవన్మునిః ।
సర్వవిన్మూఢవత్ తిష్ఠే దసక్తో వాయువచ్చరేత్॥

కం॥ ఉన్న నుపాధిగతుడై యున్నాడు । తద్ధర్మలేప మించుకయును నం
టన్నేరదు ముని గగనము తెన్నున । ప్రారబ్ధకర్మ తీరెడుదాకన్॥

గీ॥ సకల మెరిగిన జ్ఞానియు సంచరించు
పామరుం డెట్టు లట్లే ప్రపంచమునను
కోర కున్నను వచ్చి పైకొనెడి విషయ
ములను దగులక వాయు వువలె మెలంగు॥ (49, 50)

ఇచ్చట నొక్క శ్లోకమునందలి భావము రెండు పద్యములలో వివరింపబడినది. ఈ శ్లోకమున కింతమాత్రము వివరణ మవసరమే. ఇట్లీ యనువాదము విషయమును సందర్భమునుబట్టి కొంత యథామూలముగను కొంత వివరణాత్మకముగ నున్నది.

**11.** స్వాత్మప్రకాశిక :- కొంత వేదాంతశాస్త్ర జ్ఞానముగల యొక శిష్యుడు గురునిచేరి "అద్వయాత్మను వివేకయుక్త బుద్ధితో నెరిగినను నాకు బంధ మోక్షాదిక వ్యవహారములు తోచుచునేయున్నవి. ప్రపంచము బ్రహ్మ వివర్తమే యైనను నాకు సత్యముగానే యెల్లప్పుడును గోచరించుచున్నది. ఇట్లు నాకేర్పడిన సంశయపాశమును ఛేదింపుడని ప్రార్థింప నాగురు డాతనికి స్వరూపజ్ఞానము దృఢ మగుటకై చేసిన బోధయే యిందలి సారాంశము. ఇందు మొత్త మరువది యెనిమిది శ్లోకము లున్నవి. అవి శ్లోకమున కొకపద్యము చొప్పున ననువదింపబడినవి.
ఉదాహరణములు :- మూలము - అనువాదము :

శ్లో॥ బ్రహ్మాది స్తంబపర్యంతాః ప్రాణిన స్త్వయి కల్పితాః।
బుద్బుదాదితరంగాంతా వికారాః సాగరే యథా॥ (9)

గీ॥ బ్రహ్మ మొదలుగ స్తంబపర్యంతమైన
విశ్వమెల్ల నీయందె కల్పింపబడియె
తరగలున్ బుద్బుదంబులు నురుగు మున్ను
గాగలసమస్త మబ్ధిలో గలిగినట్లు॥ (9)

శ్లో॥ మాయా తత్కార్యవిలయే నేశ్వరత్వం నజీవతా।
తతః శుద్ధచి దేవాహం। చిద్వ్యోమ నిరుపాధితః॥

గీ॥ మాయ తనకార్యములతోడ మాసినపుడు
ఉభయు లైనజీవేశ్వరు లుండబోరు
అపుడు చిద్గగనము నిరుపాధికంబు
గాన, శుద్ధచిన్మయుడను నేనె యుందు॥ (43)

శ్లో॥ దేశాభావాత్ క్వగంతవ్యం స్థానాభావాత్ క్వవా స్థితిః।
పూర్ణే మయి స్థానదేశౌ కల్పితా వహ మద్వయః॥ (62)

గీ॥ ఎల్లచోట నిండియున్ననా కేగ దగిన
యుంట దగినచోటని యెట్లు లుండగలదు?
మోపబడియెబో అద్వయమూర్తి యందు
"స్థాన" మని "దేశ" మని యిది కానిమాట॥

ఈ యనువాదము యథామూలమై యన్యూనాతిరిక్తమై మిక్కిలి యోగ్యముగ నున్నది.

12. యోగతారావళి:- తారావళి యనగా నిరువది యేడు పద్యములు గలది. కొన్నిట యిరువది యెనిమిది యుండుటయు కద్దు. ఇందు మూలమునం దధిక పాఠమని చెప్పబడిన మూడు శ్లోకములతో కలిసి మొత్తము ముప్పది శ్లోకము లున్నవి. అనువాదకర్తయును నట్లే ముప్పది శ్లోకములకు ముప్పది పద్యములను రచించెను. ఇందలి విషయము లయయోగ సంబంధమైనది. అందు నాదాను సంధాన రూపమగు సమాధియు తదంగములు నిందు తెలుపబడి ప్రశంసింపబడినవి. ఈ యోగమున ననుభూతమగు నిర్వికల్ప సమాధి ముక్తిప్రదముగా ప్రస్తుతింపబడినది: మూలము- అనువాదమున కుదాహరణములు-

శ్లో॥ ఉత్తాపితాధారహుతాశనోల్కై-
రాకుంచనైః శశ్వదపానవాయోః

సంతాపితా ద్చాంద్రమసః పతంతీం
పీయూషధారాం పిబ తీహ ధన్యః॥ (7)

గీ॥ ఉన్నతంబు లాధార చక్రోద్ధితంబు
లైన మంటలచేత అపానపవన
సముదితాకుంచనములచే సంతసించు
చంద్రమండలముననుండి జాలువారు
నమృతమును ధన్యులగువారె యానగింత్రు॥ (7)

శ్లో॥ నేత్రే య యోన్మేషనిమేషశూన్యే। వాయు ర్యయా వర్జితరేచపూరః
మనశ్చ, సంకల్పవికల్పశూన్యం। మనోన్మనీ సా మమ సన్నిధత్తాం॥

సీ॥ మాయయు తెరపట మూలమట్టుగ బోవు। కనుమోయి రెప్పానికలిగుబలిమి
ప్రాణానిలమును లోపలికి పీల్చుటయు। వెల్పలికి పంపుట దేనివలన నాగు
అపును కా దనిమెడియంతరంగగుణాలు। మాయ మా నెద్దానిమహిమవలన
మహి యోగములకెల్ల మకుటాయమానము వరమర్షి సేవ్య మై జరుగు నెద్ది॥
మరి మనోన్మనియను పేర మలయు నెద్ది
అదియపో నిర్వికల్పక మనుసమాధి
నిలువగాక నాయం దది నిరుపమాన
దివ్యసుఖవార్థిలో నన్ను తేల్చుగాక॥ (13)

ఇది వివరణాత్మకముగ నున్నది. ఇందలి "అదియెపో నిర్వికల్పకమను సమాధి" "నిరుపమాన దివ్యసుఖవార్థిలో నన్ను దేల్చుగాక" యను వాక్యములు మూలమున లేని కల్పనలు. ఇవి మనోన్మనిని గూర్చి విపరించునవి.

శ్లో॥ అమీయమీందాః సహజమనస్కా। దహం మహత్వే శిథిలాయమానే।
మనోగతిం మారుత వృత్తి శూన్యం। గచ్ఛంతి భావంగగనావశేషం (22)

మ॥ అమనస్కస్థితిలాభమెప్పు డగునో అప్పైనహంకారమున్
మమకారంబు నశించు చిత్తమునకుం బైదిన్ మరుద్వృత్తి శూ
న్యము ధన్యమ్ము సమస్త యోగిజన మాన్యమ్మైన ఆకాశ భా
వము ప్రాప్తించు నిజంబు ముక్తదశనాన్ వాకొందు రద్దానినే॥ (22)

ఇది లఘు వివరణాత్మకముగా నున్నది. "ముక్తదశ నాన్ వాకొందు రద్దానినే" యనునది మూలమున లేని కల్పన.

శ్లో॥ బ్రహ్మరంధ్రగతేవాయౌ గిరేః ప్రస్రవణం భవేత్।
శృణోతి శ్రవణాతీతం నాదం ముక్తిర్న సంశయః॥

గీ॥ ప్రాణవాయువు బ్రహ్మరంధ్రమ్ము పేర
పడగునట్టి సహస్రార పద్మమందు
వెలయిచో నమృతంబు స్రవించు మేరు
నగమునుండి అపూర్వమౌ నాదమొకటి
వినంబడు నిజంబు కైవల్యమనంగ నదియే॥ (30)

ఇది యథామూలానువాదమని చెప్పదగియున్నది.

ఈ యనువాదమున మూలమందలి క్లిష్ట విషయములు వివరముగ తెలుప బడినవి. సరళ సుబోధ విషయములు యథామూలముగ ననువదింపబడినవి. ఇది మొత్తముమీద సప్రయోజనముగ నున్నది.

13. భజగోవిందము:- ఆచార్య శంకరుల భజగోవింద శ్లోకములు జగ త్ప్రసిద్ధమైనవి. ఇవి పండ్రెండున్నవి. దీనికి ద్వాదశమంజరికా స్తోత్ర మనుపేరు న్నది. వారి శిష్యులు చెప్పిన పదునాలుగు శ్లోకములు చతుర్దశమంజరికా స్తోత్ర మను పేర భజగోవింద శ్లోకములుగానే వ్యవహరింపబడుచున్నవి. ఇవి భక్తిజ్ఞాన వైరాగ్య బోధకములై భక్తి, కరుణ, శాంతరసభరితములైనవి. అనువాదమున నివి శ్లోకమున కొక పద్యము చొప్పున రచింపబడినవి. అందలి కొన్ని యిచ్చట నుదాహరింపబడు చున్నవి. [మూలము సహా]

శ్లో॥ సత్సంగత్వే నిత్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం।
నిర్మోహత్వే నిశ్చలతత్వం నిశ్చలతత్వే జీవన్ముక్తిః॥

గీ॥ మంచివారితో జెల్మికామంబు నడచు
కామశాంతిని మోహంబు కడలు వట్టు
తలగమోహంబు నిశ్చల తత్త్వ మబ్బు
తత్త్వలబ్ధి జీవన్ముక్తి దశనొసంగు॥ [10]

మాకురు ధనజనయౌవనగర్వం
హరతి నిమేషాత్కాల స్సర్వం
మాయా మయమిద మఖిలం హిత్వా
బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా॥ [12]

కాలమువాత జిక్కి చెడుగా నిమేషములో సమస్త మీ
వాలిని బిడ్డలన్ ధనము యౌవనమున్ గని పొంగబోకు
మాయాలలితప్రపంచమున ఆస్థవహింపక తత్త్వవేత్తవై
క్రాలగజాలినన్ సుఖము కల్గు హరిన్ భజియింపు మూఢుడా॥ (12)

త్వయిమయిచాన్య త్రైకో విష్ణుః వ్యర్థం కుప్యసి మ య్యసహిష్ణుః
భవ సమచిత్తస్సర్వత్ర త్వం। వాంఛ స్యచిరా ద్యది విష్ణుత్వం॥ (24)

మ॥ నెరి నానల్కలు విన్ము విష్ణు వొకడే, నీయందు, నాయందు నం
దరియందున్ వెలుగొందు అన్యుడని కిన్కన్ జూపుచున్నావునన్
సరసంబా యిది భేదబుద్ధి విడినన్ సారూప్య సంసిద్ధియౌ
పరమాహ్లాదముతో పరాత్పరుని సంభావింపు మూఢాత్ముడా॥ (24)

ఇందు, మూలమునందలి "అసహిష్ణుః" అను పదమునకు బదులుగా "అన్యుడని" యను పదముపయోగింపబడినది. "సారూప్య సంసిద్ధియౌ" అనునది మూలమునలేని కల్పన.

"విష్ణుత్వం" అనుదానికి ప్రత్యామ్నాయముగా వాడబడినది.

ఇది మూలమునకు సరియైన యనువాదముగా తోచుటలేదు. కాని యభిప్రాయము స్థూలముగ యుక్తముగనే యున్నది.

"విష్ణుత్వం" అనుపదమునకు 'సారూప్య సంసిద్ధి' యనుపదముపయోగించుట మాత్రము కొంత విచారణీయమే. ఇది అద్వైతపరముగా లేదు.

శ్లో॥ కామం క్రోధంలోభం మోహం। త్యక్త్వాత్మానం పశ్యతి సోహం
ఆత్మజ్ఞాన విహీనామూఢాః । తే పచ్యంతే నరకనిగూఢాః॥ (25)

అనువాదము :-

మదిగల లోభమోహ మదమత్సరకామము లుజ్జగించి సౌ
ఖ్యదుడును మోహశూన్యుడగు నాత్మను చూడుము జ్ఞాన హీనతా
స్పదుడయినట్టి మూఢు డనిశంబును, నారకబాధనొందు ఇ
య్యదినిజమంచునమ్మి పరమాత్ముభజింపుము మూఢ చిత్తుడా॥ (25)

ఇది కొంత వివరణాత్మకముగా నున్నను మూలమునందున్న పటుత్వము కనిపించుటలేదు. "పశ్యతి సోऽహం" అను మూలమునకు "ఆత్మను చూడుము" అనునది తృప్తికరమైన యనువాదముకాదు.

మొత్తముమీద నీ ప్రకరణముయొక్క యనువాదమున మిగిలిన వాని యంత పటుత్వ మగుపడుటలేదు.

**14. ప్రశ్నోత్తర రత్నమాల :-** ఆచార్య శంకరులు లౌకికాధ్యాత్మికములకు సంబంధించిన జిజ్ఞాసువుల ప్రశ్నలను వాని కుత్తరములను "ప్రశ్నోత్తర రత్నమాలికా' ప్రశ్నోత్తర మణిరత్నమాల అను రెండు ప్రకరణములుగా రచించిరి. ఇందు

ప్రశ్నోత్తర రత్నమాలిక యందు యిరువది యేడు శ్లోకములును, 'ప్రశ్నోత్తర మణి రత్నమాల యందు మున్నది రెండు శ్లోకములున్నవి. ఈయనువాదము "ప్రశ్నోత్తర రత్నమాలికది" 'మూలమునగల మాలికా'యను పదమందు "మాలా" యనబడినది. మూలమునన్న యిరువది యేడు శ్లోకములలోని ప్రశ్నోత్తరము లిం దెనుబది పద్యములలో వివరణాత్మకముగా ననువదింపబడినవి. అందలి లౌకికవిషయములను విడదీసి తత్త్వవిషయకములైన ప్రశ్నోత్తరములు కొన్ని యిచట నుదాహరింపబడు చున్నవి. మూలము :-

శ్లో॥ భగవన్కి ముపాదేయం ? గురువచనం....
కోగురు ? రధిగత తత్త్వః శిష్యహితా యోద్యతః సతతం॥ (1)

తే॥ గీ॥ దేశికోత్తమ । భువినుపాదేయ మెద్ది ?
ఓయి శిష్య ! గురుండు హితోపదేష్టః కాన తద్వచనమె కొనంగాదగినది ॥

గీ॥ యాద్యుడు పేరుండు ? సమస్తశాస్త్రసారము గ్రహించి
పరమోపకార బుద్ధి । శిష్యుని గృతార్థు జేయఁ గాంక్షించునాడు ॥ (2)

ఇందు మొదటి ప్రశ్న కుత్తరము సకారణముగ తెలుపబడుట యుక్తముగ నున్నది. రెండవ ప్రశ్నకు సమాధానము మూలమునందున్నంత పటుత్వము లేక యున్నది. "అధిగతతత్త్వః" అనుదానికి "సమస్త శాస్త్రసారము గ్రహించి; యనునది తుల్యమైన యనువాదము కాదు. మొదటిది యనుభవ ప్రధానముగను, రెండవది భావనామాత్రముగను నున్నవి.

శ్లో॥ త్వరితం కిం కర్తవ్యం ? సుధియా సంసార సంతతిచ్ఛేదః
కిం మోక్షతరో ర్బీజం ? సమ్యక్ జ్ఞానం క్రియాసిద్ధం (3)

గీ॥ వేదశాస్త్రముల్ చదివినవిజ్ఞజనుడు
కడగి చేయంగవలసిన కార్యమెద్ది ?
అంతు గనరానిసంసారసంతతిని
సమూలముగ బరిమార్చుటే మొదటి చేత ॥ (3)

గీ॥ మోక్ష మనుపేరి అసదృశవృక్షమునకు
దేశికేంద్ర బీజం బెద్ది ? తెలుపవలయు
విడిచి ఫలవాంఛ జనుడు కావించునట్టి
సత్క్రియలనుండి పొడము సుజ్ఞాన మోయి ॥ (4)

అనువాదమున మొదటి ప్రశ్న మూలానుక్రమముగా నున్నది. కర్తవ్యమేది యనెడు ప్రశ్న సర్వులకు సంబంధించినదికాని, ముక్క వేదశాస్త్ర విజ్ఞునకు మాత్రమే కాదు. "అట్టి విజ్ఞుడైన" అని యున్నచో మరింత యోగ్యముగ నుండె డిది. అట్టి వానికైనను కర్తవ్యమిదియే యనెడి భావమునుబట్టి యితరులకు ముఖ్య కర్తవ్యమనెడి భావము వచ్చును. రెండవ ప్రశ్నకు సమాధానముగ క్రియాసిద్ధం సమ్యక్జ్ఞానం "అను మూలమునకు" విడిచి ఫలవాంఛ జనుడు రాయించునట్టి సత్క్రి యలనుండి పొందము సుజ్ఞానమనెడి యనువాదము 'క్రియ'ను వివరించుట యుక్తముగ నున్నది.

ఏలనో దీని తరువాతనున్న "కః పథ్యతరో ధర్మః?
కః శుచిరిహ ? యస్య మానసం శుద్ధం ।
కః పండితో ? వివేకీ కిం విష ?
మవధీరణా గురుషు ॥ (5)
అను శ్లోక మనువదింప బడలేదు. ఇది ప్రామాదికమై యుండవచ్చును.

శ్లో॥ కిం సంసారే సారం ? బహుశోఽపి విచింత్యమాన మిదమేవ
కిం మనుజే ష్విష్టతమం ? స్వపరహితా యోద్యతం జన్మ ॥ (5)
చటులసంసారమున నేది సార ? మనఘ సారమే ?
మను తర్కించె సార మగును
తలప మనుజులలో తత్త్వదర్శి యెవడు ?
పరుల హితమునకై పాటుపడెడివాడు ॥ (5)

ఇందలి రెండవ ప్రశ్నయు సమాధానమును మూలముతో భేదించుచున్నది. కారణము పాఠాంతరమగుట కావచ్చును. మూలానువాదముల రెంటిలోనివియు గ్రహింపదగిన యుత్తమ ప్రశ్నోత్తరములే.

శ్లో॥ విద్వన్మనోహరా కా ? సత్కవితా బోధవనితాచ
కం నస్పృశతి విపత్తిః? ప్రబుద్ధ వచనానువర్తినం దాంతం (28)
కం॥ రసికునివిత్తమ్మును మా । నసమును కొల్లగొన జాలినవి ఏవి ? గుణా
రసవత్కవితావాతురి అసమాన వివేకవత్త అంతేవాసీ ॥ (40)
కం॥ ప్రాపింపకుండు నాపద ఏపురుషున కలఘు జ్ఞాన వృద్ధుల హితమున్
జేపట్టి తిరుగు దాంతున కేపట్టున మప్పు మూడ దిప్పగుణాఢ్యా ! (41)

ఇందు మూలమునందలి "విద్వాల్" శబ్దము 'రసిక' శబ్దముగా ననువదింప బడినది. నిజమైన విద్వాంసుడు, నిజమగు రసికుడే. అందలి యంతర్గత భావమును గ్రహించినప్పు డిది యోగ్యమేయగు. అనువాదమున "విత్తమ్మును" అనునది మూలమున లేని అనవసరకల్పనమే యనవచ్చును. లేదా క్రమాలంకారముగా గ్రహించుచు, విద్వాంసుని విత్తమును హరించునది, సత్కవితయనియు, మానసమును హరించునది వివేకమనని సమన్వయించుకొనవచ్చును.

శ్లోక॥ కః శూరోయో భీత త్రాతా, త్రాతాచ కః స గురుః
కోహి జగద్గురు రుక్తః శంభుః జ్ఞానం కుతః ? శివాదేవ ॥ (55)

కం॥ శూరుడెవడు ? భీతిల్లిన
వారి నభయ మొసగి ప్రోచువాడు జగతి
రాధారమ్మను గురుదెవ్వడు ?
గౌరీనాథుండు నీలకంఠుడు శిష్యా ॥ (59)

ఇం దనువాదభేదము మూలమునందలి పాఠ భేదమునుబట్టి యేర్పడినట్లుగా నున్నది. "త్రాతాచకః" అను ప్రశ్నకు గురుః అని సమాధానము పాఠభేదమున్నను, రెండింటియందును భావము ఉత్తమమైనవే కావున గ్రహింపదగినవి.

కోమాయీ పరమేశః క ఇంద్ర జాలాయతే ప్రపఞ్చోऽయమ్
కః స్వప్ననిభో జాగ్రద్ వ్యవహారః సత్యమ పిచ కిం బ్రహ్మ ॥ (58)

గీ॥ ఎవడు మాయావి ? యల పరమేశ్వరుండు
ఇంద్రజాల సమంబె ? ఈ జగంబు
కలకుదీటగునెద్ది జాగ్రద్వ్యవహృతి
సజ్జనులు దేనివాకొంద్రు సత్యమనుచు
సువిమలంబగు బ్రహ్మవస్తువును వత్స॥ (72)

శ్లో॥ కిం మిథ్యా యద్ విద్యానాశ్యం తుచ్ఛంతు శశవిషాణాది
కా చానిర్వచనీయామాయాం కిం కల్పితం ద్వైతమ్ ॥ (59)
కింపారమార్థికంస్యాద ? ద్వైతం చాజ్ఞతాకుతోऽనాదిః
వపుశ్చపోషకం కిం ప్రారబ్ధం చాన్నదాయికిం ? చాయుః ॥ (60)
ప్రత్యక్షదేవతా కా మాతా పూజ్యోగురుశ్చక ? స్తాతః
కః సర్వదేవతాత్మా విద్యాకర్మాన్వితో బ్రాహ్మణః ॥ (62)

సీ॥ ఏదిమిథ్య ? విద్యచేహింసింపబడినది క్షితి దుచ్ఛములుగ వచింత్రు వేని
శశవిషాణా భపుష్పప్రముఖముల వి స్పష్టీకరింప నశక్యమైన

దెయ్యది ? మూలప్రకృతి: కల్పితంబెద్ది ద్వైతంబు: పరమార్థదర్శియేది ?
అద్వైత, మనసు యీయజ్ఞాన మేనాటి వాది దానికి గానరాదు, నిలుచు
గాయమెద్దాన ప్రారబ్ధ కర్మమునను
దేహి కన్నంబు నిండునట్టి దేది ?
అయు వింపు ప్రత్యక్షదైవతంబేది తల్లి
గురుడు బూజ్యుండు నెవ్వ డగున్ జనకుడు ॥ (73)
ప్రారబ్ధకర్మము నతను దేహికన్నంబు
నిండునట్టిది ఏది ? అయు వింపు ప్రత్యక్ష
దైవతంబు ఏది తల్లి గురుడు
బూజ్యుండు నెవ్వడగున్ జనకుడు (73)
తే॥ గీ॥ నిఖిలదైవస్వరూపియై నెగడు నెవడు ?
వివిధవిద్యలవల్లించి వేదవిహిత
కర్మనిష్ఠాతుడై జ్ఞానగరిమజేసి
యాత్మతుష్టిని బొందుభూసురుండు ॥ (75)
శ్లో॥ ఫలమపి భగవద్భక్త్యాః కిం తల్లోక స్వరూపసాక్షాత్త్వం
మోక్షస్చకోహ్యవిద్యాస్తమయః కిం సర్వవేదభూరథచోమ్ ॥ (66)
సీ॥ భగవానుపై నిబ్బభక్తికి ఫలమేమి ? భాసితతల్లోకవాససిద్ధి
తత్సమీపస్థిత తద్రూపలాభంబు । భవ్యాపరోక్షానుభవ మనన్య
భక్తిచేపడు ఫలములుత్సవ మోక్ష సమాఖ్య దేనికి సముచితంబు
పలుచందములు చుట్టబడినెట్టగాలాని । దంతురితాజ్ఞానసంతమసము
మూలమట్టు గణనగుచే ముక్తియగును
వేదరాశి సమస్తమావిర్భవింప
ఘనతరస్థితి రాణింపగా లయింప
కారణం బయినది ఏది ? ఓంకారమొకటె ॥ (76)

ఈ యనువాదము కొంత వివరణాత్మకమై ముక్తిభేదములను తెలుపుచు సముచితముగ నున్నది. పాఠభేదములు శ్లోక సంఖ్యాక్రమభేదములు నుండుటచే ప్రశ్నోత్తరములు మూలానువాదములు కొన్నిచోట్ల ముందువెనుక లైనవి. అనువాదము మొత్తముమీద నుత్తమస్థాయికి చెందియున్నదనవచ్చును.

15· వాక్యసుధ:- వాక్యసుధ యను పేరుగల నలుబదియారు శ్లోకములతో గూడిన యీ ప్రకరణమునకు "దృగ్దృశ్యవివేక" మనెడి నామాంతరమున్నది.

ఇది శంకరాచార్యకృతము కాదనియు విద్యారణ్య కృతమనియు కొందరు భావించు చున్నారు. దీనికి సంస్కృతమున ఆనందగిరి, బ్రహ్మానంద భారతీస్వాములు రచించిన టీకలున్నవి. ఇందలి విషయము ఆత్మానాత్మలు దృక్‌దృశ్యము లనియు, దృశ్యము నశ్యము,దృక్కు సత్యముననియు దృక్కుయొక్క అనుభవము పొందుటకు దృగ్దృశ్యవివేకము తత్ఫలితముగ లభించు సమాధియు సాధనములనియు తెలిపి దృగ్దృశ్యవివేకపద్ధతి, సమాధులలోని వివిధ భేదములు తత్త్వమస్యాది వాక్యముల బోధచే స్వరూపనిష్ఠ నొందు విధము వివరించుట.

ఇందు మొత్తము నలువదియారు శ్లోకములున్నవి. అనువాదము కొంత భాగము శ్లోకమున కొకపద్యము చొప్పునను కొంతభాగము రెండు మూడు శ్లోకములకొక పద్యము చొప్పునను మొత్తము ముప్పది నాలుగు పద్యములలో చేయబడినది. అనువాదపద్ధతిని తెలిసికొనుట క్రింది మూలానువాదములు పరిశీలింపదగినవి.

శ్లో॥ రూపం దృశ్యంలోచనం దృక్‌తద్ దృశ్యం దృక్తుమానసమ్
దృశ్యా ధీవృత్తయః సాక్షీ దృగేవ నతు దృశ్యతే॥ (1)

కం॥ కనబడు వస్తువు దృశ్యము। కనిమెడుడి నేత్రంబు దృక్కుగా చెప్పబడున్
కనుదృశ్యంబగు పట్టున। మనస్సు దృక్కనుట శాస్త్రమర్యాద యగున్॥

ఆ॥ వె॥ మనసు దృశ్యమైన మఱి బుద్ధివృత్తులు
దృక్కు లగును అవియు దృశ్యములగు
సమయమందు దృక్కు సాక్షిచైతన్యమే
సాక్షిదృక్త్వమన్న శాశ్వతికము॥ (1, 2)

ఒక్క శ్లోకములో సూత్రప్రాయముగా చెప్పబడిన దిచట రెండు పద్యములలో వివరించి స్పష్టముగా చెప్పబడినది.

శ్లో॥ అస్య జీవత్వమారోపాత్ సాక్షిన్యవ్యవభాసతే
ఆవృతౌతు వినష్టాయాం భేదే భాతే ప్రయాతితత్॥ (17)

జీవజీవత్వ మనునది దేహునందు। కల్పితము కాని సత్యంబు గాదు; జీవు
నట్లు సాక్షియె తోచునధ్యాసవలన। తొలగె నద్దమా తెఱ, ఉభయును ఒకటె।। (15)

పారమార్థికజీవస్తు బ్రహ్మైక్యం పారమార్థికం
ప్రత్యేతి వీక్షితే నాస్యద్ వీక్షి తేత్వనృతాత్మనా॥ (42)

పారమార్థిక జీవుడు బ్రహ్మమునకు జీవునకు సుస్థిరైకత్వసిద్ధి నెరిగి
చూచునొక బ్రహ్మమునె డిందుగోచరింపదతని కాన్యేతరంబెల్ల అస్థిరంబు॥ (32)

16. వాక్యవృత్తి:- ఇది గురుశిష్య సంవాదరూపమునసున్న మహావాక్య బోధ. ఇందు తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి యను మహా వాక్యములు వివరింపబడి నవి. ఇది మూలమున నేబదిమూడు శ్లోకములలో నున్నది. అనువాదమును బట్టి నిరువదితొమ్మిది సీస గీత పద్యములుగా నున్నది. అనువాద్యమునుబట్టి రెండు మూడు శ్లోకము లొక పద్యముగ ననువదింపబడినవి. అనువాదసరణి గ్రహించుట కనువుగ మూలాను వాదము లీయబడుచున్నవి.

శ్లో॥ కోఽసోఽజీవ స్త్వమేవహి। య స్త్వంపృచ్ఛసి
మాం కోఽహం। బ్రహ్మైవాసిన్నసంశయః॥ (7)

గీ॥ జీవు డన నెవ్వడోకాదు నీవె చుమ్మి। నే నెవడనంచు నన్ను బ్రశ్నించునట్టి
నీవు పరమాత్మవుం గూడ నిజ మది యన।
ఛాత్రు డిట్లని పల్కె నాచార్యుతోడ॥

శ్లో॥ యః సాక్షిలక్షణో బోధ స్త్వంపదార్థః స ఉచ్యతే
సాక్షిత్వమపి బోద్ధృత్వమవికారి తయాత్మనః॥

శ్లో॥ దేహేంద్రియమనః ప్రాణాహఙ్కృ తిభ్యో విలక్షణః
ప్రోజ్ఝితాశేషషడ్ భావవికార స్త్వంపదాభిధః॥

శ్లో॥ త్వమర్థమేవం నిశ్చిత్య తదర్థం చింతయేత్ పునః
అతద్ వ్యావృత్తిరూపేణసాక్షాద్ విధిముఖేనచ॥

శ్లో॥ సర్వజ్ఞత్వం పరేశత్వం తథా సంపూర్ణ శక్తితా
వేదైః సమర్థ్య తేయస్య తద్ బ్రహ్మేత్యవధారయ॥ (31)

సీ॥ త్వం పదార్థమ్ముగా వచియించు సాక్షి। లక్షణమగు బోధను జ్ఞాని గణము
అవికారియగుటచే నాత్మవస్తువు। సర్వసాక్షియు జ్ఞాతయై సన్నుతిగను
కాయమాదియు, నహంకారమంతయు। నైనవానినెల్లను భిన్నమైనదియును
వివిధ భావవికారవిరహితం బగునదే। "త్వం" పదార్థంబని తత్పరతను
తర్కించి మఱి మఱి ధ్యానింపగా జెల్లు। నడకువవిధినిషేధాత్మకముగ
అఖిలమెరుగుట బరమేశు డగుటపూర్ణ
శక్తినెగడుట యెవ్వని సహజగుణము
అను సమర్థించుచుండెనో అగమంబు
దాని బ్రహ్మముగా నిన్నుగా నెఱుంగు॥ [16]

నాలుగు శ్లోకముల భావ మిందిదిమిడించబడినది. చివరిపాదమున "దాని బ్రహ్మముగా నిస్నుగానెఱుంగు"మనునది బ్రహ్మాద్వైతబోధముచక్కగా నున్నదిగాని యందలి "నిస్నుగా" నన్నది యమూలకము. తాత్పర్యముమాత్రమంతియే.

శ్లో॥ విశీర్ణ కార్యకరణో భూత సూక్ష్మైరనావృతః
విము క్తకర్మనిగడః సద్యఏవవిముచ్యతే॥ (51)

గీ॥ కార్యమగుమేను వాగాది కరణములును
భూతసూక్ష్మప్రస క్తియు బొడవడంగ
సడలి కర్మపాశము డెగుసాధకుండు
పరమపురుషార్థ మగు ము క్తి పడయు నపుడె॥ (21)

అనువాదము మూలభావలోపములేకుండ యోగ్యముగనున్నది.

17. తత్త్వోపదేశసారము :- పూర్వము సమీక్షింప బడిన తత్త్వోపదేశమను ప్రకరణాంతమునగల మూడు శ్లోకములే తత్త్వోపదేశసారమని వేరుగా ప్రకటించ బడినవి. తత్త్వోపదేశానువాదమున నీమూడుశ్లోకములు వివరముగ నాలుగు పద్యము లలో చెప్పబడినవి. ఇచ్చట వానిసారముగా నొక్క పద్యము చెప్పబడినది.

శ్లో॥ గురుర్బ్రహ్మ స్వయంసాక్షాత్ సేవ్యో వంద్యో ముముక్షుభిః ।
నోద్వేజనీయ ఏవాయం కృతజ్ఞేన వివేకినా॥

శ్లో॥ యావదాయు స్త్రయోవంద్యో వేదాంతో గురురీశ్వరః ।
మనసా కర్మణావాచా శ్రుతే రేవైష నిశ్చయః ॥
భావాద్వైతం సదాకుర్యాత్ క్రియాద్వైతం న కర్హిచిత్ ।
అద్వైతం త్రిషులోకేషు నాద్వైతం గురుణా సహ ॥ (1-2-3)

సీ॥ గురుడన సాక్షాత్తు పరమాత్మ ము క్తి । కావలసిన వార లయ్యనఘు జేరి
ప్రణమిల్లి పరిచరింపబోలు ఆజన్మ । ముపనిషత్తులకు గురూ త్తమునకు
పరమేశ్వరునకు భ క్తితో మొక్కంగ । దగు ఇవ్విధంబు వేదంబె చెప్పె
భావ నిష్ఠంబుగా పరగెడి యద్వైత । మున్నతస్థితికేగ నుపకరించు ॥
కాని యయ్యది క్రియలోనగాని గురుని
పట్లగాని యెన్నండు చూపంగ దగదు
వందనీయుడు గురు డెంతవానికైన
త్రిజగముల జూపునద్వైతదృష్టి మేలు ॥ (1)

అనువాదము మూలమునకు సరిగా నున్నది. చివరినుండి రెండవ పాదము

"వందనీయుడు గురుడెంతవానికైన" యనునది వాస్తవమే కాని యసమాలకము. ఇందు వివరణములేక మూలమువలె సూత్రప్రాయముగనే యున్నది.

18. బ్రహ్మజ్ఞాన లీలావణి :- ఇది సంస్కృతమున "బ్రహ్మజ్ఞానావలీమాలా" యనుపేర నిరువది రెండు శ్లోకములలో నున్నది. ఇందద్వైతానుభూతిగల మహాత్ముని భావమెట్టుండునో యది స్వానుభవముగా తెలుపబడినది. దీని మహిమ మారంభ శ్లోకముననే యిట్లు చెప్పబడినది.

శ్లో॥ సకృత్ శ్రవణ మాత్రేణ బ్రహ్మజ్ఞానం యతోభవేత్ ।
బ్రహ్మజ్ఞానావలీమాలా సర్వేషాం ముక్తిసిద్ధయే ॥

ఇది యనువాదమున శ్లోకమున కొకపద్యము చొప్పున నిరువది రెండు పద్యములలో నున్నది. అనువాద పద్ధతి కుదాహరణము లీయబడుచున్నది. మూలము-అనువాదము :-

శ్లో॥ సకృత్ శ్రవణ మాత్రేణ బ్రహ్మజ్ఞానం యతోభవేత్ ।
బ్రహ్మజ్ఞానావలీమాలా సర్వేషాం ముక్తిసిద్ధయే ॥ (1)
సంసృతిని వోలి తత్త్వార్థ సరణి దెలిపి
ఎల్లరకు ముక్తదశ ప్రసాదింపజాలు
బ్రహ్మ విజ్ఞానమాలిక బ్రస్తుతంబు
గ్రథన మొనరింతు ధరియింప గడగు డయ్య ॥

ఇందు మూలముననున్న "సకృత్ శ్రవణ మాత్రేణ" యను భాగ మనువదింపబడక పోవుటచేత మూలమున నున్నంత భావపటుత్వము కనిపించుట లేదు.

శ్లో॥ నిరాధారస్వరూపోఽహం సర్వాధారాహమేవచ ।
ఆప్తకామ స్సర్వరూపోఽహమే వాహమవ్యయః ॥ (16)
గీ॥ నే నిరాధారుడను, గాని నిఖిలజగము
తనకు చుండును అస్మదాధారముసను
మోక్షరూపుండ ఆప్తకాముడను నేను
జగమె నవ్వేను నాకొండు సమ మటన్న ॥ (17)

ఇందు మూలముననున్న "అహమే వాహమవ్యయః" అను భాగము "జగమెనవ్వేను నాకొండు సమమటన్న" యని యనువదింపబడినది. ఇదీ మూలమునకు సరియైన యనువాదము కాదుగాని, తాత్పర్యమున సరిపెట్టుకొనవచ్చును. అనువాదమున నున్నవాక్యము వినుటకు బాగుగనే యున్నది. కాని జగమెనవ్వేను అనుట తత్త్వ విషయమున ఈ సందర్భమున పొసగదని తోచుచున్నది.

బ్రహ్మైన చింతనము :- మూలము :

శ్లో॥ యదభ్యాసేన తద్భావో భవేద్భ్రమరకీటవత్ ।
అత్రాపహాయ సందేహ మభ్యసేత్ కృతనిశ్చయః ॥

అనువాదము :- ద్విపద

భ్రమరకీటక న్యాయమువలెం బట్టి । తను నిరంతరము నెద్దాని ధ్యానించు
జనుడు తాద్రూప్యసంసిద్ధిగాంచు । అని తలపోసి బ్రహ్మము నేనె అనుచు ॥
సతము బ్రహ్మాభ్యాస సంగతిన్ మెలగు । సతము తాదాత్మ్యభాగ్యంబును గాంచు
కాన సందేహంబు మాని నిశ్చయము । నూని కావింపు బ్రహ్మోపాసనంబు ॥

ఈ యనువాదము వివరణాత్మకముగ నున్నది.

శ్లో॥ న మనోఽహం బుద్ధిశ్చనైవ చిత్త మహంకృతిః
నాహం పృథ్వీ న సలిలం నచ వహ్ని స్తథానిలః ॥
శ్లో॥ న చా కాశో న శబ్దశ్చ నచ స్పర్శ స్తథారసః ।
నాహం గన్ధో న రూపంచ మాయాహం నచ సంసృతిః (22-23)

గీ॥ మేనుప్రాణ ఇంద్రియములు నేను గాను
మానసము బుద్ధ్యహంకృతు లేను గాను
స్థూలభూతముల్ మఱి తద్గుణాలుగాను
నాకు మాయయు సంసరణంబు లేవు ॥ (21)

మూలము నందలి రెండు శ్లోకము లిచట నొక గీతపద్యమున సంగ్రహింప బడినవి. పంచభూతములు తద్గుణములు అందరికి తెలిసినవే కావున నీసంగ్రహీకరణము వలన లోపముగాని నష్టముగాని లేదు.

అత్రప్రమాణ వేదాంతా గురవోనుభవ స్తథా ।
బ్రహ్మైవాహం న సంసారీ నచాహం బ్రహ్మణః పృథక్ ॥

గీ॥ ఉపనిషత్తులు మఱి సద్గురూపదేశ
మనుభవమ్ము ప్రమాణము లరయ నిచట
నేను సంసారి నే నాడుగాను బ్రహ్మ
కన్నభిన్నుండగా నిది యున్నమాట ॥ (25)

హృదయకమలమధ్యే దీపవత్ వేదసారం
ప్రణవమయ మతర్క్యం । యోగిభిః ధ్యానగమ్యం
హరిగురుశివయోగం సర్వభూతస్థ మేకం
సకృ దపి మనసా వై చింతయేత్ యః సముక్తః ॥ (26)

**అనువాదము:-**

సీ. విమలమైనట్టి హృత్కమలమధ్యంబున వెలుఁగొందుచుండెడి దీపకళికమాడ్కి
సర్వవేదంబులసారమైనది యెట్టి తర్కంబునకసాధ్యంబుగాని
దనఘులౌ యోగులవలన ధ్యానమ్ముచే బడయు నట్టిదె ప్రణవస్వరూప
మఖిలభూతములలో నలరారు నట్టిది హరిశివగురురూప మైనదియును॥
ఏకము నగుతత్త్వమ్ము నెవ్వఁడొక్క
తడవమైన నేకాగ్ర చిత్తమ్ముతోడ
చింతనము సేయగలుగునో శిష్టుఁడతఁడు
సర్వసంసారముక్తుఁడై సౌఖ్యపడును॥ (27)

మొత్తముమీద నీయనువాదము మూలమునందలి భావములను చక్కఁగా ప్రకటించుచు యోగ్యముగ నున్నది.

20. నిర్గుణ మానసపూజ:- ఇందు హృదయ పద్మమున ప్రకాశించు నాత్మలింగమును మానసిక షోడశోపచారములచే నిర్గుణపద్ధతి నారాధించు విధానము తెలుపబడినది. ఇది కేవల తాత్త్వికమైనది. మూలమున నిది ఇరువదియైదు శ్లోకములలో నున్నది. అనువాదము ద్విపదలో కొంత భాగమును, కంద, గీత, సీసములలో కొంత భాగమును చేయబడినది. అందలి యుపచారాంశములు కొన్ని తత్పూజా విధానము తెలిసికొనుట కనువుగ నిచ్చట నుదాహరింపబడుచున్నవి.

**మూలము-అనువాదము-**

శ్లో॥ అయమేకో వశిష్టో స్మీత్యేవ మావాహ యేచ్ఛివం।
ఆసనం కల్పయేత్ పశ్చాత్ స్వప్రతిష్ఠాత్మ చిన్తనం॥ (2)

అనువాదము.- ద్విపద. "పోవునన్నియు నేను పోకుండు" ననుచు భావించుటచే శివునా 'వాహనంబు' అనవరతంబు పరాత్మప్రతిష్ఠ తనయందు చేయుటే కన కాననంబు॥

శ్లో॥ త్రిగుణాత్మాశేష లోకమాలికాసూత్ర మస్మ్యహం।
ఇతి నిశ్చయ మేవాత్ర హ్యు "పవీతం" పరం సుతం॥ (8)

గీ॥ ప్రణుతసత్త్వరజస్తమోగుణమయములు
ముజ్జగములను దండలో మొనయు నట్టి
దారమును నేనె యను మనోదార్ఢ్య మాత్మ
లింగమున కుపవీత మనంగ జెల్లు॥ (3)

శ్లో॥ ఓ ఈశ్వరో గురురాత్మేతి భేదత్రయవివర్జితైః।
బిల్వపత్రై రద్వితీయై రాత్మలింగం యజే చ్ఛివం॥ (11)
గీ॥ "ఈశ్వరుడు గురువాత్మ యనేటి" మనెడి
తలపై నిర్ద్వంద్వ బిల్వపత్రములు గాగ
తను నెఱుంగని తన్మయత్వంబుతోడ
ఆత్మలింగమ్ము పూజసేయంగవోలు॥ (6)
శ్లో॥ అజ్ఞానోచ్ఛిష్టహస్తస్య క్షాళనం జ్ఞానవారిణా।
విశుద్ధ స్యాత్మలిఙ్గస్య హస్తప్రక్షాళనం భవేత్॥ (14)
కం॥ ఎంగిలి యజ్ఞానము తత్సంగతిగల హస్తములగు జ్ఞానం బనునీ
టం గడుగు నాత్మపూజా రంగంబున హస్తములకు ప్రక్షాళనమౌ॥ (6)
శ్లో॥ వివిధబ్రహ్మసందృష్టి ర్మాలికాభి రలంకృతమ్।
పూర్ణానన్దాత్మతాదృష్టిం పుష్పాంజలి మనుస్మరేత్॥ (17)
గీ॥ అఖిలవస్తువులందు బ్రహ్మమును జూచు
కార్యమును పుష్పమాలికగా నొనర్చి
ఆత్మలింగముం గైసేయు మమితసుఖ
సమంచితాత్మదర్శన కుసుమాంజలి యిది॥ (12)
శ్లో॥ ద్యాతథ్యా భావవిజ్ఞానం నిదిధ్యాసన మాత్మనః।
సమస్తభ్రాన్తివిక్షేపరాహిత్యే నాత్మనిష్ఠతా॥ (22)
గీ॥ దూరముగ జగద్భ్రాంతిని దోలి మనసు
నిశ్చల మొనర్చి స్వాత్మైక నిష్ఠ నుండి
ధ్యానయోగ్యవస్తువు లేదు తదితర
మని తా నెఱుంగుటయే నిదిధ్యాసనమగు॥ (17)
శ్లో॥ సమాధిరాత్మనో నామ నాన్యచిత్తస్య విభ్రమః
తత్రైవ బ్రహ్మణి సదా చిత్తవిశ్రాంతి రిష్యతే॥ (23)
ఆ॥ వె॥ ఇందునందు జనక యెట్టి విభ్రాంతిని
బడయకుండి మనసు బ్రహ్మమందు
స్థిరముగా వసించు స్థితియె ఆత్మసమాధి
దానివలన ముక్తదశ ఘటించు॥ (18)
శ్లో॥ ఏవం వేదాంతకల్పోక్త స్వాత్మలిఙ్గప్రపూజనం
కుర్యా న్మాసమేకం వాపి క్షణం వా సుసమాహితః॥ (18)

సర్వదుర్వాసనజాలం పదపాంసు మివ త్యజేత్
విహాయాజ్ఞానదుఃఖౌఘం మోక్షానన్దం సమశ్నుతే॥ (24)

సీ॥ ఆత్మ లింగార్చనం బఖిలోత్తమం బిద్యాస। నల్పమౌ నుపనిషత్కల్పమంచు
పై రీతి తరియింప గోరెడి మానిసి। తను పిలం గూలెడి దాక గాని
నిముసమ్మైనాని సంక్రమముగ ఈశ్వరు। చేసినన్ సంకల్పసిద్ధి వడయు
పదరజఃకరణములఖారి దుర్వా। సనాజాలమ్ము సర్వంబు నమసిపోవు॥
అజ్ఞాన మూలమునదేసి యులముకొన్న
యెల్ల దుఃఖపరంపర లెగిరిపోవు
అతులితామలమోక్షసుఖానుభవము
దక్కు బ్రహ్మాండకోటి తాదాత్మ్య మొనయు॥ [19]

# ప్రబోధ సుధాకరము

అనువాదకర్త : శ్రీపిసుపాటి నారాయణశాస్త్రి

ప్రబోధ సుధాకరము శ్రీమచ్ఛంకర భగవత్పాదులచే 257 ఆర్యావృత్తములలో జ్ఞాన సముపార్జన కవసరమగు విషయములను వర్ణించుచు 19 ప్రకరణములుగా రచింపబడిన గ్రంథము. ఇది ప్రకరణ గ్రంథమైనను రసభరితమై యున్నది. శ్రీ పిసుపాటి నారాయణశాస్త్రిగారి యనువాదము కడు సరసమై మూలము తెలుగని వారికి సొంత రచన యనిపించునట్లున్నది. ఇందలి విషయములను, అనువాద పద్ధతిని తెలిసికొనుట కనువుగా ప్రతిప్రకరణము నుండియు కొన్ని యుదాహరణము లీయబడుచున్నవి.

1. దేహనిందాప్రకరణము:- ఇందు మూలమున నిరువది యెనిమిది శ్లోకములున్నవి. అనువాదమున ముప్పది పద్యములున్నవి. దేహముయొక్క అశాశ్వతత్వము, అసహ్యాకరలక్షణములు మొదలగు విషయములందు శరీరముపై విరక్తి కలుగునట్లు వర్ణింపబడినవి. మూలమ్ము-అనువాదము:

మాతృగురూదరదర్యాం కఫమూత్రపురీష పూర్ణాయామ్
జఠరాగ్ని జ్వాలాభి ర్నవ మాసం పచ్యతే జన్తుః॥ (9)
దైవాత్ప్రసూతిసమయే శిశు స్తిర్యక్చేన్నతాం యదా యాతి
శస్త్రై ర్విఖండ్య స తదా బహి రిహ నిష్కాస్యతేఽతి బలాత్॥
అథవా యన్త్రచ్ఛిద్రా ద్యదాతు నిః సార్యతే ప్రబలైః
ప్రసవసమీరై శ్చ తదా యః క్లేశః సోఽప్యనిర్వాచ్యః॥

"తల్లిగర్భమందు తానున్నతరి బాధ। యెంతపడెనో చెప్ప నెవరి తరము?
జఠరవహ్ని రేగి సంతాప పెట్టుట। తలచుకొన్న గుండె జలదరించు॥ (9)
దైవ వశమున నేప్రమాదమ్ము లేక బయటపడిన
దద్భాగ్యమ్ము పండినట్లే! కాక, అడ్డమ్ముతిరిగెనా!
కత్తి చొనిపి చెండి ముక్కలు ముక్కలుగ దీసెదరుపెలికి॥ (10)
'సవసవ' యటంచు బ్రసవవాయువులు వీవ
తరలి సూక్ష్మమౌ యోనిరంధ్రంబునుండి
అవనితలముపయిం బడు, ఆ యవస్థ
నైచ్య మనుట కా దనిర్వాచ్య మోయి॥ (12)

మూలమున (తొమ్మిదవ శ్లోకమున) నున్న 'కఫమూత్రపురీష పూర్ణయాం' అనెడి భాగ మనువాదమునలేదు. దానిఫలితమో యన్నట్లుగా "తలచుకొన్న గుండె జలదరించు" ననెడి వాక్య ముచితముగ కూర్చబడినది. పదవశ్లోకముయొక్క అనువాదము యథామూలముగ మాత్రమేగాక, భావము విస్తరించి మూలమునకు మెఱుగు పెట్టినట్లు చేయబడినది. పదునొకొండవ శ్లోకమున నున్న "యః క్లేశః సోఽనిర్వాచ్యః" అనెడి భాగము 'ఆయవస్థ నైచ్యమనుట కా దనిర్వాచ్యమోయి" అని మూలముకంటె మెరుగుగా ననువదించ బడినది.

అనువాదమునందలి పదమూడవ పద్యమునకు మూలము సాధన గ్రంథ మండలివారు ప్రచురించిన ప్రతిలోలేదు. అధికపాఠము కావచ్చును. పదునెనిమిదవ పద్యమునకు మూలమిరువది యొకటవశ్లోకము, క్రమ సంఖ్యలో మార్పున్నది.

రుధిరత్రిధాతుమజ్జామేదోమాంసాస్థిసంహతి ర్దేహః
న బహి స్త్వచా పినద్ధః తస్మా న్నో చే ద్భక్షతే కాకైః॥
కాయమియ్యది తోలుచే మూయబడిన
కారణంబున గవియపు గాని కాకు
లదియు లేకున్న నిందలియస్థి
మాంసరక్తముల జూచుచో దినరాకయున్నె॥
అనువాదము మూలముకంటె మేలుగా నున్నదీ.
నాసాగ్రా త్త్వదనాద్వా కఫం మలం పాయతో విసృజన్
స్వయమేవైతి జుగుప్సా మంతః ప్రసృతం చ నోవేత్తి॥
ముక్కున గారెడి చీమిడి; పక్కను విదురింప నోటఁబడు చొంగను,
నమ్మక్క! తలవంపు, ప్రైపయి। బుక్కా జవ్వాది పునుఁగు పూసెదవేమీ॥

ఇది మూలమునకు స్వేచ్ఛానువాదమై కొంత భావభేదము కలిగియున్నను యుక్తమగ నున్నది.

క్షతముత్పన్నం దేహే యది న ప్రక్షాళ్యతే త్రిదినమ్
తత్రోత్పతన్తి బహవః క్రిమయో దుర్గంధసంకీర్ణాః॥

గీ॥ కాయమందు వ్రణంబైన కడిగి
మంచిమందు వేయంగ జనుడు ప్రాల్మాలెనేని పురుపు
లేర్పడి చెడుకంపు పుట్టకున్నె?
మలినములకొంప దానిపై మమత మాను.

ఇదియు స్వేచ్ఛానువాదముగ యుక్తముగనే యున్నది.

ఆత్మాసచ్చిద్రూపః, క్త్వమాంసరుధిరాస్థి నిర్మితో దేహః
ఇతియోఽలజ్జితధీమా నితరశరీరం స కిం మనుతే॥

గీ॥ అకట సచ్చిత్స్వరూపు డౌనాత్మయేడ?
అస్థిమాంసాది మయము దేహం బిదేడ"
అనుచు సిగ్గిల్లు ధీమంతుఁ; డభిలషింపఁ
డెన్న డీభూమిపైఁబుట్ట; నిది నిజంబు!

ఇది యథామూలానువాద మనవచ్చును. దీని తరువాతనున్న ముప్పదియవ పద్యమునకు మూలమునలభింపలేదు. ఇదియును అధిక పాఠము కావచ్చును.

అనువాదమునందలి పదమూడు, ముప్పది సంఖ్యలుగల పద్యములు రెండధిక మగుటచే నిందలి సంఖ్య ముప్పది యైనది.

ఈ యనువాదము మూలమునకు మెరుగు పెట్టినట్లుగా నుండి మూలభావము లను మరింత జుగుప్సాకరముగ వర్ణించునదిగా నున్నది. ఇది చదివినచో నెట్టివాని కైనను దేహముపై రోతపుట్టు ననుపించుచున్నది.

2. విషయనిరిద :- ఇందు దారా పుత్ర ధనేషణలవలన కలుగు దుఃఖము వర్ణింపబడినది. మూలమున నిరువది రెండు శ్లోకములలో నున్న యీ ప్రకరణ మనువాదమున నిరువదిమూడు పద్యములలో నున్నది. మూలానువాదములు -

వనితా నితాంత మజ్ఞా, స్వాజ్ఞా, ముల్లంఘ్య వర్తతే
యది సాశత్రో రవ్యధికతరా పరాభిలాషిణ్య సౌకిముత॥ (35)

గీ॥ ధూర్తయై పతియానతి త్రోసిపుచ్చుకాంత,
ఘటియించు శత్రుని కంటె కీడు,
అంతెకాక జారిణి కూడ నయ్యెనేని,
'ముప్పు చేకూర్చు' నని వేఱ చెప్పవలెనె?

ఇది యథామూలానువాదమనవచ్చును. ఇందలి 42 సంఖ్యగల పద్యమునకు మూలము లభించలేదు.

పితృమాతృబంధుభూతీ మనసః ఖేదాయ జాయతే పుత్రః
చింతయతి తాతనిధనం పుత్త్రో౽ద్రవ్యాద్యధీశతా హేతోః॥ (40)
మాతృపితృబంధుహంకకుండు
మదికి గూర్చు వంత యింతది యనగ నెవ్వారితరము !
పెత్తనము కోసమై కని పెంచినట్టి
తండ్రిచావు గోరెడివాడు తనయుడ౽డగునె ॥
లబ్ధిశ్చే దధికో౽ర్థపత్న్యాదీనాం భవేత్స్వార్థః
నృపచౌరతో౽ప్యనర్థ స్తస్మాద్ధ్రివ్యోద్యమో వ్యర్థః॥ (43)
అధిక విత్తార్జనంబుతో నగునదేమి ? ఆలుబిడ్డలు చుట్టాలు ననుభవింత్రు:
దొరలు దొంగలు నంద్రైన దోచుకొంద్రు కాన, అధికార్జనకు గుటి కడ(గ రాదు॥

మూలమున "లబ్ధిశ్చేదధికో౽ర్థ పత్న్యాదీనాంభవేత్స్వార్థః" అను భాగమునకు 'అధిక విత్తార్జనంబుతో నగునదేమి? ఆలు బిడ్డలు చుట్టాలు ననుభవింత్రు!" అని చేయబడిన అనువాదమున మూలము నందలి "భవేత్ స్వార్థః" అనుభాగమునకు తగిన యనువాదము లేకపోవుటచేత మూలమునందున్న భావపటిమ యనువాదమున కొంత తగ్గినట్లనిపించుచున్నది. "పత్న్యాదీనాం" అను మూలమునకు "ఆలు బిడ్డలు చుట్టాలు" అను వివరణము బాగుగానున్నది. మొత్తము మీద నీవిషయము నిందా ప్రకరణానువాదము మూలానుగుణమై మూల భావము లనువాదపఠితకు చక్కగా బోధపడునట్లు చేయగలదిగా నున్నది.

2· మనోనింద :- ఇందు మనస్సుయొక్క దోషములు నాలుగు శ్లోకములలో తెలుప బడినవి. అనువాదమున నాలుగు పద్యములే యున్నవి.

హసతి కదాచి ద్రౌతి భ్రాన్తం స ద్దశదిశో భ్రమతి
హృష్టం కదా౽పి దుష్టం శిష్టంచ నిన్దతి స్తౌతి॥ (51)
నవ్వునేడ్చు భ్రమంపడు దవ్వుపోవు బలపడు
గృశించు దుష్టుల బ్రస్తుతించు శిష్టులను
నిందపాల్సేయు చిత్త మవుర !
తత్స్వభావంబు కడు(గష్టతరము తెలియ.

మూలమునందలి "హృష్టం" అనుపదము 'బలపడు' అని యనువదింప బడినది. ఇది భావానుగుణమైన యనువాదమనవచ్చును.

దాని నిగ్రహింపు విధము ఉపదేశింపబడినవి. మూలమునందున్న పదమూడు శ్లోకము అనువాదమున పంద్రెండు పద్యములుగా నున్నవి.

సగనగరదుర్గదుర్గమనరితః పతితః పరిభ్రమచ్చేతః
యదినోలభతే విషయం విషముస్త్రి త మివభిన్న మాయాతి ॥

నిప్పుత్రొక్కిన కోతినా నిలువకుండ
తిరుగు వాంఛితప్రాప్తికై త్రిభువనములు
ప్రియమైన వస్తువేదే లభింపకున్న
అవశమైయంత్రి తం బట్టులడలు మనసు ॥

ఇందలి "నిప్పుత్రొక్కిన కోతినా" యనెడి జాతీయప్రయోగ మిచట బాగుగా పొసగినది. ఇది చక్కని స్వేచ్ఛానువాదము.

ప్రాణస్పంద నిరోధా త్సత్సఙ్గాద్వాసనా త్యాగాత్ ।
హరిచరణ భక్తి యోగాన్మనః స్వవేగం జహాతి శనైః ॥

సాధు సంగంబును, ప్రాణ సంచలనము నాపుకతనను, వాసనా త్యాగమునను శ్రీశపదభక్తియోగ విశేషమునను చిత్తముద్వేగమును బాసి స్థిమితపడును॥

ఇది యథా మూలానువాదము. "నిప్పుతొక్కిన కోతినా" ఎండు సొరకాయ నీటిపై తేలినట్లు, గుడెబండ, మొదలగు జాతీయ ప్రయోగయుతమై మూలమునందలి భావములను సరసముగ ప్రకటించుచున్నది.

6. వైరాగ్యము :- ఇందు వైరాగ్యావశ్యకత, స్వరూపము, వైరాగ్యోన్ముఖత్వమున కనువగు నుపదేశము వైరాగ్యము లేని మనస్సువలన కలుగు ఫలము వివరించబడినవి. మూలమునందలి పది శ్లోకము అనువాదమున నేడుపద్యములుగా నున్నవి.

పర గృహగృహిణీ పుత్త్రద్రవిణానా మాగమే వినాశేవా
కథితౌ హర్షవిషాదౌ కిం వాస్యాతాం క్షణం స్థాతుః॥ (78)

గీ॥ పరుల గృహధనాదులకు అపాయ మొదవి
నపుడుగలుగు దుఃఖమ్మును, నభ్యుదయము
తోచు తఱికిగల సుఖమును, ధ్రువములగునె?
కావుకా, వది నిజము తాత్కాలికములు॥ (80)

మూలమున నున్న "క్షణం స్థాతుః" అను భాగమున కనువాదము చేయబడలేదు. చేయబడియున్నచో మరింత మేలుగా నుండెడిది.

విస్మృత్యాత్మనివాస ముత్కటభవాటవ్యాం చిరం పర్యటన్
సంతాపత్రయదీప్త దావదహనజ్వాలావలీ వ్యాకులః

పరమ తేజమ్ము దర్శించు పండితుండె
అద్వయానందమును సదా అనుభవించు ॥ (128)

అనువాదము యథామూల మనదగి యున్నది.

కర్తృత్వ భోక్తృత్వములు :- ఇందు ఆత్మకు కర్తృత్వ భోక్తృత్వములు లేవని దృష్టాంత పూర్వకముగా నాలు శ్లోకములలో మూలమున తెలుపబడిన విషయము యథా మూలానువాదమున నాలు పద్యములలో తెలుపబడినది.

స్వప్రకాశత్వము :- ఆత్మయొక్క స్వప్రకాశమిందు వివిధ దృష్టాంతములతో మూలమున నైదు శ్లోకములలో తెలుపబడినది. అనువాదమున నైదు పద్యములు యథా మూలముగ నున్నవి.

అటుపై నాదానుసంధానము (ఆరు శ్లోకములు) మనోలయము (ఎనిమిది శ్లోకములు) అను రెండు ప్రకరణములు యథా మూలముగ ననువదింపబడినవి. పిదప ప్రబోధము (తొమ్మిది శ్లోకములు) ఏడు పద్యములలో ననువదింపబడినది. తరువాత మూలమున పదునెనిమిది శ్లోకములలోనున్న ద్వివిధభక్తి ప్రకరణము పదునెనిమిది పద్యములలో ననువదింపబడినది. ఇందు భక్తిలోని స్థూల సూక్ష్మ భేదములు చక్కగా వివరింపబడుటకు తోడుగా తత్సాధనములుకూడ వివరింపబడినవి.

అటు పిమ్మటగల 'ధ్యానవిధి'లో మూలముననున్న పది శ్లోకము లనువాదమున పదునారు పద్యములైనవి. ఇందు యమునాతీర విహారియగు నందకిశోరుని వర్ణనముతోగూడిన సగుణధ్యాన విధానము రమ్యముగ వర్ణింపబడినది. దాని తరువాతగల సగుణ నిర్గుణైక్య ప్రకరణము మూలమున ముప్పదిమూడు శ్లోకములు, అనువాదమున ఇరువదియారు పద్యములుగా నున్నది. ఇందు శ్రీకృష్ణచరిత్రములోని కొన్ని ఘట్టములు రసవత్తరముగ వర్ణింపబడినవి. నిర్గుణ బ్రహ్మమే శ్రీకృష్ణ రూపమున సగుణ బ్రహ్మమై వెలసినట్లు తాత్పర్య రూపమున నిందు తెలుపబడినది.

చివరిది అనుగ్రహిక ప్రకరణము. మూలమున ముప్పదియొక్క శ్లోకములు అనువాదమున ముప్పదినాలుగు పద్యములు. ఇందు శ్రీకృష్ణునిచే నిహతులైన పూతనాది రాక్షస గణమునకుగూడ, భేద భావరహితుడగు భగవంతుని యనుగ్రహమే కలిగి వారు ముక్తి నొందిరని తెలుపబడినది. ఇందలి పద్యములు పైరెండు ప్రకరణములలోవలె రసవంతములై యున్నవి. మొత్తముమీద నీ ప్రబోధ సుధాకరానువాదమంతయు సరసము, సరళమునై మనోహరముగ నున్నది.

# ప్రబోధ చంద్రోదయము

## పద్యకావ్య రూపానువాదములు (1)

ప్రబోధచంద్రోదయమును మొట్టమొదట నాంధ్రీకరించినవారు నంది మల్లియ, ఘంట సింగన అను జంటకవులు. జంటకవులుగా కవిత్వము చెప్పిన వారిలోగూడ వీరే ప్రథములు. వీ రిరువురును సన్నిహిత బంధువులు. నంది మల్లియకు ఘంట సింగన మేనల్లుడు. వీరు క్రీ.శ. 1480 ప్రాంతమున గుంటూరు, నెల్లూరు మండలములలో నివసించిరి. ఆ కాలమున గజపతులకు సామంతుడై ఉదయగిరి దుర్గమును పాలించిన [illegible] బసవరాజునకు మంత్రిగా నుండిన పెసరువాయి గంగనామాత్యు డీ జంటకవులను సత్కరించి వీరిచే "ప్రబోధ చంద్రోదయము" నాంధ్రీకరింపజేసెను. ఈ గ్రంథమును మూలమునవలె నాటకముగా ననువదింపక నైదాశ్వాసముల ప్రబంధముగా రచించి గంగనామాత్యునకే అంకిత మొనర్చిరి.

గంగ నామాత్యుడు చెందులూరు వాసి. ఇంతకుపూర్వ మితడు దగ్గుపల్లి దుగ్గయ్య రచించిన "నాసికేతోపాఖ్యానము" నంకితముగ గొనియుండెను. ఇతడు సహజముగ తత్త్వప్రియుడై "నీటిలోని తామరాకువలె" నిర్లిప్తుడైన "సంసార యోగి" యని సమకాలికులచే పొగడబడినాడు. అందుచే ప్రబోధ చంద్రోదయముపై మక్కువగలిగి దాని యాంధ్రీకరణకు కారకుడైనాడు.

నంది, ఘంట, జంటకవు లీయనువాదమున వైచిత్ర్యముకొరకు కథాప్రణాళికలో కొన్ని చిన్నచిన్న మార్పులుచేసియు కొన్ని వర్ణనలు కల్పించియు రచించిరి.

కథాప్రారంభమున చిదానంద నగరమును వర్ణించి దాని నేలికయై ఈశ్వరుడను రాజు పాలించుచుండెననియు నాతడు మాయా విలాసవతివలన మనసనెడి సుతుని గనెననియు వ్రాసిరి. మూలమున నీశ్వరునకు చిదానంద నగరాధిపత్య విషయముగాని తత్పూర్వ వర్ణనగాని లేదు. ఈశ్వర సంగమువలన మాయకు మనస్సనెడి కొడుకు పుట్టినట్లు మాత్రమున్నది. (సంభూతః ప్రథమ మహేశ్వరస్య సంగా న్మాయాయాం మన ఇతి విశ్రుత స్తనూజః) అనువాదమునందు ఈశ్వరునకును మాయకును సంగమువలన మనస్సుద్భవించినట్లు చెప్పబడలేదు.

"సంగ" శబ్దమిందు పరిహరింపబడినది దానివలన తరువాత చెప్పబడిన "పూర్వము సంగరహితుండైన పరమేశ్వరునకు తద్గృహిణియైన మాయకు కూటమిలేకయే చిత్రంబుగా సంభవించిన మనంబునకు" అను వాక్యముతో

వాడరిన గోవ్యాప్తి సం। పద లబ్బెడు
విష్ణుభక్తి మహామహు లెలసి॥

విశే :- 'విష్ణుభక్తి' యను పురుషుని సుజ్ఞాన సింహాసనంబున నిలిపి పరిపూర్ణ చంద్రమండల ఛత్ర ఛాయాచ్ఛాయంబున నభిషేకించి పట్టంబు గట్టిన నతడు కృతకృత్యుండగు వివేకము మంత్రిగా నిరుపమాన సదానంద సామ్రాజ్యంబు చేయుచుండెనని చెప్పబడినది.

చిట్టచివర ఫలశ్రుతి ఇట్లు చెప్పబడినది. "ఇట్లు సకల వేదాంత సారంబైన ప్రబోధ చంద్రోదయంబను మహాకావ్యంబు వినిన, జదివిన, వ్రాసిన నపరిమితార్థంబులు సిద్ధించు. సత్కీర్తియున్ను రాజ్యంబునందు సువృష్టియు, ధనధాన్యాది సమృద్ధియుం గలుగు. రాజులు ప్రజానురాగంబున వెలుంగుదురు. జనులకు నఖండ పూర్ణ జ్ఞానంబు సిద్ధించు".

ఇదియు నీయనువాదకర్తల స్వతంత్రకల్పనయే.

ఈ కవులు తమ సమకాలిక కవిత్వరీతుల నిందు రసవంతముగ చొప్పించి నారు. ఇందలి భాష సాధారణముగా సరళమై ద్రాక్షాపాకమున నున్నది. యుద్ధ వర్ణన ఘట్టమున శైలి సంస్కృతమయమై సుదీర్ఘ సమాస భూయిష్ఠమైయున్నది.

ఉదా :- ఉభయ పక్షంబుల గల బలంబులు విజయఘోషణా హూయమానా నేక వీరభట సింహనాద బధిరితరోదోంతరంబును, బృథులరథతురగఖుర ఖండిత భూమండలోద్ధూత ధూళీధూసరిత భాస్కరంబును, సముత్తాల కర్ణతాళ స్ఫాలనోచ్చ లత్సమద కరిబృంధ సింధూర సంధ్యాయమాన దశదిశాముఖంబును, ప్రళయ జల ధర ధ్వాన భీషణ పటహ ఘోషణంబునుగా మోహరించు నప్పుడు....

........ వేతాద్భుళ రుధిరప్రవాహావగాహ కౌతూహల విహిత కోలాహలవా చాల భూత భేతాళ విహారణ కారణంబును విశంకట కిరీటఘటిత వీరవర శిరఃకరోటి మస్తిష్కాలోకకశ్యేన పఙ్క్తికోటి కోటీవిరచిత మణివికరణంబును భూతనాధాంగీ కృత నూతన కపాల మాలికా భరణంబునునైన మహారణంబున.... చార్వాక తంత్రంబు గూలుచున్నదెపో.

చతుర్థాశ్వాసమున వివేకు డాదికేశవస్వామిని స్తుతించినదండకము చివర, వాక్యముపూర్తిచేయుటకు ఒకసంధిపద్యముతో కలుపబడి కథకుజోడించబడినది.

ఉదా :- ఆదికేశవస్వామిప్రై దండకము ................. .. ..................
వేదాంతసందేహమున్ బాపి పోషించి యుం జూపి రక్షింపు మంచుం బునర్నమ్రుడై॥

కం॥ కేశవుపదములకు వి। వేకుడు...........

పోయినది. ఇతని కాలమును సరిగా నిర్ణయించుటకు తగిన యాధారములు లభిం చుటలేదు. శ్రీ ఆరుద్రగారు ఇతని క్రీ. శ. 1750-1850-మధ్యకాలము వారిలో చేర్చినారు.

ఇతడు ప్రబోధ చంద్రోదయ నాటకము నందలి విషయమును యథాతథ ముగ ననువదింప ప్రయత్నించినట్లు తోచుచున్నది. కారణ మేమనగా పద్య కావ్యమైనను నిందు నాంది పద్యము, పిదప నాద్యంతమున సూత్రధారుడన్న మాటలు సందమూలమున నున్న గోపాల భూపాలుని యొక్కయు కీర్తివర్మ యొక్కయు ప్రశంస, కీర్తివర్మ విస్మయ పడునట్లు నటింపవలెనని నటితో చెప్పుట, చివరకు భరతవాక్యము, మొదలగు నాటకాంశములు చాలవరకు మూలాను సారముగానే రూప భేదముతో కూర్చబడినవి. ప్రస్తావనలో సూత్రధారుడిట్లనెను-

ఉ. మేదిని కృష్ణ మిశ్రుడెలమిన్ రచియించెను దా ప్రబోధచం
ద్రోదయ నామకంబగు సముజ్జ్వలనాటకమేను తత్కథా
భేదము లెల్ల నీకు వినిపింతును తావకచిత్తవృత్తితో
మోదపయః పయోనిధిని మున్గగ సభ్యుల చిత్తవృత్తులన్ ॥

ఇందును కృష్ణ మిశ్రుని నాటక కథా భేదములు వినిపింతునని సూత్ర ధారుడు చెప్పినట్లే యున్నది గాని కవిచెప్పినట్లులేదు. నాటకమును గాక నాటక కథా భేదములు వినిపింతునని మాత్రము చెప్పెను. కాని ఇందలి (కథా) "భేదము" లేవియు తెలియుటలేదు. ఈ "భేద" శబ్ద ప్రయోగమున కవి భావ మేమో తెలియరాదు. ఇందలి కథ మూడాశ్వాసములలో కూర్చబడినది. ఆశ్వా సాంత గద్యమునందును "ప్రబోధ చంద్రోదయం బను మహానాటకంబు నందు ప్రథమాశ్వాసము" అనియేయున్నది. నాటకము నందలి ప్రథమ ద్వితీయాంక ములు 237 గద్య పద్యములలో ప్రథమాశ్వాసముగను చతుర్థాంకము చివర వరకు 222 గద్యపద్యములలో ద్వితీయాశ్వాసముగను, మిగిలిన నాటకమంతయు 242 గద్య పద్యములలో తృతీయాశ్వాసముగను కూర్చబడినది.

ఈయనువాదమున ప్రత్యేకించి చెప్పదగిన పెద్దమార్పులు గాని కూర్పులు గానిలేవు. ప్రారంభము నుండి చివరి వరకు నాటకములలోనున్నట్లే యందలి విషయము కథా రూపమున గద్య పద్యములలో సాగించబడినది. అచ్చటచ్చట చిన్నచిన్న కూర్పులు మార్పులు స్వల్పముగా నున్నవి.

*మూలమున "సంఘాతః ప్రథమ మహేశ్వరస్య సంగాన్మాయాయాం మన ఇతి ప్రథితస్తనూజః" అని యున్న దాని నీయను వాదమున-

వ॥ అన విని కాముడిట్లనె శుభాంగి మహేశునిగొల్చి మాయదాగనియె

మనస్సమాఖ్యాని....అని మూలమందలి "సంగ" శబ్దము పరిహరించి, ముందు వచ్చు "ప్రపంచ స్సంగ [illegible] మా[illegible] పినాకిన్! [illegible] మనః ప్రసూయ [illegible] [illegible] అని [illegible] భాగమును [illegible] వాదముగా రచించిన_

ఉ:– సంగములేని బ్రహ్మమును జాయయునంటగ మాయయూనుచ, [illegible] మనస్సుతుం జగములన్నియు గాంచెను" అను పద్యభాగమందలి "సంగము లేని" యనెడి భావమునకు విరుద్ధము కాకుండా చేసెను.

ద్వితీయాశ్వాసాంతమున మూలమున (చతుర్థాంతము) చివర చేరువేరుగా నున్న శివ కేశవ స్తుతులనేకము చేసి ఇతడుభయ నభేదముగా నేకముగా స్తుతించెను. ఇది యోగ్యమైన చిన్న మార్పు.

కం॥ నీ వాదికేశవుండవు । గావా నిను పూజసేయగా నేర్చిన వి
ద్యా విదులు మోక్ష సుఖసం । భావిత లేమ్రాదటంచు పలుకుదురు
మునుల్ ॥

గీ॥ ఆది కేశవు డీతదే యనుచు కొంద
రమ్మహాదేవు డీతదేయనుచు కొంద
రాగ మాంతజ్ఞులెల్ల సాహ్లాదులగుచు
ద్వివిధముగ నిన్ను భువి సన్నుతింతు రభవ॥

ఇచ్చట నైదారు స్తుతి పద్యములున్నవి. ఇవి మూలమునుండి యనువదించ బడినవి కావు. ఉదా :_

సీ॥ గాంగేయు నన్ను రాకారుడు మాధవు। దండ దాక్షిణ వా గర్వితుండు
జీమూత భాముడు సేవిత బుధగణు । దంభకాసుర దోర్బలాపహారుడు
విషమాంబక యుతుండు వృషవర్ధితగుణుండు। చతురానన స్తుతసద్గుణుండు
సకలాగమాంత పూజా భాజనుడు సత్త్వ । సం యుతుం డచ్యుత సాదు
కుండు ॥

గీ॥ ప్రజల జగదుద్భవస్థితి ప్రళయ కార్య
కారణాను చరావృతాగాదు డనుచు
జనులు విన్ను నుతించిన సరణి హరిని
సన్నుతింతు రభేద ధీ సహితులగుచు ।

ఇది హరిహరాద్వైత భావము ప్రకటించుచు సందర్భమునకు తగి యున్నది.

తృతీయాశ్వాసమున, మూలమునందలి "యద్వార ఘటితే దుఃఖం యాదృశీ గృహకుక్కుటే" యను శ్లోకము ననువదించుట:

గీ॥ పొంచి కోడిని పిల్లి భక్షించినప్పుడు
మమతచే దుఃఖితుం డౌను మానవుండు
చెలగి యది మూషికంబును భక్షించినప్డు
దవ్విధంబున దుఃఖితుం డౌనె చెప్పుమా॥

యను పద్యము మొదట నున్న "పొంచి కోడిని పిల్లి భక్షించినప్పుడు" అను దానిలో "పొంచి, "కోడిని" యనుటకు బదులుగా ఇంటి కోడిని అన్నచో, మూలానుగుణముగను యోగ్యముగను నుండెడిది.

ఈ యాశ్వాసముననే మూలమున (సకోపమివ) "కోఽయమాత్మాన మజానంత మంధ మివ ప్రత్యుత్తరం దాస్యతి?" అని యున్న వాక్యము—

కం॥ అనఘా యాత్మ నెఱుంగని । జనుడీశ్వరు డెవ్వడని ప్రసంగించినయా
తనికిం బ్రత్యుత్తరమి । చ్చిన పండితుడతని కంటె శ్రేష్ఠుండగునే"॥

యని సౌమ్యముగాను కొంత భావభేదముతోను ననువదింపబడినది.

ఇందు ద్వితీయాశ్వాసాంతమున కాశీపురవర్ణనము గంగా వర్ణనము బాగుగా నున్నవి. సైనికవర్ణనము సమాసభూయిష్ఠ రచనగల పద్యములలో నున్నది. కాశీపుర వర్ణనలో అల్లసాని పెద్దనగారి "అటచని కాంచె భూమిసురు" డను పద్యానుకరణము కనిపించుచున్నది. ఉదా:

చ॥ కనుగొనియె న్వివేకు డుడు కాంత శిలామయ సౌధ సంచర
ద్వనరుహలోచనావిలసిత స్తన మండల విస్తచంద్రచం ।
దన కమనీయ గంధ ముదితప్రబల త్రిదశస్రవంతికా ।
వనరుహ విభ్రమద్భ్రమర వర్ణన నర్గళ కాశికాపురిన్ ॥

ఈ రచనలో "సభిక" శబ్దము "సభ్య" శబ్దమునకు పర్యాయ పదముగా పలుతావుల ప్రయోగింపబడినది. సభిక శబ్దమునకు "జూదరి" "జూదమాడించువాడు" అనునవి ప్రాచీన కాలమునుండి యున్న రూఢార్థములు.

ఇందలి కవిత్వము ధారాశుద్ధి కలిగి ద్రాక్షాపాకమున నున్నది. భాష లాక్షణికము, జాతీయమునై యున్నది.

మొత్తముమీద నీయనువాదము సరళము సరసమునై ప్రబోధ చంద్రోదయ నాటకము నందలి విషయము, భావములు, జన సామాన్యమునకు బోధపడుట కనుకూలముగ నున్నది. దీనిని సంస్కరించి ప్రకటించినచో పండితలోకమునను, విశేష భాషాపరిజ్ఞానము లేనివారిలోను గూడ నిది బహుళ వ్యాప్తి నొందగలదు.

# ప్రబోధ చంద్రోదయము

(ద్విపద కావ్యము)

శ్రీ రాచూరి వెంకటలింగ కవి

ఈ గ్రంథ మముద్రితము. దీని వ్రాత ప్రతి యొకటి తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విద్యాలయమందలి రాతప్రతి గ్రంథాలయమున నున్నది. గ్రంథ సంఖ్య ఆర్. 715. ఈ గ్రంథము ననువదించినవాడు రాచూరి వెంకటలింగ కవి. ఈత దార్వేల నియోగి బ్రాహ్మణుడు. కౌండిన్యసగోత్రుడు. ఆపస్తంబసూత్రుడు. ఇతని తల్లి సుబ్బమాంబ. తండ్రి రామయార్యుడు. గురుడు సద్బసేంద్రస్వామి. ఈతని తలిదండ్రులు తమ ఇలవేల్పగు శ్రీ వేంకటేశ్వరస్వామి పేరుగా నీతనికి వెంకటలింగమని పేరుపెట్టిరట. ఈ గ్రంథరచన కీతనిని ప్రేరేపించినవాడు శ్రీ ఫెరవురి చంద్రశేఖర నృపచంద్రుడు, నతని సుతుడగు బంగారు వెంకటవీర పృథ్వీవల్లభుడు ననువారు. కవి ఈ గ్రంథమును వేదార్థసార సంగ్రహమనియు సాంద్రతత్త్వజ్ఞాన సారమనియు చెప్పి శ్రీరామభద్రున కంకితముచేసెను.

మూలమున నారంకములుగానున్న ప్రబోధ చంద్రోదయము నీత డైదాశ్వాసముల ద్విపదకావ్యముగ రచించెను. ఇతడు తన యనువాదమున నంది మల్లయ, ఘంట సింగనల ప్రబంధ రూపానువాదము ననుసరించి కొన్నియు, స్వయముగా కొన్నియు మార్పులు చేసెను. అందు నంది ఘంటల జంట ననుసరించి చేసిన మార్పులు :- (1) గ్రంథము నైదాశ్వాసములుగా రచించుట (2) కథారంభమున విదానందపుర వర్ణనము (3) ఈశ్వరునకు మాయవలన మనస్సనెడు పుత్రుడు కలిగెనని చెప్పి మూలమున "ఈశ్వరస్యసంగాన్మాయాయాం" అని యున్నచోట గల "సంగ" శబ్దము పరిహరించుట (4) కథలో చివర జీవేశ్వరునకు పరమానందరాజ్యము పట్టము గట్టుట (5) కథాంతమున ఫలశ్రుతిని జేర్చుట (6) ఆశ్వాసముల పరిమితి.

ద్వి॥ స్థిరమైన సుజ్ఞాన సింహాసనమున । నమ్మికనునిచి పూర్ణసుధాంశు మండ । లంబను దీప్తకలశ సుధారసము । చే నభిషేకంబు సేయించి సచ్చి । దానంద సామ్రాజ్యమను పదవికిని । కరమొప్ప పట్టంబు గట్టినయంత । సరస వివేకుండు సచివుడై కొలువ । స్థిరతరంబైనట్టి తెలివి తానగుచు । పరిపూర్ణ సౌఖ్యానుభవ మొందుచుండె॥

ఇందలి భావములును పదములును కూడ చాలవరకు నంది ఘంటల జంట యొక్క రచనలోనివే. అందు స్వతంత్రముగా చేసిన మార్పులు :-

(1) గ్రంథము పార్వతీపరమేశ్వర సంవాదముతో ప్రారంభించుట.

సాంద్ర తత్త్వజ్ఞానసార ప్రబోధ చంద్రోదయము యొక్క కథా సరళి యెట్లనిన మునురజతాచలంబున శ్రీకంఠుంగనుగొని పార్వతీకాంత "బంధమోక్షములకు మనసు కారణమందురది యెట్లు" అనిన శివుడు "మదిలో మోహముదయింప బంధమొదవును. వివేకముగల్గ మోక్షమొదవు"నని చెప్పెను. అంతట పార్వతి, "మోహము, వివేకము నేమిటి జనియించెను? వాని పనులేవి? వాని బలమెయ్యది? వాని లక్షణములేవి ? మోహమెట్లు ప్రబలును ? వివేకము దానిని భంజించి యెట్లు ప్రబలును ? తేటతెల్లముగ విస్తరించి చెప్పు" మని కోరెను. అంతట శివుడీకథ చెప్పవొడంగెను.

(2) కథాంతమున దీని విశిష్టతను చెప్పుట.

ద్వి॥ ఇది మహానాటకంబిది పావనంబు । అరయ సాకార నిరాకారములకు । కరమొప్పగా నాదికారణం బిదియ । శ్రుత్యంతములను విశ్రుతమైనదిదియ । ప్రత్యక్షమైన శబ్ద బ్రహ్మ మిదియ । పరిమాద నిగమాగమంబుల యందు। నరిముఱి నతిగోప్యమై యుండునిదియ । కడు భక్తి నిమ్మహాకావ్యాంజనంబు । కడముట్ట జూచిన ఘనులకు నెప్పుడు । పరమ సౌఖ్యంబైన బ్రహ్మతత్త్వంబు । కరతలామలకమై కనుపట్టుచుండు । చేరి యీ కథ పరిశీలించు సుజను । డా రాజయోగ రాజ్యాభిషిక్తుడగు । అతి పవిత్రం బగు నతని కులంబు । అతికృతార్థత జెందు నాతని తల్లి । మిగుల సప్పుణ్యుండు మెట్టినభూమి । యగణిత ఫలరాశియైయుండు నెప్పుడు । హితభక్తి యుక్తమై నీకృతి వినిన । యతడు దార్యతకృత్యుడై యొప్పుచుండు । సంతసం బీకృతి చదివిన బుద్ధి। మంతుండు సురలకు మాన్యుడై యుండు । అలర నీకృతివ్రాసినట్టి ధన్యుండు । తిలకింపతా నాది దేవుడై యుండు॥

ఇందు చివరి భాగమునమున్న ఫలశ్రుతి నంది ఘంటలజంట యొక్క రచనలోని ఫలశ్రుతిని కొంతపోలియున్నను నిందలి భావములు పదములు స్వాతంత్రమైనవే.

3) చిట్టచివరకు గ్రంథము ముగించునపుడు మరల పార్వతీ పరమేశ్వరుల సంభాషణమును జేర్చుట.

ద్వి॥ అని పరమేశ్వరుడాపార్వతికిని : వినిపింపనంతయు విని సంతసిల్లి । స్వామి నీ బోధ సంశయమెల్లబాసె। నేమని వర్ణింతు నింక నీ మహిమ । జ్ఞాన మార్గము నాటకంబుగా జూచి ! యానంద మొందితి నభవ నీవలన। హిత వృత్తి నంతర్బహిః ప్రపంచంబు । లతులితంబుగ నాట్యమాడింతువీవు। విభుయ ప్రపం

దంబు నిలయంబు నీవెయు । నిన్నుబట్టి [illegible] । నీయందె పుట్టి నీ నిఖిల విశ్వంబు । నీ వంటి [illegible] । అజ్ఞానులకు దూరమై యుందువు । సుజ్ఞానులకు [illegible] । పరమేశ పరమాత్మ పరమపూరుష । [illegible] । [illegible] ప్రయుక్తి-నంతటను । గ్రహించిన శిష్యుడై [illegible] । అదివిని [illegible] భేదంబు । గలుగునే మనల యొక్కటి [illegible] ? [illegible] సంతోష మునబొంగి కైలాసమున [illegible]॥

ఇందు చెప్పబడిన గ్రంథ విషయోద్దేశమైన అద్వైతము [illegible] ప్రకటింపబడినది. కథాసంవిధానమున [illegible] మూలానుసారమై యున్నది.

కావ్యరచన సరళమై [illegible] సులభముగ గ్రహించుటకును అనుకూలముగనున్నది. ద్విపద ధారాళముగ సాగినది. భాష చాలవరకు లాక్షణిక మును జాతీయమును నై యున్నది. దినరాత్రి, అనుభవించుచు, మనలము (మనము) వంటి ప్రయోగము లచ్చటచ్చట గలవు.

మొత్తముమీద నీకృతి యుత్తమమైన యద్వైత ద్విపద కావ్యములలో నొకటిగా నెన్నదగియున్నది.

# వివేక విజయము (యక్షగానము)

గ్రంథకర్త : పల్లె సూరయ్య

ఇది ప్రబోధ చంద్రోదయమను సంస్కృత నాటకమునకు రూపాంతరము. ఈ గ్రంథ మముద్రితము. దీని వ్రాతప్రతి యొకటి తంజావూరునందలి సరస్వతీ మహల్ గ్రంథాలయమున నున్నది. దీని రచయిత పల్లె సూరయ్య. ఇతడు వెలనాటి బ్రహ్మణుడు. కౌండిన్యసగోత్రుడు. ఆపస్తంబసూత్రుడు. ఇతని తండ్రి సూరయార్యుడు. తల్లి లక్ష్మమ్మ. ఇతనికి కవి సూరయయని ప్రసిద్ధి గలదట. రాజగోపాలుని గొలిచి కవితా చమత్కృతి గాంచినవాడట. ఇతని యిష్టదైవము తంజావూరు జిల్లాలోనున్న మన్నారుగుడి యను గ్రామమున వెలసియున్న రాజగోపాల స్వామి.

ఇది 'వివేక విజయాభిధ నాటకం' మని కవి వ్రాసెనుగాని ఇందు పాటలు, పద్యములు, ద్విపదలు, వచనములు, దరువులు మొదలగు యక్షగాన లక్షణము లనేక ముండుటచేత నిది యక్షగాన మను పేరనే ప్రసిద్ధమైనది.

ఇందలి కథా విషయము పాత్రలు కొంచె మించుమించుగా నన్నియు ప్రబోధ చంద్రోదయములోనివే. ఇత డీరచన చేయుటలో సంస్కృత మూలముతో పాటు నంది ఘంటల జంటయొక్క యనువాదమునుకూడ పరిశీలించి యనుసరించెను. అందుకు నిదర్శనముగా నీ క్రింది విషయమును జూడవచ్చును.

1. తన సతీసుతులు నిహతులైనందుకు దుఃఖించుచున్న మనో విభునితో వ్యాస సరస్వతి హితబోధ చేయు సందర్భమున శివకేశవులలో నెవరిపైననైన నేకాగ్రముగ ధ్యానము చేయుమని చెప్పిన పిదప "లక్ష్యము లనేకముగా నున్నవి. షట్చక్రములలో నొకదానిపైనగాని, నాదముపైనగాని, లేదా జగమంతయు వెలయు తేజోమయు దెలియుట, సకల ప్రపంచము విద్యగా జూచుట, మొదలగు వానిలో నేయొక్క లక్ష్యమునైన ప్రమాదములుడిగి నిలకడగలిగి భావింప గలిగినచో సచ్చిదానందము క్రమముగా సిద్ధించును" అని యుపదేశించుట; గ్రంథాంతమున ఫలశ్రుతిని చేర్చుట ( ఇవి మూలమున లేవు. నంది ఘంటల జంట రచించిన పద్యకావ్యమున మాత్రమే కలవు)

ఇట్లు వారి ననుసరించి చేసిన మార్పులును, కూర్పులునుగాక తాను స్వయముగా చేసిన కల్పన లనేకమున్నవి.

ప్రారంభమున వివేకుడు "మతి"తో సంభాషించి తన యుపనిషత్సంగంబున కామెనియ్య కొనజేయు సందర్భమున ప్రబోధ చంద్రుంగాంచి ఆ సుతునిచే మోహ దాయాదుల పరిమార్చి యావంశపతియగు పరమాత్మని ఘోరజీవత్వ దోషము ఛేదించి సచ్చిదానంద సామ్రాజ్య పట్టము గట్టుదునని చెప్పుట. దానికి సమాధానమున నామె యుపనిషత్కాంతతో నాతని సాంగత్యమున కంగీకరించుచు నేను నావిభుడవగు నిన్ను విడువదగదని చెప్పుట.

2. వివేకమహామోహ పరివార యుద్ధ సందర్భమున వివేకుని పక్షమున భారతీదేవి వచ్చి –

ఆ॥ నిత్యశుద్ధ బుద్ధ నిర్మల తత్త్వంబె । సత్యమై చెలంగు జగతి దాన
త్రిగుణమయ సమస్త దేవత్రయాది ప్రపంచమై యడంగు బ్రహ్మమందు॥

కావున దృశ్యనశ్వర సదితరంబు నవలంబించిన మిమ్ము నిర్మూలనంబు గావింతునని నిఖిల పాషండ బలముల సమయింపబోవ ననునది.

3. భార్యాపుత్త్రుల మరణమున విలపించు మనస్సునకు వ్యాసభారతి చేసిన యుపదేశమున "ఆత్మ ఏకమైన నిత్య సచ్చిదానంద వార్ధిగదా ! మోహ మమకారములను విడచి వివేకధృతి ప్రముఖుల చేకొన్నచో ముదమొందుగదా ! ఎంత తెలిసినను తెలియక యేల చింతించెదవు ? నీవు బలవంతముగ ప్రాణములు

8. ఉపనిషద్దేవి యుపదేశానంతరము నిదిధ్యాసనము (నిదిధ్యాసనము) వచ్చి విష్ణుభక్తి దేవియొక్క సందేశమును వివేకున కందించుట (మూలమునందన నుపనిషద్దేవికి తెలుపును.) అపుడు, నగణితగుణ విద్యయను కన్యగాంచు। నతు మీద వైరి సంహరణ ప్రతాప పటువైన ప్రబోధచంద్రుని గాంచు। గాన, విద్యా కన్యకనుగా నివృత్తి మానినిగూడి యమున చెలువంబు నాథు మనోనాథునటు సంక్రమింప। జేయుము నీ పుత్రు జీవేశగూర్పు మాయచే నిజరూపమాత్రావశిష్టు॥ మోహుని యతనికై మొనయు నత్యంత। ప్రోహాల నుపసర్గదుష్టుల దునుము। మరియొక్క కన్యకామణియైన ముక్తి! తరుణిని గాంచు నీ తరుణి యాపుత్రు! వలన మీకును వన్నెవాసియుగల్గు। తిలకింప నతిశయ స్థితిగల్గుననియె॥ (మూలమున "తత్రైవ ప్రకారసత్వా విద్యానామ కన్యా త్వదుదరే వర్ధతే। తత్ర విద్యాం సంకర్ష విద్యయామనసి సంక్రామయిష్యసి। ప్రబోధ చంద్ర పురుషే సమర్ప్య వత్సవివేకేన సహ మత్సమీపమాగమిష్యసీతి") యని మాత్ర ముపనిషద్దేవికి నిదిధ్యాసనముచెప్పినట్లున్నది. వివేకున కేమియు చెప్పలేదు. విద్యాకన్య ప్రకార సత్వయని చెప్పబడినది. (ముక్తి కన్యా ప్రసక్తి లేనేలేదు.

ఇందు విద్యాకన్య ప్రకారసత్వ యనబడలేదు. అగణితగుణ యనబడి నది. మూలమునందున్న సంకర్ష విద్యచేతనను మాటలేదు. ప్రబోధ చంద్రునికి "వైరి సంహరణ ప్రతాప పటువైన" యను విశేషణమున్నది. మరియు నతడు "మోహుని నతనికై మొనయు నత్యంత ప్రోహాల నుపసర్గ దుష్టుల దునుము" ననియు, మూడవదియగు ముక్తి కన్యవలనను, పుత్రుని వలనను మీకు వన్నెయు వాసియు నతిశయ స్థితియు గల్గు" ననియు నున్నది.

9. నిదిధ్యాసన సమాగంబున నుదమంది జీవేశ్వరుడున్న విధమిట్లు తెలుపుట :-

మ॥ నిగమాంత ప్రతిపాద్య హృద్య మహిమాని స్తంద్రమై చంద్రసూ
ర్యగ తేజో విభవాభి భావకమునై యాద్యంత శూన్యంబునై
తగు నానందము సత్తు చిత్తునను తత్త్వంబు న్నిదిధ్యాసనా
ను గతిం గాంచె నిజాత్మ విశ్చల లసన్మూర్తన్ ప్రదీపాకృతిన్ ॥

(మూలమున "నిదిధ్యాసనం పురుషే విశతి" యనియు పురుషః- ధ్యానం నాటయతి యని మాత్రమున్నది.

10. వివేకుడు విద్యాకన్యను మనోవీథిన గాంసంగుట, మనోనాథుండు విద్యా సంగతి నత్యంత నిశ్చలుడగుట ప్రబోధచంద్రుడు జీవేశ్వరుని యనుమతిచే మోహుని నిశ్శేషముగావించుట మూలమున ("నేపథ్యే, ఆశ్చర్యమాశ్చర్యం)

సలలిత చిత్తవృత్తి ననిశంబును చింత నేసి దేవి వా
రలఘుతరాత్మ తత్త్వపదమంది శభ్యతి గాంచు చెప్పుదున్ ॥

లౌకిక బుద్ధితో విమర్శించు వారి కిందలి ముక్తికాంత కల్యాణ విషయమున నొక యసందర్భము కనిపించును. ఏమనగా వివేకుని కుమార్తె యగు ముక్తికాంత వివేకుని తాతయు నద్వైత సార్వభౌముడును నగు జీవేశ్వరుని గూడి సుఖం బుడుట..ముత్తాతను పెండ్లాడి నట్లగునని ఇది కొంచెము భేదముతో సృష్టికర్త యైన బ్రహ్మయు తన సృష్టిలోనిదని భావింపబడు సరస్వతిని భార్యగా గ్రహించుట వంటిది.

వాస్తవము విచారించినచో జీవేశ్వరు డద్వైత సార్వభౌము డగుటచే సర్వము నతడేగాని యతనికంటె భిన్నమైనదిగాని వేరుగా బంధుమైనదిగాని లేదు. అజ్ఞానముచే నొక్కటి పెక్కుగా భావింపబడుట చేతనే యింత కథ నడచినది. మరల సత్యము తెలిసి భిన్న భావము విడిచి యేక మగుటే ముక్తికాంతను గూడి సుఖంబుండుట తనది తనలో నైక్యమగుట. లేదా తనదియనుకొన్నది తానేయగుట– అదే ఐక్యము అద్వైతము.

చల్ల సూరయకవిత్వము ధారాశుద్ధి గలిగి ద్రాక్షాపాకమున నున్నది. భాష లాక్షణికము, జాతీయము నై యున్నది. తామరతంపర, దుగ్గాణి మాత్రము, ఊవికలాడికి, ఉడివోవి, మొదలగు ప్రయోగములం దచ్చటచ్చట గోచరించును. క్రోధుడు హింసతో తన ప్రతాపమును వెలిబుచ్చు సందర్భమున నిట్లనును.

ద్వి॥ పరికింపగా తృణప్రాయమనుజుల । బరిమార్చుటయు దుగ్గాణి మాత్రంబు । గాన దాయాదుల గల బలమెల్ల । పూనిజయింతుగోపురములు ప్రింగు । బదుగుకు తలపులకుద్దములు గావె । గుడి ప్రింగు వానికి గుడి లింగముప్రు । వడియముగాదొకో వనితయాశి । తెదపుదు శాంతి విక్రాంబు నా మాట!"

ఇందలి జాతీయములు సందర్భమునకు తగినట్లున్నవి "ఉప్రువడియ" మను పద మరవమో యచ్చ తెలుగో యని సందేహముగా నుండును. కవి తంజావూరు ప్రాంతము వాడు గావున తమిళభాషాపదము లొకటి రెండు కలిసినను నాశ్చర్యము లేదు.

ఈ గ్రంథము ప్రబోధ చంద్రోదయ ముక్తికాంత పరిణయ గ్రంథముల మేళవింపనవచ్చును. ఇందును ప్రబోధచంద్రోదయమునమకూడ కథానాయకుడు వివేకుడే చివరి వరకు వివేకునకు ప్రాధాన్య మీయబడుటచే దీనికి వివేక విజయమని పేరు పెట్టుట యుక్తముగానే యున్నది. ఈ గ్రంథ మచ్చుపడినచో బహుళ ప్రచారము నొంది బాలురకు పామరులకు కూడ తత్త్వబోధకము కాగలదు.

# ప్రబోధ చంద్రోదయము

## నాటకరూపానువాదములు

### శ్రీ కందుకూరి వీరేశలింగముగారు

### శ్రీ వడ్డాది సుబ్బారాయడుగారు

ప్రబోధ చంద్రోదయమును శ్రీ కందుకూరి వీరేశలింగముగారును, శ్రీ వడ్డాది సుబ్బారాయడుగారును నాటక రూపమున నాంధ్రీకరించిరి.

శ్రీ కందుకూరి వీరేశలింగముగారు ఆరువేల నియోగి బ్రాహ్మణులు, తల్లి పున్నమాంబ, తండ్రి సుబ్బారాయుడు- జన్మస్థానము రాజమహేంద్రవరము. జననము క్రీ.శ. 1848వ సంవత్సరము. నిర్యాణము 1919. వీరి యితర రచనలు :- (1) మాలతీ మాధవము, (2) మాళవికాగ్ని మిత్రము, (3) అభిజ్ఞాన శాకుంతలము, (4) రత్నావళి, (5) హరిశ్చంద్ర నాటకము, (6) సత్యరాజా పూర్వదేశయాత్రలు, (7) వెన్నీసు నగరవర్తకుని చరిత్ర, (8) రాగమంజరి, (9) రాజశేఖర చరిత్ర, (10) నీతిచంద్రిక, (11) ఆంధ్రకవుల చరిత్రము, (12) స్వీయచరిత్రము మొదలగునవి మొత్తము 130 యున్నవి. అందు ప్రహసనములే 58 యున్నవి. వీరి శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము ప్రసిద్ధమైనది. వీరు తెలుగు వాఙ్మయమున నెన్నియో క్రొత్తమార్గములలో రచన సాగించి యాధునికాంధ్ర వాఙ్మయమునకు మార్గదర్శియనిపించుకొన్నవారు. నవలలు, నాటకములు, కథలు, విమర్శలు, వ్యాసములు, ప్రహసనములు, శాస్త్రములు, చరిత్రలు, వార్తాపత్రికలు మొదలగునవి. వివిధ ప్రక్రియలలో వీరి రచనలు సాగినవి. వీరికి "గద్యతిక్కన" యని ప్రసిద్ధి గలిగినది.

మొట్టమొదట తెలుగు నాటకము (1) ప్రహసనము, (2) జీవిత చరిత్రము, (3) స్వీయచరిత్రము రచించిన ప్రసిద్ధి వీరేశలింగముగారికే దక్కినది. వీ రనేక ప్రాచీన గ్రంథములు వెలుగునకు దెచ్చి ప్రకటించిరి. ఆంధ్రభాష కనేక విధముల సేవచేయుటయే కాక సంఘ సంస్కర్తగా కూడ వీరు ప్రసిద్ధులై పని చేసిరి. ఆధునికాంధ్ర వాఙ్మయ బ్రహ్మలలో వీరొకరు.

వీరిశైలి సాధారణముగా సులభము. మధురము నై సర్వజన గ్రాహ్యముగా నుండును. ప్రజాసామాన్యము నకర్థము కావలయునని సంఘసంస్కార ప్రచార మున కవసరమనియు వీరు తమ శైలిని తేలిక పరచుకొనినట్లు విమర్శకులు తమ యభిప్రాయమును వెలిబుచ్చిరి.

వద్దాది సుబ్బారాయుడుగారు :- నియోగి బ్రాహ్మణులు. హరితస గోత్రులు, వీరితండ్రి సూరపరాజు, తల్లి లచ్చాంబ. వీరి జన్మస్థానము కోనసీమలోని పాసెర్లపూడి. వీరు చాలాకాలము రాజమహేంద్రవరమునగల ఉన్నత పాఠశాలలో నాంధ్రోపాధ్యాయులుగా పనిచేసిరి. వీరి జననము క్రీ. శ. 1854 ఆనంద సంవత్సరము. నిర్యాణము 1938 వ సం॥. వీరి ఇతరకృతులు (1) ఆంధ్రవేణీ సంహారము (2) అభిజ్ఞాన శాకుంతలము (3) మల్లికామారుతము (4) విక్రమోర్వశీయము (5) చండ కౌశిక నాటకము (6) నృసింహవిశ్వరూపము (7) గౌతమీ జల మహిమాను వర్ణనము (8) భక్త చింతామణి (10) మేఘ సందేశము (11) నందనందన శతకము (12) సతీస్మృతి (13) సుతస్మృతి (14) వసురాయ చాటూక్తిముక్తావళి (15) శ్రీ సూక్తి వసుప్రకాశిక (16) సుగుణ ప్రదర్శనము ఇత్యాదులు.

వీరు సంస్కృతాంధ్రములందు మంచి పండితులు సమర్థులైన ఉపాధ్యాయులు. వీరి బోధన విద్యార్థులకేగాక పాఠశాలాధికారులకు కూడ మనోహరముగా నుండుటచే చాటుగానుండి వినెడివారట. ఆ కాలమున సుప్రసిద్ధులుగా నుండిన యనేకులు వీరి శిష్యకోటిలో గలరు. వీరు విద్యకు దగిన సుగుణ సంపదగలిగి వ(ద్దా)ది సు(బ్బా)రాయ అని ప్రసిద్ధి బొందిరి. 13 వ ఏటనే వీరు చక్కని కవిత్వము చెప్ప గలిగిరట. వారి భక్త చింతామణి పద్యములు ప్రసిద్ధములై యనేకులకు కంఠస్థములైయున్నవి. ఇందలి పద్యములు కొన్ని భావ గాంభీర్యము నందును తత్త్వబోధ యందును ప్రపంచ సాహిత్యమందలి యే కవితకును దీసి పోవని విమర్శకులు వ్రాసియున్నారు. ఇది భక్తి ప్రధానమైన గ్రంథము. ఇంత వ్యాప్తి నొందిన భక్తి శతకములు అరుదు. వీరి కవిత్వము ప్రౌఢతరు భావ సంపదకు నిధానము. వీరి నాటకానువాదము లన్నియు ప్రసిద్ధినొందినవి. వీరు, చిన్ననాట, నాటకములలో నభినయించువారట. వీరి పద్య పఠనము వినుటచే ఒడలు పరవశమైనట్లు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు స్వీయ చరిత్రములో వ్రాసికొనిరి. రాజమహేంద్ర వరమున ఆధునికాంధ్ర కవిత్రయ మని పేరొందిన వారిలో వీరొకరు.

రసానుగుణములైన శబ్ద [illegible] [illegible] [illegible] ఉద్గ్రంథములగును. యనువదిత సందర్భముగా చెప్పగల సమ్మతులేమియు [illegible] దాని యందు ప్రీతి లేకుండెను. వీరు సహస్రసంఖ్యాకులైన మహాపద్యములలో నొకరు.

శ్రీ కందుకూరి వీరేశలింగముగారు ప్రబోధ చంద్రోదయమును 1885వ సంవత్సరమునకే కొంతవర కాంధ్రీకరించి మిగిలినది 1902 వ సంవత్సరమున పూర్తి చేసినట్లు వారి యుపోద్ఘాతమును బట్టి తెలియుచున్నది. వారి యనువాదము 1902 వ సంవత్సరము జూన్ నెలలో ముద్రితమైనది. శ్రీ [illegible] నారాయణ గారి యనువాదము 1903 వ సంవత్సరము "మే" నెలలో ముద్రితమైనది. అప్పటికి రెండు సంవత్సరముల క్రిందటనే వారి యనువాదము పూర్తియై యుండినట్లు వారి యుపోద్ఘాతములో నున్నది. వారెప్పుడు ప్రారంభించిరో తెలియదు, కాని పూర్తి చేయుట మాత్రము వీరేశలింగముగారి కంటె ముందుగా జరిగినట్లు తెలియుచున్నది. అయినను ప్రచురణలో వీరేశలింగముగారిదే మొదటిది. ఇరువురును రాజమహేంద్రవర నివాసులే. కొంచెముంచుమించుగా నొకే కాలమున వీనాటకము ననువదించిరి

ఇరువురును తమ యనువాదములు మూలానుసారముగనే చేసినట్లు తెలిపిరి. నంది మల్లయ్య-ఘంట సింగనల యనువాదమును గూర్చి ప్రస్తావించిరి. కాని యిరువురు నొకరింకొకరి యనువాదమును గూర్చి ప్రస్తావించనందున ఒకరియనువాదమును గూర్చి మరొకరి కప్పుడు తెలిసి యుండక పోవచ్చునని భావింప నవకాశము కలుగుచున్నది. అంతేకాక వీరిరువురికిని రాచూరి వెంకట లింగకవి యొక్క ద్విపద రూపమైన యనువాదమును గూర్చి కాని (కొ) గొటికె (కె) ల పూడి వెంకట కృష్ణ సోమయాజి యొక్క పద్యకావ్యరూపానువాదమును గూర్చిగాని చల్లా సూరయ్య యొక్క వివేక విజయమను యక్షగాన రూపానువాదమును గూర్చిగాని తెలిసినట్లు కానరాదు.

మూలమున, ప్రథమాశ్వాసమున, "సంఘాతః ప్రథమ మహేశ్వరస్య సంగా న్మాయాయాం మన ఇతి విశ్రుత స్తనూజః" అని యొకచోటను "పుంస స్సంగ సముజ్ఝితస్య గృహిణీ మాయేతి తేనాప్యసావ స్పృష్టాపి మనః ప్రసూయ తనయః" అని మరియొకచోటను పరస్పర విరుద్ధ వాక్యము లున్నవి. ఇరువురును పరస్పర విరుద్ధముగానున్న యీరెండు వాక్యములను యథామూలముగనే యనువ

దించిరి. నంది మల్లయ-ఘంట సింగన లిందలి మొదటి వాక్యమునందున్న "సంగి" శబ్దమును పరిహరించి వ్రాసి వైరుధ్యమును తొలగించిరి. ఇరువురికిని నాటక రూపానువాదమున నొకచోటనే పొరపాటు వచ్చినది. మూలమున "తతో౽సావ హంకారేణ చిత్తస్య జ్యేష్ఠ పుత్రేణ నప్త్రా పరిష్వక్తః...." అని యున్నది. ఇందున్న "నప్తృ" శబ్దమునకు మనుమడనియు మునిమనుమడనియు నర్థమున్నది. నాంధ్రదేశమున నా పదమునకు మునిమనుమడనియేగాని మనుమడను వాడుకలేదు. ఇరువురును "మునిమనుమనిచే" ననియే యనువదించియుండిరి. కాని ఇచ్చట నాయర్థము పొసగదు. తన పుత్రుడగు చిత్తుని జ్యేష్ఠపుత్రుడగు నహంకారుడు తనకు మనుమడే యగును. కాని మునిమనుమడు కాజాలడు. దీనిని గ్రహించియే నంది మల్లయ-ఘంట సింగనలు తమ యనువాదమున "మనంబు పెద్దకొడుకగు నహంకారుండను మనుమనిచే నాలింగితుండై" యని వ్రాసిరి. "నప్తృ శబ్దమునకు కోశములందు మనుమడనెడి యర్థముకూడ నున్నది.

మూలమున షష్ఠాంకమునందున్న "యస్మాద్విశ్వ ముదేతి" యను శ్లోకమున కిరువురి యనువాదములును పోతనగారి "ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై" యను పద్యానుకరణములుగానే యున్నవి.

శ్రీ సుబ్బారాయుడుగారు తమ యనువాదమున మూలమున సందిగ్ధార్థ మున్న తావుల మూలమునందున్న పదములనే ప్రయోగించి మూలమునందలి శోభ యనువాదమున లోపించకుండునట్లు చేసిరి. ఉదాహరణమునకు (ప్రథమాంకమున) మూలమున "మాతురభిప్రాయ మాసాద్య" "నితాంత ప్రత్యాసన్నతయా తద్రూపతా మివాపన్నేన మనసా నవద్వారాణి పురాణి రచయిత్వా" యని యున్నదానిని "తల్లి యభిప్రాయము ననుసరించి" "నితాంత ప్రత్యాసన్నతంజేసి, తాద్రూప్యము నొంది నట్లున్న మనస్సు" అని అనువదించిరి. ఇందు "తద్రూపతా మివాపన్నేన" యను పదమునకు వ్యాఖ్యానమున తద్రూపతాం । మాతృరూపతాం । యద్వా తద్రూపతా మీశ్వర రూపతాం సర్వాద్వైతతాం" అని రెండర్థములుగా నున్నది.

ఇచట వీరేశలింగముగారు "తల్లి యభిప్రాయము నెరిగి భేదమేమియు లేక యామెనే పోలిన మనస్సు" అని ఏకపక్షముగ ననువదించిరి. వ. సు. రా. గారి

యనువాదము మూలమున కతి సన్నిహితముగ నున్నది. కం. పీ. లిం. గారి యనువాదము విపులమై మూలమునలేని విషయములుకూడ చేరియున్నది.

ఉదా :- ప్రథమాంకమున - మూలము :-

సతత ధృతి రత్యుచ్చైః శాన్తోఽప్యవ్యాప్త మహోదయో
ఽప్యధిగత నయోఽవ్యస్తః స్వచ్ఛోఽప్యుదీరిత ధీరపి
త్యజతి సహజం ధైర్యం ప్రీభిః ప్రతారిత మానసః
స్వయమపి యతో మాయా సంగా త్పుమానితి విశ్రుతః ॥

దీనికి వ. సు. రా. గారి యనువాదము :-

సంతత ధీరుడుం బరమశాంతు డవాప్తమహోదయుండు న
త్యంతనయుండు స్వస్థుడు సుదారమనీషుడు నయ్యుఁ బూరుషుం
డింతుల మాయచేత ద్యజియించెడు నైజపు ధైర్యముం జెలీ" ॥

దినికి కం. పీ. లిం. గారి యనువాదము :-

ఉ.................................................

సీ॥ సతత మహోన్నత ధృతిమంతుడయ్యును
సదమల సంపూర్ణ శాంతుడయ్యు
ప్రబలతరైశ్వర్య భాసమానుండయ్యు
మహిత సంతత నీతిమంతుడయ్యు
ననమానఘన నిశ్చలాంతఃకరుణుడయ్యు
సమయానుగుణ ధీ విశాలుడయ్యు
దరుణుల మాయల దగులొంది పురుషుండు
త్యజియింపడే తన ధైర్య గరిమ ?
నట్లె యా మహాపురుషుండు నరయ నిపుడు
వరలు మాయామహాదేవి వలల దగిలి
చిరతరానూన సంబంధ గరిమ కతన
దన్నుదానెరుఁగగ జాలకొన్నవాడు ॥

అనువాదములో నిరువురు ఒకటి రెండుచోట్ల నామవాచకముల లింగ వచనములను మార్చివ్రాసిరి.

ఉదా :— చతుర్థాంకమున :— మూలమున:— "తతో వైరాగ్యం ప్రాదుర్భవిష్యతి" యని నపుంసక లింగముననున్న వైరాగ్య శబ్దమును వ. సు. రా. తమ యనువాదమున "అంతట వైరాగ్యుడును బుట్టగలడు" యని పుంలింగమున వ్రాసిరి. దీనిని కం. వీ. లిం. తమ అనువాదమున "అప్పుడు వైరాగ్యోదయము తప్పక గల్గును" అని లింగభేదము తెలియకుండగ వ్రాసిరి. పంచమాంకమున మూలమున:- "వత్స ఏతద్వైరాగ్యం త్వాముపస్థితమ్" అని నపుంసక లింగముననున్న వైరాగ్యమును ఇరువురును "వైరాగ్యుడు నిన్ను చేరవచ్చినాడు" అని పుంలింగముగనే యనువదించినారు. ఇచ్చట నీ మార్పు మూల విరుద్ధమైనను ఉచితముగనే యున్నది. మూలమున "ఆః! పాప మహా మోహహతక! సర్వథా హత స్త్వయాయం మహాజనః" అనియున్న దానిని వ. సు. రా. గారు "ఆ! పాప మహామోహహతక! నీ మూలమున నీ మహాజమడు సర్వథా ప్రిణష్టుడయిపోవుచున్నవాడు గదరా!" యని యనువదించిరి. దీనిని కం. వీ. లిం. "ఓరీ! మహామోహా, ఓరీ దోసకారిపీనుగా (యని యచ్చ తెనుగువను) ఈ మహాజనులెల్ల నీవల్ల సర్వవిధములచేతను జెడిపోయిరి" యని "మహాజన"శబ్దమును బహువచనముగ ననువదించిరి. భావమును బట్టిచూడ ఇది యుచితముగానే యున్నది.

మూలమందలి భావమును వ్యక్తముచేయుటలో నిరువురి యనువాదములలోను కొంత తారతమ్యమున్నది. ఉదా :— మూలము :-

శ్లో॥ ఏకమేవ సదా బ్రహ్మ సత్య మన్య ద్వికల్పితమ్
కో మోహ స్తత్ర కః శోకఏకత్వ మనుపశ్యతః ॥
(ఇందలి రెండవపాద మీశావాశ్యోపనిషత్తులోనిది)
దీనికి వ. సు. గారి యనువాదము :-

తే॥ గీ॥ బ్రహ్మమొక్కడే ఋత మితరము వికల్పి
తమ్మను : మ్మేకతను జూచు తత్త్వవిదున
కెవ్విధంబున మోహంబు నివ్వటిల్లు
నెకతంబున బైకొను శోక వికృతి ?"

ఇందు సత్యశబ్దమునకు "ఋత"శబ్దముపయోగింపబడినది. ఇచట ఋతమనుటకంటె సత్యమనుటయె యుక్తము. కం. వీ. లిం. యనువాదము :-

గీ॥ బ్రహ్మ మొక్కటియె సత్య వస్తువగుచు
నితరమెల్ల వికల్పిత మెప్పుడగునొ

యప్పు డేకత్వమును జూచునట్టి వాని
కెక్కడివి శోకమోహంబు లెంచిచూడ॥

ఇందలి "ఎప్పుడగునో యప్పు డేకత్వమును జూచు"నన్నది మూలమునం దున్న భావగాంభీర్య మిందు కొంత లోపించినట్లున్నది. షష్ఠాంకమున మూలము :-

ద్వా తౌ సుపర్ణౌ సయుజౌ సఖాయౌ। సమానవృక్షం పరిషస్వజాతే
ఏక స్తయోః పిప్పల మత్తి ఏక। మన్య స్త్వనశ్న న్నభిచాకశీతి॥

ఇది కొద్ది భేదముతో కఠోపనిషత్తునందున్నది. దీనికి వ. సు. రా. అను వాదము-

కం॥ రెండు సుపర్ణంబులు జత। నుండుం గూడుకొని యవ్వి యొక వృక్షమునన్
బండిన పిప్పలమును నం। దొండు భుజింప కొక్కడు పొలుచున్

కం. వీ. లిం :—

కం॥ సహవాసులు జెలులునునౌ। విహగంబులు రెండు నేకవృక్షము చేరున్
వివాగమొకటి తిను ఫలములు। సహహో రెండవది తినక యాలోకించున్॥

ఇందు సుపర్ణ పిప్పల శబ్దములు మూలమున నున్నవి, పరిహరింపబడుటచే మూలమందలి భావ మనువాదమున కొంత లోపించినట్లు కనిపించును. షష్ఠాంకమున మూలము :- (సకోపమివ) కోనామాత్మానమజా వస్త్ర మస్థ మివప్రత్యుత్తరం దాస్యతి !

వ. సు. రా, యనువాదము :- (కోపగించుకొన్నట్లు) "తన్ను తా నెఱుగని వానికి నంధునకుబోలె నెవ్వరు ప్రత్యుత్తరమీయగలరు?" ఇది ప్రశ్నవలెనున్నది. కం. వీ. లి. యనువాదము :- (కోపించినదానివలె) "ఎవ్వడు తన్ను దా తెలుసు కోలేక యంధునివలె ప్రత్యుత్తర మిచ్చుచున్నాడో యతడే" ఇది సమాధానమువలె ప్రత్యుత్తర మిచ్చుచున్నాడో యతడే" ఇది సమాధానమువలె నున్నది.

షష్ఠాంకమున మూలము :- ప్రశాంతారాతి రగమద్వివేకః కృతకృత్యతామ్॥ "నీరజస్కే సదానంద పదే చాహం నివేశితః"॥ వ.సు.రా. :- "శమిత బలదర్పి తాఖిల। విమతుడు కృతకృత్యతను వివేకుడు పొందెన్। సు మహానందమున రజ స్కమునగు పదమందు నిలువ గలిగితి నేనున్।"

కం. వీ. లిం. :- "కృతకృత్యుండయ్యెను దా। హత విమతస్తోముడగుచు వల్లవివేకుం। డతి దళిత రజస్కుడన్నై। యతుల సదానంద పదవి నందితి నేన్నున్॥"

ఇందు "అతి దళిత రజస్కృదనై" యనునది మూలమునకు సరియైన యను వాదముకాదు.

ఇరువురి యనువాదము లందును చతుర్థాంకమునను న్న యాదీకేశవస్వామిని వివేకుడు స్తుతించిన ఘట్టమునను, పంచమాంకమున శ్రద్ధ- విష్ణుభక్తితో వివేకుని సైనిక సంరంభమును వర్ణించిన ఘట్టమునను, మూలమునను న్న సుదీర్ఘ సంస్కృత సమాసములే యథాతథముగ నుపయోగింపబడినవి. సాధారణముగా వ. సు. రా. గారి యనువాదము భాషాభావముల రెంటియందును మూలమునకు సన్నిహితముగ నున్నదనవచ్చును. భాష లాక్షణికము ప్రౌఢమునై పటుత్వము గలిగి సందర్భోచితముగ నున్నది. పద్యరచనలో సాధారణ మత్తేభ శార్దూలాది వృత్తములతోపాటుగా నచ్చటచ్చట ఉత్సాహ, పంచచామర, సుగంధి, స్రగ్ధర, వృత్తము లుపయోగింపబడినవి:

చతుర్థాంకమునను న్న విశ్వేశ్వరస్తుతి తేటగీతి పద్యముగా నున్నను భాష పూర్తిగా సంస్కృతమై యున్నది.

తే. గీ. సచ్చిదానంద రూపాయ చంద్రం ఖండ
ధారిణే నేత్ర భూత వేదత్రయాయ
ధీర నిశ్శ్రేయసప్రాప్తి కారణాయ
మౌని హృద్వాసినే నమస్తే నమోస్తు ॥

వీరి వచన శైలి సాధారణముగా తత్సమ పదభరితమైనను వారణాసి పరిసర వర్ణనమున తద్భవ దేశ్య పదభరిత సమాసపూర్ణమైయున్నది.

ఉదా :- "మరియు నివిగో బ్రతిముకులమునను దగులుకొని మొరయు మొకరి తుమ్మెద కదువుల రొదల వలనను బరువంపు విరులరవింపెడు సవసరం బునం బట్టుచాలక తొనకి తొరగెడు మకరంద రసపు ముసురు వలనను కలిపి క్రిక్కిరిసిన పసరాకు గుమురుల నీడ లొసంగు తరువిసరము వలనను, నలువలకుల జిఅుత కరువలిలు గుప్పురించెడు కమ్మతావుల వలనను............" వీరి పద్యశైలి సంస్కృత సమాస భూయిష్ఠమైనను అన్వయ క్లిష్టతలేక తత్త్వవిషయముగూడ సుబోధమగున ట్లున్నది. అందులకొండు రెం డుదాహరణములు :-

మ॥ జలజై వాత్మకు దంతరిక్ష నగర స్వప్నేంద్ర జాలాదులుం
బలె గార్యంబు జగం బనత్యము దయ ధ్వస్తాది యుక్తంబు ను

క్తి లసద్రూప్యము స్రగ్భుజంగమము భాతిన్ స్వప్రకాశున్ హరిన్
దెలియం జాలమి దోచివేచెదునుగాదే తత్వబోధంబునన్ ॥

చ॥ అమలము నిష్కలంబను తితాస్త నిరంతర భాసమం బ్రశాం
తము నగుజ్యోతి విశ్వజననంబున నెట్లు వికారమొందు ? సాం
ద్రముల సితోత్పల చ్ఛవియుతంబులు సారెకు వా రివాహ బృం
దము లుదయించినం దివికి దానవికార మదేటి దారయున్ ॥

కం· వీ. లిం. గారి అనువాదము సాధారణముగా మూలము కంటె కొంత విపులమై యున్నది· భావములలో నచ్చటచ్చట మూలాతిక్రమణము స్వల్పముగ గోచరించుచున్నది. శైలి సరళమై యంతలి వేదాంత విషయము సుబోధమగుట కనువుగ నున్నది. పద్యములలో నచ్చటచ్చట, స్రగ్ధర, మహాస్రగ్ధర, ఉత్సాహ, వృత్తము లుపయోగింపబడినవి· వీరి వచనశైలి సాధారణముగా సరళమైయుండి నను వారణాసీ పరిసర వర్ణనలలో సంస్కృత సమాస భూయిష్ఠమైయున్నది.

ఉదా:– ప్రతి ముకుళలగ్న మధుకర నికర ఝుంకార ముఖరంబులును వికసిత కుసుమ వినరవిగళ న్మకరంద వర్షాతిశయ ధురంధరంబులును, నానాప్రసూన సుగంధ బంధురంబులును, శ్యామాయమాన నిబిడచ్ఛదచ్ఛాయావ నీరుహమనోహరంబులును నగు పురోద్యాన ప్రదేశంబుల లవిగో సమీపంబున గానవచ్చుచున్నవి. ఈ వాయువులు సహిత మిక్కడ బాశుపత వ్రతమును గ్రహించిన తాపసుల వలెనే కానబడుచున్నవి.

మొత్తముమీన నిరువురి యనువాదములును సంతృప్తికరముగానే యున్నవి. కాని యందు వ. సు. రా. గారి యనువాదము, కం. వీ. లిం. గారి యనువాదము కంటె కొంత మేలుగానున్న దనవచ్చును. కం. వీ. లిం. గారు తమ జీవిత చరిత్రమున నిట్లు వ్రాసికొనిరి. "పద్యముగాని, వచనముగాని నేనొకసారియే వ్రాయుచుందును. వ్రాసినదానిని మరల దిద్ది వ్రాయుట నాకలవాటులేదు. అందుచేత నా వ్రాత దిద్ది దిద్ది మరల మరల వ్రాయుచుండువారి దానివలె నంత మెఱుగుగా నుండ దనుకొనెదను."

ఈ అభిప్రాయము ప్రబోధచంద్రోద యానువాదమునకుకూడ అన్వయించును. ఇం దుద్దేశింపబడినవారు వడ్డాది సుబ్బారాయుడుగారే కావచ్చును.

# వివేకసింధువు

## కర్త వేగినాటి కొండనార్యుడు

ఈ గ్రంథము మొదట క్రీ. శ. 1864లో మద్రాసులోని విద్యా విలాస ముద్రాక్షరశాలయందు పిదప 1930లో వావిళ్ళవారి చేతను ముద్రింపబడినది. ఈ కవి వంశకాలాదుల చర్చ యీతని ముక్తికాంతా పరిణయ కావ్యమును గూర్చి వ్రాసినచోట (నాలుగవ సంపుటములో) చేయబడినది.

'వివేక సింధువు' మొదట ముకుందమౌనిచే సంస్కృత, ఆంధ్ర, మహారాష్ట్రి భాషలలో రచింపబడినట్లు తెలియుచున్నది. తంజావూరు సందలి సరస్వతీ మహల్ గ్రంథాలయమువారిచే ముకుందముని రచించిన 'వివేకసింధువు' 'పరమార్ధ బోధ'యను పేరుతో ప్రకటించ బడియున్నది. ఆ గ్రంథమున నారంభ శ్లోకమున 'వివేక సింధు' వనియు గ్రంథాంతమున 'పరమార్థబోధ' యనియు వ్రాయబడి యుండుటచేత నీ గ్రంథ మీ రెండునామములచే వ్యవహరింపబడుచున్నదనియు నా గ్రంథ పీఠికలో వ్రాయబడినది. దీనినిబట్టి 'వివేకసింధువు'నకు 'పరమార్థబోధ' యను మరొక పేరు కలదనియు, నది సంస్కృతభాషలో రచింపబడినదనియు స్పష్టమగుచున్నది

మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున 'వివేక సింధువు' వచన కావ్యమున్నది. [గ్రంథసంఖ్య డి. 1801. అది చెన్న బసవేశ్వరార్యకృతము. ఆ గ్రంథారంభమున "ముకుందయోగి మహారాష్ట్రి భాషా విశేషంబున వివేకసింధు వన రచియించె నది సకల లోకోప కారంబుగా—కాశి చెన్న బసవేశ్వరుండను నేను ఆంధ్ర భాషానొక్తికంబుగా టీకరచియింపబూనితి...." అని యుండుటచేత నీ చెన్న బసవేశ్వరుడు ముకుందమౌని రచించిన మహారాష్ట్రి మాతృక ననుసరించె ననియు, దానినిబట్టి ముకుందముని వివేకసింధువును మహారాష్ట్రిమున రచించె ననియు స్పష్టమగుచున్నది.

వేగినాటి కొండన తాను రచించిన 'వివేకసింధువు' (పద్య కావ్యము) నందు "............ముకుంద మునీంద్రుడు నాంధ్రభాషను రచియించిన వచన కావ్యంబైన 'వివేకసింధువు' నిరవద్యగద్యపద్యాత్మకంబుగా బ్రబంధంబు చేయ సమకట్టి...." యని వ్రాసి యుండుటచేతను, వివేక సింధువును ద్విపద కావ్యముగ

రచించిన వెంకటకవియును తాను ముకుందముని యాంధ్రవచన కావ్యముగ రచించిన వివేకసింధువును ద్విపద కావ్యముగ రచింపదలచినట్లు చెప్పి యుండుట చేతను, ముకుందముని వివేకసింధువు నాంధ్ర వచన కావ్య గగూడ రచించెనని స్పష్టమగుచున్నది.

వేగినాటి కొండన రచనయు, దేవరకొండ వేంకటకవి రచనయు నొకే మాతృక నుండి మలచబడిన రెండురూపములని వారి వ్రాతను బట్టియే గాక యా రచనల యందలి పదజాలాదులను బట్టియు స్పష్టమగుచున్నది. ముకుందముని రచించిన యాంధ్ర వచనము లభ్యము కాకపోవుటచేతను దేవరకొండ వేంకటకవి రచన, వేగినాటి కొండన రచన కించుమించుగా రూపాంతర మాత్రముగా కాన వచ్చుచుండుట చేతను వేంకటకవి కొండన రచన ననుసరించి రూపాంతరీకరించి నాడనిపించుచున్నది. అందుచేత అతడు ముకుందముని యొక్క యాంధ్రవచనము ననుసరించినట్లు చెప్పుటను సంశయింపవలసి వచ్చుచున్నది. అట్లన్నచో కవి యొక్క సత్యశీలతను శంకించినట్లగును. కాని యిచ్చట రెండు సందేహములు నివృత్తి కావలసి యుండును. మొదటిది వెంకటకవి యొక్కయు కొండన యొక్కయు పదజాలము కూడ కొంచెమించుమించుగ సమానముగ నుండుటచే నది ముకుంద ముని యొక్క పదజాలమే యై యుండునా యనునది మొదటి సందేహము. వేదాంత వచన కావ్యమున నట్లుండుట సాధారణముగా సంభవించదు.

ముకుందమౌని స్వయముగా తెలుగు వచనమున రచించియుండగా కాశీ చెన్నబసవేశ్వరుడు మహారాష్ట్రి వచనమునుండి మరల ననువదించుట కేల ప్రయ త్నించును అనునది రెండవ సందేహము. అతనికి తెలుగువచనము లభించి యుండక పోవచ్చునని మన మూహింపవలసి వచ్చును.

కొండన్నయు వేంకటకవియు తెలుగువచనము ననుసరించి రచియించినట్లు చెప్పుట చేతను, రెంటియందు పదజాల మొక్కతీరుగా నుండుట చేతను, ముకుంద ముని తెలుగు వచనమున వివేక సింధువును రచించినాడనియు, నాపదజాలమునే కొండన్నయు వేంకటకవియు నుపయోగించి రూపాంతరీకరించిరనియు విశ్వసింప వలసి యున్నది. ముకుందమౌని యాంధ్రవచన రచన లేనప్పుడు కొండన యొక్కయు, వేంకటకవి యొక్కయు రచనలు పరిశీలించినచో వేంకటకవి కొండన ననుసరించెననెడి యభిప్రాయము స్థిరపడును.

ముకుందముని మహారాష్ట్రుడనియు, శ్రీరామనాథ మునీంద్రుని శిష్యుడనియు, వతనికి ముక్తినాథుడనెడి ప్రసిద్ధి యున్నదనియు తంజావూరువారు ప్రకటించిన సంస్కృత ప్రతినిబట్టి తెలియుచున్నది. 'వివేక సింధువు' (పరమార్థ బోధ)ను మహారాష్ట్రమున రచించిన ముకుందముని పదనొకండవ శతాబ్దివాడని "మహారాష్ట్ర వాఙ్మయ చరిత్ర" వలన తెలియుచున్నది. వివేక సింధువునకు తెలుగు వచనము రచించిన ముకుందముని యతడో మరొకడో లేక మహారాష్ట్రము నుండి తెలుగు వచనముగ ననువదించిన యతడెవరో మరొకడు ముకుందముని పేర రచించెనో చెప్పుట కాధారములు లేవు.

వివేకసింధు వైదాశ్వాసములుగను, పదునైదు ప్రకరణములుగను రచింపబడినది.

విషయ సంగ్రహము :- సాధన చతుష్టయ సంపదగల జిజ్ఞాసువొకడు బ్రహ్మనిష్ఠుడైన సద్గురు సన్నిధానమును జేరి సంసార సాగరమును తరింపజేయ ప్రార్థింప నాగురు డాతనికి కర్మలు ముక్తి సాధనములు కావనియు, సద్గురుని చతుర్విధార్చనల సేవించి యాతని యనుగ్రహమున మోక్షపదప్రాప్తి రహస్య మెరుగనగుననియు తెల్పి, యాతనికి మొదట తత్త్వమస్యాది మహావాక్యార్థములను లక్ష్యార్థ ప్రధానముగా బోధించి తదువష్టంభకముగా దేహాదుల నాత్మయని నిరూపించుటకుపక్రమించి, స్థూలదేహ మాత్మ కాజాలదని వివిధ యుక్తులచే బోధించెను. ఈ సందర్భమున స్థూలదేహ సంబంధులగు వివిధ హఠయోగసాధనలు, పరతత్త్వ మరయుట కుపకరింపజాలవని వివరించెను. ఇది స్థూలదేహ నిరసనమను ప్రథమ ప్రకరణము. ద్వితీయ ప్రకరణమున సూక్ష్మదేహ మనాత్మయనియు తృతీయ ప్రకరణమున కారణదేహమాత్మ కాజాలదనియు నిరూపించెను. ఇది ప్రథమాశ్వాసము.

చతుర్థప్రకరణమున ఆత్మ అవస్థాతీతుడని బోధించుటకు ముందుగా తుర్యావస్థాయుతమగు మహాకారణదేహము కూడ అనాత్మయేనని నిరూపించెను. ఈ సందర్భమున క్షపణకుల శూన్యవాదమును ఖండించి, ఆత్మ సర్వవ్యాపకము, దము వనెడి విషయమున శిష్యునకు గలిగిన సందేహములను సయుక్తికముగ నివర్తించెను. ఇట్లు జీవతను చతుష్టయ వివరణపూర్వకముగా నాత్మయొక్క శరీరత్వమును, అవస్థారహిత్వమును నిరూపించెను. పంచమ ప్రకరణమున

ఈశ్వరతను చతుష్టయ వివరణ పూర్వకముగా తదతీతమగు నిష్కళ బ్రహ్మ తత్త్వము స్వాత్మతత్త్వము కంటె అభిన్నమని యుపదేశించెను. అంతట శిష్యుడు ప్రార్థింపగా గురుడు పిండాండ బ్రహ్మాండములకు సంబంధించిన దిన ప్రళయ మహా ప్రళయములను గూర్చి వివరించి పిదప "వివేకంబున జూచిన జగంబు మిథ్యా రూపంబై బ్రహ్మంబు సత్యస్వరూపంబై నిలుచు, నీ సకల ప్రపంచంబులుండియు లేక యుండును. ఇది ప్రత్యక్ష ప్రళయమగుటచేత నత్యంత ప్రళయమనబడునని బోధించెను.

షష్ఠప్రకరణము గురుడు తత్త్వమస్యాది మహావాక్యార్థ గూఢార్థమును జహద జహల్లక్షణచే బోధించి శిష్యుని సంశయములు తీర్చి జీవేశ్వర భేద ముపాధికల్పితమే గాని వాస్తవము కాదని నిరూపించి, జీవాత్మ పరమాత్మ తాదాత్మ్యైక్యమును సిద్ధాంతీకరించెను.

ఇంతవరకు ద్వితీయాశ్వాసము.

సప్తమప్రకరణమున గురుడు, యలోక్య, సామీప్య. సారూప్య, సగుణ సాయుజ్యములు మాయాకల్పితములే యగుటచే నందు నిత్య ముక్తిలేదనియు స్వస్వరూపస్థితియైన నిర్గుణ సాయుజ్యమే కైవల్య మనబడు నిత్యముక్తి యనియు, స్వరూపమగు నా నిర్గుణ బ్రహ్మమున సజాతీయ, స్వగతభేదములు లేవనియు, మాయయనునది కల్లయనియు, దానిని నిరసింపనవసరములేదనియు దాని నెరిగి నచో నదినశించునుగావున స్వరోపనిష్ఠుడగుటయే కర్తవ్యమనియు బోధించెను.

అష్టమప్రకరణమున గురుడు పిండబ్రహ్మాండములు కార్య కారణములగుటచే వానియందు పరిమాణ భేదమేగాని వాస్తవిక భేదము లేదనియు, వేదశాస్త్రములలో కనిపించు భేదోక్తులు పూర్వపక్షములనియు, వానియందు కనిపించు ఏకమేవాద్వితీయం బ్రహ్మ మొదలగు నద్వైత బోధోక్తులు సిద్ధాంత వాక్యములనియు, నీ విషయము తెలియని మందమతులను విడిచి, బ్రహ్మానుభవము నొందిన కారణగురుని సేవించి తరించవలెననియు తెలిపి యట్టి కారణగురుని లక్షణములను. శిష్యలక్షణములను, గురుడు శిష్యుని సాధన చేయించు విధములను వివరించి, యాత్మజ్ఞానప్రదాతయగు గురునితో పోల్చుటకు పరుసవేది, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, మొద

లగునవేవియు తగినవి కావని నిరూపించెను. పిదప గురుడు హస్తమస్తక సంయోగముచేసి గురుసంప్రదాయము ప్రకారముగా శాంభవీ ముద్రావిధానమున స్వస్వరూప జ్ఞానము నుపదేశింపగా నా జ్ఞానశక్తి యాతనిలో ప్రవేశించి, యాశిష్యుని చైతన్యమున స్వయంబోధ ప్రకాశమై శరీరమునందు కంపము పొడమి పులకాంకురమై చెమర్చి సాత్వికభావమున నతడు రాజయోగ సామ్రాజ్య పట్టాభిషిక్తుడై యుండెను.

నవమప్రకరణమున గురుడు శిష్యునకు గలిగిన యాత్మానుభవము స్థిరముగా నుండుటకుపాయముల నుపదేశించెను. పిమ్మట శిష్యుడు "జీవునికి జననమరణము లేవిధమున దప్పునయ్యా యెఱిగింపు దగన్" అని కోరగా గురు డిట్లుపదేశించెను. అజ్ఞానము విడువనంతవరకు జనన మరణములు తప్పవు. శ్రీ గురుకృపచే నజ్ఞాన తమము విలయమై స్వరూప జ్ఞానానుభవము స్థిరమైనవానికి జనన మరణము లుండవు. స్వరూపానుభవము గలిగి సమాధిస్థితుడైనవానికి కలుగు విక్షిప్తి, గతా యాత, సునిష్ఠిత, సులీనతలను స్థితులు క్రమముగా నతిక్రమించుట కా భూముల విధము లెరిగి బ్రహ్మమును ధ్యానము చేయవలెను. అట్లు చేయుటవలన సకల భ్రాంతులను గెలిచి ప్రయాసములేక పూర్ణానందమొందును. అతడే రాజయోగి యనబడును. మందమతులకై ఇంత చెప్పవలయును గాని, తీవ్రమతులకు గురు సిద్ధ వాక్య మొకటియే చాలును. శ్రీ గురు ననన భావమున నర్చించి చిత్తమునకు గప్పిన రజస్తమో గుణములను నివారించి, నిర్గుణ బ్రహ్మముపై భక్తినిలిపి తనకు దానె నిర్గుణ బ్రహ్మమైన పరమసుఖము పొందును. అట్లుగాక యష్టాంగ యోగమునను, భక్తిప్రసంగమునను, జీవపరమాత్మల కైక్యము చాలదు.

ఇట్లు చెప్పగా విని శిష్యుడిట్లు ప్రశ్నించెను.

సీ॥ అయ్య యెట్టి పదార్థమది పరికింపంగ। బ్రహ్మమం చేటికి పలుకబడెను
సగుణమో నిర్గుణ సంజ్ఞయో పరమాత్మ। మాయ యెవ్వని శక్తియై యెలరు
నది యెటువలెనుండు నారూపమెట్టిది। యజ్ఞాన మెవ్వరి నాశ్రయించు
నెవ్వరు నిర్మించి రీ ప్రపంచం వెల్ల। యెట్లు నిలిచి యున్నది తలంప
తే॥ జనన మరణము లెటువలె సంభవించు
నెలమి జీవుని కీక్రమంబెల్ల నాకు
దెలియ నెరిగింపు మతి కృపాదృష్టిజూచి
పరమకారణ గురుమూర్తి భవ్యకీర్తి॥

ఇంతవరకు తృతీయాశ్వాసము.

దశమ ప్రకరణమున నవమప్రకరణాంతమున శిష్యుడడిగిన ప్రశ్నలకు గురుడు క్రమముగా నుత్తరముల నొసంగెను. అందు మొదట దృష్టాంత పూర్వక ముగా బ్రహ్మ వివర్తవాదము నుపదేశించి పిదప క్రమముగా తత్త్వసృష్టి ప్రకార మంతయు సవిస్తరముగా తెలిపెను.

ఏకాదశప్రకరణమున నన్నమయాది పంచకోశములను వివరించెను. ఇంత వరకు చతుర్థాశ్వాసము

ద్వాదశప్రకరణమున గురుడు శిష్యునకు తత్త్వమస్యాది వాక్యచతుష్టయ మును జహదాది లక్షణత్రయ పూర్వకముగా వివరించెను.

త్రయోదశప్రకరణమున సహజ, కర్మజ, భ్రాంతిజన్యములను త్రివిధ తాదాత్మ్యములను, తన్నివృత్తి ప్రకారములను నిరూపించెను.

చతుర్దశ ప్రకరణమున గురుడు శిష్యునితో-

కం॥ ధీరత వినుము నజిహ్వుం డారయ షండుండు పంగునంధుడు బధిరుం
డారూఢి ముగ్ధుడనగా

వీరార్వురుగలరు వారి విధమెరిగింతున్" అని యజిహ్వత్వాదు లింద్రియ లోపముచేత గాక నింద్రియ నిగ్రహముచే నాత్మనిష్ఠ గలిగియుండుటచేతనే సిద్ధించు నని వివరించి చెప్పెను.

పంచదశప్రకరణమున సాధకున కుత్పన్నమగు పూర్వకాల వ్యవహార జన్య మైన భూతప్రతిబంధమును తన్నివారణమార్గమును, విషయాసక్తి, ప్రజ్ఞా మాంద్యము, కుతర్కము, విపర్యాస, దురాగ్రహమునను నాలుగు విధములుగా నుండు వర్తమాన ప్రతిబంధమును, తన్నివారణ మార్గములను ఆహూఁలలో జడ భరతాదులవలె నెవ్వరికో సకృత్తుగా కలుగునట్టిదియు దయారూపమున నుద్భవించి, యది తన్నేమియు చేయదని నిర్లక్ష్యము చేయుటవలన నాతడు కొన్ని జన్మము లెత్తుటకు కారణభూతమగు నదియు నగు భావి ప్రతిబంధమును, తన్నివారణ మార్గ మును వివరించి, వీని నతిక్రమించినవాడు భయరహితుడై యీ జన్మమునందే మోక్షము గాంచునని యుపదేశించెను.

ఇట్లు గురుడు శిష్యునకు నిత్యానంద సంధాయకమైన తత్త్వజ్ఞానమును శ్రుతియుక్త్యనుకూలముగ నుపదేశింపగా శిష్యుడు తదుపదేశ జన్య వివేకమున పర తత్త్వ లాభమొంది ధన్యుడయ్యెను.

ఇది పంచమాశ్వాసము.

ఇందద్వైత తత్త్వశాస్త్రమంతయు సులభముగ సుబోధమగునట్లు సరళమైన శైలిలో వివరింపబడినది. "సకల పాషాండ మతంబులు ఖండనంబుగావించి ముక్తి కరతలామలకంబు సేయుటం జేసి వేదాంత సారంబయిన యీ గ్రంథంబు 'వివేక సింధువని' చెప్పంబడు. దీనివల్లఁ బ్రారబ్ధభవ సంచయంబులు నాశనంబగు. నవి నాశంబయిన ముక్తుండగు"నని యీ గ్రంథమందలి యష్టమ ప్రకరణమునను.

సీ॥ "ఈ మహాగ్రంథము నెవరైన గడముట్ట
వివరించి చూచియు విస్మయమున
ననయంబు తాపత్రయాభీల సంసార
భవభయంబులబాసి పరమమైన
నిత్య నిర్మల సత్య నిరుపమానందమై
తనరారు బ్రహ్మ సంధాములగుచు
పరమ సౌఖ్యంబును బాటించుచుందురు
రిందుకు సంశయం బింతలేదు

తే॥ అట్టివారల జూచి బ్రహ్మాది సురలు
వినతు లొనరింతు రాత్మ సంవేద్యులనుచు
గాన నీకథ మోక్షైక కారణంబ
పరమసుఖ లాభహేతు సంప్రాప్తమగుట ॥

అని గ్రంథాంతమున ఈ గ్రంథ విశిష్టత గ్రంథకర్తచేతనే తెలుపబడినది. దీనికి మూలగ్రంథకర్తయగు ముకుందమౌనియొక్క రచనోద్దేశ మష్టమ ప్రకరణమున నిట్లు తెలుపబడినది. (పద్యములు 53, 48)

సీ॥ నయమైన శృంగార నవరస కావ్యముల్। పఠికింప వాగ్వివాదంబములెకాని
యాత్మ లాభంబు లేదటుగాక నెఱుక సం। తులుగాని యెల్లరు తెలిసి చూడ
నా కావ్యములు సార్థమని చూచువారికి। పరమార్థమైన సంపదలు మిగుల
దూరమైయుండును వారల కిలనెటు। వలెనన్న చండాల వాటియందు

తే॥ సొరిది మధురాన్నమైన శిష్టులు భుజింప
నొల్లరటు గాన తత్కథలెల్ల ప్రకృతి
జనులకె కాక పరమార్థ సాధకులకు
హితవు పుట్టదు తుచ్ఛ వైకృతులు నగుట ॥

సీ॥ ఇతర భాషలచేత నెలమిజెప్పిన వృద్ధ
బాలురకిది తేటపడ దటంచు
పనిబూని యిది యాంధ్రభాష రచించెను
వలనొప్ప నుపనిషత్ వాక్యసరణి ॥

పై పద్యమువలన శృంగారాది రసమయ కావ్యములు పరమార్థ లాభదూరములు గావునను బాలురకు వృద్ధులకుతత్త్వబోధ యగుట కాంధ్రభాష యనుకూలము గావునను ఈ గ్రంథము రచింపబడినట్లు స్పష్టమగుచున్నది. ముకుందమౌని రచనోద్దేశమును కొండనార్యుడును సఫల మగునట్లు చేసినాడని చెప్పవచ్చును. ఇందలి శైలి ద్రాక్షాపాకమున చక్కని ధారగలిగి చాలవరకు లాక్షణికమైన భాషతో నొప్పుచున్నది. అచ్చటచ్చట 'నేగామయని', "నీవు ఎంత పర్యంతము", 'లేదు యచట' "భేదంబు అచటలేదు" మొదలగు ఉత్వవిసంధులును ఒండు రెండు తావుల "ఘన యవస్థాత్రయ" "సుషుప్తని" వంటి సంధిదోషములును "జీవుల న్నెంతయు" వంటి ద్రుతముపై ద్రుతప్రయోగములును "భేదమున్ సత్యమనే జనముల మాటలువంటి వ్యవహారిక భాషాప్రయోగములును మాత్రము కనిపించుచున్నవి.

సీ॥ నిర్ణయంబుగ ద్వాసుపర్ణ సంయోజ్యశా
ఖాయామ్మటంచును కరముదనర
శ్రుతిజెప్పు భేదోక్తి................"

యనుచోటను, తత్త్వమస్యాది మహావాక్యబోధ చేయు ఘట్టమునను, ఉపనిషద్వాక్యములు యథాతథముగ పద్యములందు చక్కగా నమర్చబడినవి.

సుమారు వేయి పద్యములు గల యీ గ్రంథమందలి విషయము కేవల వేదాంతమైనను రచనలో ప్రసన్నతవలన చదువరులకు విసుగు జనింపదు.

ఈ గ్రంథ మాంధ్ర సారస్వతమున గల యుత్తమశ్రేణికి చెందిన యద్వైత శాస్త్ర కావ్యములలో చేర్చదగియున్నది.

# వివేకసింధువు (ద్విపద)

## కర్త దేవరకొండ వేంకటకవి

ఈ గ్రంథ మముద్రితము. దీని తాళపత్ర లిఖితప్రతి యొకటి కాకినాడలో ఆంధ్ర సాహిత్యపరిషద్గ్రంథాలయమునను్నది. గ్రంథపాతములువిశేషముగనున్నవి.

ఈ గ్రంథకర్త దేవరకొండ వేంకటకవి. ఇతని తండ్రి శివరామయ్య, తాత లక్ష్మయసూరి. ఇతడాశ్వలాయన శాఖకు చెందినవాడు. జమదగ్ని యావత్సస

గోత్రుడు. ఇతనికాలమును నిర్ణయించుట కాధారములు లభింపలేదు. ఇతనికి ఖేచరీ ముద్రనునేర్పి జ్ఞానోపదేశము చేసినవాడు సుబ్రహ్మణ్య గురుడు. గ్రంథావతారికలో-

ద్వి॥ "కోర్కెలిచ్చే నూతలకోన కెల్లందు। ధర్మసౌధాంతర భద్రపీఠమున। సిరులొందు శ్రీనరసింహానిపేర। పరగనందముగాగ ప్రకటింతుమహిమ॥" నని యుండుటచే నిది 'నూతలకోన' గ్రామములోని నరసింహస్వామి కంకితము చేయ బడినట్లు తెలియుచున్నది.

ముకుందముని యాంధ్రభాషలో వచనకావ్యముగ రచించిన వివేకసింధువును తాము ద్విపద కావ్యముగ రచింపబూనినట్లు కవి తెలిపెను. కాని యీ ద్విపద కావ్య మాదినుండి యంతమువరకు వేగినాటి కొండనార్యుని 'వివేకసింధువు' పద్య కావ్యము ననుసరించి రచింపబడినట్లు భావించుట కీ క్రింది యాధారములు కనిపించు చున్నవి.

గ్రంథారంభము :- వేగినాటి కొండన రచించిన పద్యము.

సీ॥ శ్రీకైవల్యరమా కటాక్ష విలసచ్ఛృంగార భావప్రసూ
నాకీర్ణాంఘ్రి సరోజుడై తదను భూత్యానంద సంధాన స
త్పేకానందలసచ్చిదాహ్వాయ వధూసేవారతిం జొక్కువి
ద్యాకల్పోచ్చ్రితుడైన మద్గురుని దత్తాత్రేయునిం గొల్చెదన్॥

గ్రంథారంభము :— శ్రీకర కైవల్య శ్రీరమా రమణి(వి)। లో కనశృంగార (ద్విపద) రుచిర ప్రసూన। కలితాంఘ్రి యుగళతద్ఘన సదానంద। సలలిత సంధాన సకుతూహలమున। చెలగుచు చిద్వధూసేవాభిరతుల। కలరుచు విద్యా ప్రకల్పోన్న తత్వ। మయుని దత్తాత్రేయు మహనీయుదలకు॥

పిదప శ్రీరామస్తుతి, గురుస్తుతి, లక్ష్మీనారాయణులకు, గౌరీశంకరులకు, శారదా పంకజాసనులకు, గణనాథునకు నమస్కారము. సంస్కృతాంధ్ర కవిస్మర ణము—ఇవియన్నియు పద్యకావ్యమునను ద్విపదకావ్యమునను నొకేవరుసలో నొకేవిధముగా నున్నవి. తరువాత పద్యకావ్యమున.

తే॥ "ఆంధ్ర కవితా చమత్కృతినాగ మాంత
సరణి గృతి సేయదలచితి సభికులెంచ" ॥

అని యుండగా ద్విపదలో తదనుసారముగనే "గురుతరాంధ్రము చమ త్కృతి నాగమాంత। సరణి సత్కృతి జేతు సభికు లెన్నగను" అని యున్నది.

పద్యకావ్యము దత్తాత్రేయాంకితము. [illegible] ంకితము. ఐనను పద్యకావ్యమందలి షష్ఠ్యంతములు [illegible] ద్విపదలో కూర్చబడినది.

ఉదా :- పద్యకావ్యమున షష్ఠ్యంతము [illegible]

కం॥ వృత్తి జయోద్దామునకు [illegible]
స్సత్తమ చారిత్రునకున్ [illegible] హృదయునకున్ ॥

మ॥ అంకితంబుగా నా [illegible]
మహాప్రబంధమునకు కథాక్రమం [illegible]........

ద్విపద - వరదుడ క్రిందివిస్ఫూర్తి [illegible] సత్తామాత్ర మహిత। సామర్థ్యనకు సర్వ [illegible] దత్తాత్రేయుడాది। యగు మహసీయ దివ్యావతారములు [illegible] పాలించి। చిరకీర్తి జగతిపై చెన్నలరార। కోర్కె [illegible] భక్తసాధాంతర భద్రపీఠ మున। సిరులందు శ్రీనరసింహానికేల। పరగనంతముగాగ ప్రకటింతు మహిమ। వెలయంగ జగతి వివేక సింధువను। సలలితాగమ సారసంగ్రహంబగుచు। భవ్య సిద్ధాంతమై భాసిలుచున్న। కావ్యంబునకు కథాక్రమమెట్టిదన్న॥

ఇట్లు పద్యకావ్యము నందలి షష్ఠ్యంతముల భావమునుకూడ ద్విపదలో చెప్పి పిదప తనకృతి నాథుడగు శ్రీ నరసింహాని విషయమును తెలిపెను. ప్రత్యాశ్వా సారంభమునకు పద్య కావ్యమునసున్నట్లు దత్తాత్రేయ స్తుతియు, పిదప నర సింహ స్తుతియు, ద్విపదలో నున్నవి. ఉదా :- ఐదవ ఆశ్వాసారంభము:- (పద్యకావ్యమున) :

కం॥ శ్రీలలిత యోగవిద్యా। లోలవివేకాలవాల లోకస్తుత సం
శీలా! యనసూయాసూన! సద్భాలా! సజ్జన విధేయ దత్తాత్రేయా॥

తే॥ అవధరింపుము సకల శాస్త్రార్థతత్త్వ! వేదియైనట్టి శ్రీగురుండాదరమున
నిజపదాంబుజ సద్భక్తి నివ్వటిల్లు! నట్టి శిష్యునితో నిట్టులానతిచ్చె॥

కథారంభము:- పద్యము :

సీ॥ ఘనతర విజ్ఞాన ఘనబలస్ఫురణచే। సిద్ధ సంకల్పుడై వెలగువాడు
రమణీయ యోగ ధర్మక్రియాభరణభూ। షితుడయి వేడ్కతో బొదలువాడు
ననుపమరాజయోగానంద రాజ్యాభి షిక్తుడై రిపుల శిక్షించువాడు
అనయంబు యోగబోధాంగనా సంసేవ్య। మానుడై మహిమల మనుపు
వాడు :

తే॥ మహిత వేదాంత పీఠుల మలయువాడు
శిష్యజనముల ముక్తులజేయువాడు
నిత్యసమదర్శసుండునై నెగడువాడు ॥
ప్రణవకారణమూర్తి కారణగురుండు ॥

ద్విపద :– ఘనతర విజ్ఞాన కలితవిస్ఫురణ । మున సిద్ధ సంకల్ప మొన రెడువాడు । మహనీయ యోగ ధర్మక్రియాభరణ । బహుభూషణముల నింపొందెడు వాడు। అనుపమ రాజయోగానంద రాజ్య।మున కభిషిక్తుడై ముదమంది శత్రు । లనుదోలి సద్భక్తులను బ్రోచువాడు। దనరంగ యోగ బోధాంగనా సేవ్య। మాను దైన మహిమల మనుపుచునుడు। వీనులకింపుగా వేదాంత నగర। వీథులం దెవ్వేళ వెలిగెడువాడు। సాధుశిష్యులముక్తి సమకూర్చు నిత్య। సమదర్శన నిపుణ పత్త్ర కాళుండు। క్రమమొప్ప నోంకార కారణ మూర్తి । కరుణా సముద్రుండు కారణ గురుడు॥

గ్రంథాంతమున ఫలశ్రుతి :– పద్యకావ్యమున :

తే॥ కాన నీకథమోక్షైక కారణంబు
పరమసుఖలాభహేతు సంప్రాప్తమగుట॥ 30

కం॥ కావునవివేక సింధువు। నై వెలసిన యీ ప్రబంధమతి భక్తిని సం
భావించి తెలిసిరేనియు । జీవన్ముక్తులయి ధాత్రిఁజెలగుదు రెపుడున్॥ 31

కం॥ అనుచు ముకుంద మునీంద్రుడు । ఘనముగ లోకోపకార
కార్యార్థంబై తెనుగించెను వేదాంతము
ననుపమ సువివేక సింధువను పేరు బ్రొదగన్॥ 32

ద్విపద॥............కానయిట్టి। ఘనకథన్............మోక్ష కారణంబగుట। పరిమలాభము సుఖప్రదహేతువౌచు। సిరులునొంద వివేకసింధువై వెలయు।ఇల నీ ప్రబంధంబు నెవరైన భక్తి । వలనొప్ప దెలిసి యావాద్విశిష్టంబు తెలిసి జీవ న్ముక్తి తేజరిల్లుదురు। విలసిత సంతోషవిభవులై యపుడు। అని ముకుంద మునీంద్రు డఖిలోపకార। మనగాను తెనిగించె నమర వేదాస్త। విలసనంబయ్యు వివేకసింధు వన। వెలయును పేరు యీ విశ్వంబులోన॥

ఇట్లు ద్విపదకావ్యము వేగినాటి కొండనార్యుని పద్యకావ్యమునకు రూపాం తరమేయని స్పష్టమగుచున్నది. ఇట్లు రూపాంతరీక రించుటకంటె విశేషముగ

కవియొక్క గ్రంథము ముద్రింపబడినట్లు గోచరించదు. [illegible] [illegible] లేదు.
భాష, శైలి, శయ్య, పాకము మొదలగునవన్నియు పద్యకావ్యములో సమాన
మనియే చెప్పవలయున్నవి. కొండనయు, వేంకటకవియు (ఇద్దరును) ముకుంద
ముని యొక్క తెలుగు వచనము ననుసరించి వ్రాసినట్లు చెప్పుటకేని యుండరి
సమాన లక్షణములు ముకుందముని యొక్క తెలుగు వచనము లోనివేయైనచో
వేంకటకవి కొండన ననుసరించి నాడనెడి భావము విడువవచ్చును. దీనిని గూర్చిన
చర్చ కొండన రచనలో చేయబడినది. పద్యకావ్య మత్తప్రక్రియకి చెందిన తత్త్వ
కావ్యములలో చేర్చదగినట్లుండుటచేత నీ ద్విపద తత్త్వకావ్యములలో చేర్చదగినదని
చెప్పవచ్చును.

—o—

# జీవబ్రహ్మైక్యసార మంజరి

## (ద్విపద)

### గ్రంథకర్త : ప్రతాప వేంకటేశ్వర కవి

వీరీ శతాబ్దమువారు. కృష్ణామండలమువారు. ఈ గ్రంథము బెజవాడలో వాణీ ముద్రాక్షరశాలయందు 1928 సం॥లో ముద్రితమైనది.

ఇందలి విషయము కడపజిల్లా గడికోట ఆశ్రమవాసులగు శ్రీ పరమహంస సచ్చిదానంద యోగీశ్వరుల వారిచే రచింపబడిన "జీవబ్రహ్మైక్య వేదాంత రహస్య" మను తమిళ గ్రంథమున కాంధ్రాను వాదమైన 'జీవ బ్రహ్మైక్యరాజయోగసారా మృత'మను గ్రంథమందలి విషయమున కతి సంగ్రహరూపము. శ్రీ సచ్చిదానంద యోగీశ్వరులు ప్రాణాయామాభ్యాసముద్వారా మనస్సును నిరోధించి తద్ద్వారా జీవ బ్రహ్మైక్యసాధన చేసినవారు. వారి యనుభవముల ననేకముగా వారు తమ గ్రంథము నందు వివరించి యున్నారు. వారి బోధలుకూడ కొన్ని అందు చేర్చబడి యున్నవి. ఆ గ్రంథమందలి కొన్ని యంశముల సారమును శ్రీ ప్రతాప వేంకటేశ్వర కవిగారు మంజరీ ద్విపదరూపములో రచించి ప్రకటించిరి. శ్రీ వేంకటేశ్వరకవిగారి కవిత్వము, సరళమై, సుబోధమై, ద్రాక్షాపాకమునన్నది.

విషయ సంగ్రహము :- ప్రారంభమున శ్రీ స్వాములవారు 108 రోజులు యోగసమాధిలోనుండి నపుడు పొందిన అనుభవము వివరించబడినది. ఆ కాలమున

వారి మనస్సొక అనిర్వచనీయమైన యానందానుభూతి నొందినది. అప్పుడు నోట మాటగాని, ఇంద్రియచలనముగాని, విషయాను రక్తిగాని లేక మనస్సు ఏకాంత స్థితివే కోరుచుండెను.

"దీనికి హేతువు తెలియంగ గాదు। ఆనందమును వీడుటాత్మ యొప్పమి దె! అట్టియానందమ్మలా యోగబలమె। గట్టిగా మూలంబుగా నమ్మవచ్చు। యోగబల మ్మును నూనినవాడు। బాగుగా చిత్తంబు బంధింపజాలి। అనితర సాధ్యమౌ ఆనంద మెపుడు। తనకు తానేజెందీ తన్మయుండగును॥ ఆ సుఖంబింతని యలివియే పల్క॥"

వారి యనుభవమును బట్టి వారిట్లు బోధించుచుండిరి. "మనసు బంధించి బ్రహ్మానంద సుఖము। నొందంగవలెనన్న యోగసాధనమె। పొందుగా గావింప బోలును సతము। మనశాస్త్రములయందు మన పెద్దలెల్ల। అనుభవించియె వ్రాసిరమి తమ్ముగాను?........"శ్రీకృష్ణ పరమాత్మ చెప్పెను గీత।"

పిదప శ్రీస్వాములవారి జీవితాంశములగు విద్యాభ్యాసము. వారి పూర్వజన్మ చరిత్రము, అటుపై మృగములు, స్త్రీపురుష రూపమును బొందు రహస్యము, కామ క్రోధాది దశగుణములు (దంభ, దర్ప, ఈర్ష్యాసూయలతో) శరీరములోనుండు దశవిధ వాయువులు, సప్త చక్రములందు శ్వాస నడచుచుండుట, ప్రాణాయామము, దశ విధనాదములు, అను శీర్షికలతో విషయములు సంగ్రహముగ తెలుపబడినవి.

"శ్రీరంగనాథుడే శ్రీ రమేశుండు। ఐదు వాయువులనే ఐదు శిరముల। దౌద ర్వికరముగ అమరించి దాని। పొగరు సర్పమ్మును పొలియింపజేసి। తగశాంతము వహించి దాని శిరముల। బాగైన శయ్యగా వరలంగజేసి। యోగనిద్రను పొందుచు న్నాడు గనుడు। అదియె శ్రీరంగపు అంతరార్థమ్ము। ఇదియెగాకుండను-నీ దేవళ మున। కంతరార్థము కద్దు అద్దాని వినుడు। ఎంతేని ముఖ్యార్థమిందులోనినుడె। ఆరు చక్రమ్ములే యారు ప్రహరులు। మరియు సహస్రారమను సప్తచక్ర। మరయగా మనలోనె యలరుచుండునగ!"

అదియె బ్రహ్మకపాలము. అందు పరమాత్మ వెలుగుచుండును. అతడే మూల విరాట్టు శ్రీరంగనాథుడు.

పిదప శ్రీమన్నారాయణుని నాభియందు బ్రహ్మదేవుడుద్భవించుట యననేమో వివరింపబడినది.

"జీవి యేదైనను క్షితిపై జన్మ। నావిర్భవంబంద నరయుంగ మనసె। కార ణమై యొప్పుగాదె తలంప। ఎవదైన సుగుణంపు సితలంపులను। గనిపసునాశమ్ము గావింపనేర్చు। అరచేత మోక్షమ్మునందు సుమ్మతను॥

సమస్కార్థ మిట్లు తెలుపబడినది :-

కరముల రెంటిని కలుపఁభావమ్ము।....... ....॥ జీవాత్మ పరమాత్మ జేర్చు మంచనెడి। భావమ్ము జూపుచే బాహువుల్ గార్చు।

తరువాత "సోహం" మంత్రరహస్యార్థము వివరింపబడినది.

అలరు యోగముకన్న నధికమ్మునగుచు। పొలుపారు జ్ఞానమ్ము పొందగావల యు। జరుగనిచో నిట్లు జగదీశ్వరుండు। గురురూపమునవచ్చి కూరిమితోడ। జ్ఞానోప దేశమ్ము నలుపగావలయు।............1 ఎరుకయిండుకగల్గ నెల్ల కార్యముల। నమ లుడై పరమేశ్వరార్పణ మంచు। భ్రమవీడి సల్పిన క్రమముగా నూయు। హరియింప సంచితమంది యంతరించి। పరమార్థ వస్తువు బదయంగజాలి। పరయోగియై కర్మ బంధమ్ముపీడి। నిరుపమ బ్రహ్మమై నిల్చునుకడకు॥

ఇందలిభాష సలక్షణము, సరసము నై సర్వజన సుబోధమై యున్నది. యోగ జ్ఞానములనుగూర్చి తెలియగోరు సాధారణ జనులెల్లరకు నిది యుపయోగకారిగా నుండు గ్రంథము.

....(౦)....

# శ్రీ రామకృష్ణ పరమహంస చరిత్రము

కర్త :- కూచి నరసింహము

శ్రీరామకృష్ణ పరమహంసయొక్క సంగ్రహ చరిత్రను, ఉపదేశములను పద్యకావ్యముగ రచించినవారు శ్రీ కూచి నరసింహము పంతులుగారు. వీరు చాల కాలము పిఠాపురమున ఉన్నత పాఠశాలా ప్రధానోపాధ్యాయులుగా పనిచేసిరి. ఉపా ధ్యాయులలో నింత చండశాసనుడుండడన్న ప్రసిద్ధి వీరికి గలదు. వీ రనసత్యులగు టచే విద్యార్థులనే పుత్రులవలె నాదరించి వారి యభివృద్ధి కెన్నోవిధముల పాటు బడుచుండెడివారు. వీరి శిష్యులలో పలువురిపు డుత్తమ పదవులలోనున్నారు.

వీరి జన్మస్థానము కృష్ణాజిల్లాలోని కైకరంపేనపల్లి, జననకాలము 1866వ సంవత్సరము. వీరు 1940 సం॥లో పరమపదించిరి. వీరితల్లి పుల్లమాంబ. తండ్రి వెంకనార్యుడు.

వీరు 1920 సం॥ నుండి 193 వరకు 'సూర్యారాయాంధ్ర నిఘంటువు' కార్యాలయమున పండితులుగా నుండి యమూల్యమైన కృషి చేసిరి. వీరి కవితా గురువులు కందుకూరి వీరేశలింగముగారు. వీరి రచనలలో ముఖ్యమైనవి (1) గౌరాంగ చరిత్ర, (2) వనవాసి, (3) గ్రాంథికభాష గ్రామ్యభాష, (4) రామకృష్ణ పరమహంస చరిత్రము, (5) ఆత్మనివేదనము, (6) వివేకానందస్వామి పౌరాణికోపన్యాస చతుష్కము, (7) భ్రమప్రమాద ప్రహసనము, (8) రూపలత, (9) ఆదర్శ సుఖజీవనము మొదలగునవి.

పిఠాపుర సంస్థానాశ్రయమువలన వీరికి కవులలో పెద్దపేరు వచ్చినది. పిఠాపుర సంస్థానమున నుండిన సింహత్రయములో వీరొకరు. మిగిలిన యిరువురు పానుగంటి లక్ష్మీనరసింహరావు, చిలకమర్తి లక్ష్మీనరసింహము గారలు.

వీరు గొప్ప రామభక్తులు - వీరి గ్రంథము లన్నియు రామాంకితములే. వీరి యభిమాన విషయము వేదాంతము. వీరి శ్రీరామకృష్ణ పరమహంస చరిత్రము 1904 సంవత్సరములో ఆవిష్కరింపబడినది. ఈ కావ్యమున వీరు కవిత్వమును గూర్చి తమ యభిప్రాయము నిట్లు వెల్లడించిరి—

సీ॥ మాణిక్య మకుటంబు మౌళిపై
దులకింపరాజ్యంబు నేలెడు రాజుకంటె
లలిత లావణ్య విలాసినీ వక్షోజ
పరిరంభ సౌఖ్యానుభవుని కంటె
సతతంబు నానంద సారాబ్ధిలో దోగు
ధర్మ హర్మ్యస్థ సంపన్ను కంటె
ధన వయోరూప సంతానాది భా
గ్యాళి దనియు సంతుష్టుడౌ ధన్యుకంటె
గీ॥ మధుర మృదువాక్య సంపద మనసు గరచు
కవిత యబ్బిన కవియె యెక్కువ యటంచు
నెంచెదరు గాన తత్సుఖమెంత సుఖమొ
స్వానుభవమున గనుగొన బూన వలదె॥

శ్రీరామకృష్ణ పరమహంస యద్వైత తత్త్వనిష్ఠుడగుటచే నాయన జీవిత చరిత్రమునను బోధల యందును అద్వైత తత్త్వప్రసక్తి పలుతావుల గోచరించును. తన యొద్ద నుండుకొన్న యగ్నిహోత్రమున చుట్టనంటించుకొన్న యొక్క పామరునిపై కోపగించుచున్న తోతాపురితో నాయనిట్లనెను.

గీ॥ నిర్వికల్ప సమాధుల నీడ నేను
ప్రవిమల జ్ఞానమది నీకు పట్టుకొన్న
సర్మమును బ్రహ్మమేయని చాటు నీకు
గూడునే యిట్టి చేష్టలు గురువరేణ్య॥

నిర్వికల్ప స్థితి లభించిన పిదప నింక కాళిపై భక్తి యేలయని తోతాపురి యడుగగా పరమహంస యిట్లు బదులు చెప్పెను.

సీ॥ మన యహంకారంబు మడిగిన పూర్తిగా। పరమాత్మ తత్త్వంబు బయలు
పడును. జీవ సంబంధమే చేతస్సు గావున। నాత్మేశ్వరులకు నైక్యంబుగాన
పరమాత్మ గాంచెడు వారికిలేదెందు। నీవు నేనను భేదమింపుకయును.
వాగతీతుండైన పరమాత్మ దర్శింప। మనసును బట్టి చంపంగవలయు॥

గీ॥ నింతపైన నహంభావ వృత్తిగలుగ
దా మనోలయ దక్షత దాల్పలేడు
మనము జొచ్చిపుచ్చు కున్ననే మానవుండు
నాత్మ యీశుండు నొక్కటే యనుచు గనడు॥

కం॥ మనలో జీవులు పరమా। త్మను బట్టిన ఛాయపోట మాతగ రాశిన్
మనమున దలచెద, నాయమ। యును పరమాత్మయును చూడ నొక్కటియౌటన్॥

కం॥ పరమాత్ముడు శ్రీకృష్ణుడు। తరుణులు గొల్లలలు జీవపలి యవ్వారల్
వారసిన విరహం బంతయు। పరమేశుని జీప్పపొందరాను కష్టంబుల్॥

పరమహంస యొక్క యద్వైత తత్త్వము ననస్థితిని గూర్చి యిట్లు తెలుపబడినది.

అ.వె॥ క్రీస్తులోని యాత్మ కృష్ణుని యాత్మయు
బుద్ధునాత్మ కుటిల పురుషునాత్మ
తనదు నాత్మయన్నిగన నొక్కటియె యంచు
శిష్యులకు నతండు సెప్పుచుండు॥

పరమహంస బోధలనుండి యద్వైత తత్త్వసంబంధులైన కొన్ని పద్యము లుదాహరింప బడుచున్నవి :-

ఉ॥ వారి వికార బుద్బుదము వాలిక సత్యము గాగ జోచి య
వ్వారి నడంగు మాడ్కి క్షణభంగురకాయము బరతంత్రమౌచు వి
స్ఫార పరేశతత్త్వ సద్మకంబగు జీవపదార్థ మాత్మగం
భీర పయోధి లీనమయి పించి యభేదము నాటునెల్లెడన్॥

మాయాతత్త్వము :-

కం॥ ......................వె
వ్వరు మాయాతత్త్వ మెడుగ నలతు లగుదురో
యెరిగిన వెంటనె పరువిడి
యదు గుంజామి మాయ: వారి నంటక భీతిన్॥

ఆ.వె॥ మనుజాగను మెఱంగు మాయనై జముచక్క
నెరిగితేని యుద్ది విరిసిపోవు
పొంచిదాగువాంగ గొదగాంచు వెంటనే
వరుగులిడదె కనుల బడక సిగ్గు॥

కం॥ మాయామాతయు భక్తున। కే యాపద సేయకుండ నెలమి నొసంగున్
రాయిడి పెట్టును [illegible] దవనీ స్థలిపై॥

బద్ధపురుషులు, ముక్త పురుషులు :—

సీ॥...................యుత్తమ భక్తుని జీవాత్మ బట్టిలాగి
పరమాత్మ యానరవరు మనంబును బొరి। గొనుచు నహంభావమును నడంచి॥

ఆ.వె॥ ఈశ్వరుండు జీవుడేకమే యనుమాట
యనుభవమున సత్యమనుచు దెలిపి
సచ్చిదాత్మమై యెసంగెడు తనలోన
జీవురూపు మాపి చేర్చుకొనును.

ద్వి॥ జ్ఞానియై కాని యజ్ఞానియై కాని। ధ్యానంబు సేయ ముక్తాత్ముడౌ నరుడు॥

ముముక్షుత్వము :-

కం॥ జ్ఞానం బేకత్వము న। జ్ఞాన మనేకత్వమోలి గరపుచు నుండున్
గాన, ముముక్షువు బ్రహ్మ। జ్ఞానము బడయంగ గృషిని సల్పగవలయున్॥

వివిధ విషయములు :-

సీ॥ జీవాత్మ బిరికించి 'నీవు-నే' ననువాక్య
భావంబు గ్రహియించు వాడె యెఱుగు
బ్రహ్మతత్త్వంబు; దూరంబుగా బిరికించి
నను గాని "నాయిల్లు నాదు పొంది
నాదు సంసారబు" నాయహంభావంబు
పోదది, విజ్ఞానమునను బడుగు
ఉల్లిపై పొరల నొక్కొక్కటిగా
దీయగా దుదకు [illegible]

గీ॥ దీ గతినె, దుల్బద్వేషంబు [illegible]
'నే' ననెడు భావమే నశియించిపోవు
పూర్ణ తత్త్వజ్ఞునకు నిత్యపూర్ణమైన
బ్రహ్మ మొక్కండె దృష్టిగొన్పట్టు నెపుడు॥

ద్వి॥ ఎప్పుడహంభావ మెరుకను బుచ్చు। నప్పుడు కైవల్యమందంగ గలము॥
ఆ॥వె॥ తనదు గురువు నిష్టదైవంబు నూతగా జేసికొనుచు శుద్ధ చిత్తమునను
ధ్యాన నిష్ఠనుండు నత డతిసులభంబు। గాను ముక్తి నెంచ గలడు నుండి॥
ద్వి॥ నిర్మల జ్ఞానంబు నిశ్చలభక్తి। మర్మంబెఱుగ నొక్క మాడ్కినేయుండు॥
ఆ॥వె॥ బ్రహ్మమేనె యనియొ, బ్రహ్మమయంబు స
ర్వ ప్రపంచమనియొ; బ్రహ్మమునకు
నేను లెంక ననియొ; యూమూట నేనిచే
నైన నరుడు ముక్తి బొందవచ్చు॥

ఆ॥వె॥ గురువు దైవమంచు వరయక సాధార। ణ నరుండంచు నెంచు మనుజుడెపుడు
మోక్ష మించుకైన బొరయడు గావున। దైవమాతడంచు దలపవలయు॥

గీ॥ ముందు దేశికు దైవ మన్బుద్ధిచేత।
జూచుచుండిన, నాతండు నూపు దేవు
నపుడు శిష్యుండు విస్మయంబంది గాంచు
తాను, దైవంబు గురు దేకతత్త్వమనుచు ॥

కం. మొదటి పని చే[illegible] పిదపది విశ్రాంతి బుద్ధి విహితం బనుచున్
మదినెంచు; [illegible] నెపహాంతిం [illegible] యుండ దెప్పుడు నీకున్॥

గీ॥ మాయవలలో [illegible] బడుచు నిక్క-
యుల విపేకంబు [illegible] మనెడు వాని
మూలమున వాని [illegible] రా జాలి తుదకు
బ్రహ్మతేజంబు [illegible] వలతి యగును॥

ఇందలి రచన రామకృష్ణ పరమహంస యొక్క జీవితమువలె నిరాడంబరముగను, భావపూర్ణముగను, ఆయనబోధలవలె సుబోధముగను, సూటిగ హృదయమునకు హత్తుకొనునదిగను, నున్నది. వ్యర్థ పదములుగాని, కఠినపదములు గాని ఎచ్చటను కానరావు. గహనమైన తాత్త్విక భావముల నరటిపండొలిచి చేతబెట్టినట్లుగా, భాషా జ్ఞాన మల్పముగా గలవారికైనను ఆస్వాద యోగ్యమగునట్లున్న యీ శైలి శ్రీరామకృష్ణుని జీవిత చరిత్రకును బోధలకును మిక్కిలి యనుగుణమై యున్నది. ఎన్నిమాటలు చదివినను విసుగు జనింపనీయని ప్రసన్నత శ్రీరామకృష్ణ బోధలలో వలె నీ రచనలో కూడ ననుభవనీయమై యున్నది. గ్రంథాదియందు కవిత్వమును గూర్చి కవి వెల్లడించిన భావముల యనుభవ మీ గ్రంథమునం దంతటను గోచరించును. ఇందు మొత్తము సుమారుగా నాలుపందల పద్యములున్నవి. ఇది యద్వైత తత్త్వకావ్య వనమున మరుగున బడియున్న యొక చందనవృక్షము.

## పరమహంస భాగవతము

రచయిత :- శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

ఇది శ్రీరామకృష్ణ పరమహంస యొక్క సంగ్రహ చరిత్ర. సరళమైన పద్యకావ్యము. పరమహంస యొక్క జీవితకథ ప్రధానముగా రచింపబడినది. పరమహంస బోధించిన కథలనుగూడ వీరు ప్రత్యేక పద్యకావ్యముగ రచించి, సంస్కృతమున ననువదించిరి.

## వివేకానందము

రచయిత :- శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

ఇది వివేకానందస్వామి యొక్క జీవితచరిత్ర- సుమారు 800 పద్యములు. గ్రంథకర్త చేతనే స్వయముగా సంస్కృత పద్యకావ్యముగా అనువదింపబడినది.

ఇదియును పరమహంస భాగవతమువలెనే జీవితకథా ప్రధానముగనే రచింపబడినది. కాని, చిరంతనానందస్వామి యొక్క వచన రచన కనుసరణ మగుటచేత పరమ హంస చరిత్రకంటె వివరముగా నున్నది.

శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు సంస్కృతాంధ్ర భాషల యందు విద్వత్కవులుగా ప్రసిద్ధులు. సాహిత్య వ్యాకరణ శాస్త్రములలో ఉద్దండ పండితులు. వీరి "తత్సమ చంద్రిక" "ఆంధ్ర పాణినీయ"మని సుప్రసిద్ధ వ్యాకరణ శాస్త్రపండితులైన శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిచే ప్రశంసింపబడినది. ఆంధ్రభాష యున్నంతకాలము చిరస్థాయిగా నుండగల గ్రంథము "విద్వాన్" పరీ క్షకు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడినది. వీరి "కావ్యాలంకార సంగ్రహ వివర ణము" అలంకారశాస్త్ర సర్వస్వ మనదగినది. ఎం.ఏ, పరీక్షకు పాఠ్య గ్రంథముగా నిర్ణీతమైనది. విద్యార్థులు స్వయంకృషితో సాహిత్య - వ్యాకరణశాస్త్ర గ్రంథము లను చదువుకొనుట కవకాశము కలిగించుటయే ఈ రచన చేయుటలో వీరి ముఖ్యో ద్దేశము. వీరి ఆంధ్ర పద్యకావ్యములలో జాతక కథా గుచ్ఛము (బుద్ధుని పూర్వ జన్మ చరిత్రలు) వివేకానందము, (వివేకానంద జీవిత చరిత్రము) పరమహంస భాగవతము (శ్రీ రామకృష్ణ పరమహంస జీవితచరిత్ర సంగ్రహము) శాలివాహన గాథా సప్తశతి, ఖడ్గతిక్కన, కీరసందేశము, మొదలగునవి సుప్రసిద్ధములు.

వీరి సంస్కృత రచనలో, మనుచరిత్రమ్, కళాపూర్ణకథా, వివేకానందమ్, ఆంధ్ర భాగవతానువాదః (పోతన భాగవత రచనలోని విశిష్టతను ప్రకటించు కొన్ని ఘట్టములకు సంస్కృతీకరణము) కడు ప్రసిద్ధి కెక్కినవి.

వీరి తెలుగు పద్యరచనలన్నియు వీరిచేతనే సంస్కృత పద్య కావ్యము లుగా అనువదింపబడినవి. మొత్తము సుమారు ఏబది కావ్యములున్నవి.

# రామగీత

## రచయిత :— శ్రీ కేశవతీర్థ స్వామి

ఇది యద్వైత తత్వానుభూతిలో ఆనంద పరవశుడైన శ్రీరామతీర్థస్వామి రచించిన కొన్ని గేయముల కాంధ్రానువాదము. దీనిని రచించినవారు శ్రీ కేశవతీర్థ స్వామి. వీరు గుంటూరుజిల్లా "పిడుగురాళ్ళ"లో గల రామతీర్థ వేదాశ్రమాధిపతులు.

మట్టుపల్లిలో వెలసిన శ్రీ నరసింహస్వామి యనుగ్రహమునకు పాత్రులై శ్రీరామ తీర్థ సేవాశ్రమమును నిర్వహించుచున్నారు. వీరు శ్రీరామతీర్థులవారి సంపూర్ణ వేదాంత వాఙ్మయమును (దివ్యసూక్తులను), జీవితచరిత్రను వచనమున రచించిరి. శ్రీ పూతల పట్టు శ్రీరాములురెడ్డిగారితో కలసి తులసీదాసుని "రామచరిత మానస మును" తెలుగు ద్విపదగా ననువదించిరి. శ్రీ లక్ష్మీనరసింహ స్తోత్రాదు లనేకముగా సంస్కృతమున రచించిరి వీరు 'రామదర్శన' మను అనుష్ఠాన వేదాంత ప్రబోధక మగు మాసపత్రికకు సంపాదకులుగా నుండిరి.

శ్రీ రామతీర్థస్వామి సహజకవి. కవిత్వ మాయనలో నుండి పొంగి పొర లుచూ అప్రయత్నముగా వెలువడెడిది. కవిత్వమునకును, వేదాంతమునకును చుక్కె దురని వాదించెడి వారికి వాకట్టు రామతీర్థుని కవిత్వము భావకవులు, దిగంబర కవులు, అభ్యుదయ కవులు, ప్రకృతి కవులు మొదలైన వారందరు రామతీర్థుని రచనలను నిశితముగా పరిశీలింపగలిగినచో ఆయన తమకు గురువుగా భావించు కొన దగినవా డనుకొనవలసి వచ్చును. మరి కొంచెము లోతుగా పోయినచో ఆయన శిష్యత్వమునకు తమకు యోగ్యత చాలదని గూడ గ్రహించ గలరు. 'సి. ఎఫ్. ఆండ్రూస్' వంటి ప్రఖ్యాత కవులు ఆయన కవిత్వములోని మహత్త్వమును కొంత వరకు తెలిసికొని జోహారులర్పించినారు. ఆయన కవిత్వము ఉద్రేకపూరితము కాదు. మనుష్యునకు, ప్రకృతికి మధ్య నిలచి ప్రకృతితో మనుష్యున కున్న సంబంధ మును నిరూపించుచు, మానవుడు తానాసంబంధము నెట్లెంతవర కనుభవమునను, ఆచరణమునను వ్యక్తముచేయ సాధ్యమగునో దానిని తేటమాటలలో స్పష్టముగా తెలుపు మహాకవి రామతీర్థస్వామి. అతడు వేదాంతికంటె ఎక్కువగా కవియే యని భావించువారున్నారు. తాత్త్వికముగా విచారించినచో వారిరువురకును భేదము లేదు. "కవిర్మనీషీ పరిభూస్స్వయం భూః" అని పరమాత్మ పరముగ చెప్పినది ఈశావా స్యోపనిషత్తు. స్వామిని "ప్రకృతి కవి" యని కొందరు భావించినను ఆయన కవి త్వము ఐంద్రియముకాదు. అది తరచుగా ఇంద్రియములను, మనస్సును అధిగ మించి అంతరాత్మయొక్క రాజ్యమున విహరించుచుండును. స్వామియొక్క కవి త్వము గద్య పద్యముల రెంటిలోను బాగుగా కనిపించును. వాస్తవమునకు ఆయన జీవితమంతయు నొక మహాకావ్యమే. అది మధురమైన ప్రేమను, శాశ్వత శాంతిని, నిరతిశయానందమును అనుపమ ధైర్య స్థైర్యములను నిబిడీకృతము చేసికొని ఆయనయొక్క సచ్చిదాత్మను ప్రదర్శించును. అయినను కొన్నిసమయములలో ఆయన

మసిలిపోవుచున్న నీటి ప్రవాహములను ప్రసరింపజేయును. అట్టి ప్రవాహములు కూడ పెద్దపెద్ద గండశిలలను గాక, తేజోవంతమైన రత్నములనే వెదజిమ్ము చుండును.

ఆయన రచించిన "అగ్నిప్రళయ" మను కావ్యము సుందర "ది ఛార్జ్ ఆఫ్ ది లైట్ బ్రిగేడ్" అను ఇంగ్లీషు ఖండకావ్యము, భయముతో శవాకారమై నిలచి పోవునని యొక ఆధునిక కవి తన యభిప్రాయమును వెలిబుచ్చినాడు. ఆయన కవిత్వము వేసవి కాలములో మనోహరమైన సాయంసమయమువలె నుండును. అప్పటి దృశ్యము యొక్క రేఖలకును, ఉదయ దృశ్య రేఖలకును భేదము లేదు. కాని తీక్ష్ణమైన మహాకాంతి గోళము తేజోవిహీనమగును. ఉత్తేజితమైన పుష్పములు పైకి వికసించును." అని డాక్టరు షైన్‌గారు వ్రాసినారు.

ఒకానొక అధునాతన కవి యన్నట్లు "రామతీర్థుడు కొన్ని సమయములలో కేవలమొక బోధకునివలె రచన చేయును. కాని కావ్యాత్మను మాత్ర మెప్పుడు చంపడు. అతని కవిత్వము మెట్ట వేదాంతముతోను, శుష్కనీతులతోను భ్రష్టముగా నుండదు. కాని అతి దీర్ఘమైన ఊహతోగాని, ఉద్రేకపూరితమైన భావములతో గాని నిండిపోయి కూడ నుండదు." అది సత్య శివ సుందరానంద మయమై యుండును.

ఆయన తన రచనలను చాలావరకు ఉర్దూ భాషలోను, కొన్ని పర్శ్యన్ భాషలోను, ఆంగ్లభాషలోను చేసినాడు. ఆయన రచనల వెనుక నున్న మహాసందేశము ప్రకృతి బంధవిముక్తి మార్గమును గురించినది, ఆత్మ స్వాతంత్ర్యమును గూర్చినదీ. ఆయన కొన్ని గేయములను సంగీతము ననుసంధించి పాడెడివాడట. "సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం, ఏక మాపాత మధురం అన్యదాలోచనామృత" మ్మనెడి సూక్తికి ఆయన కవిత్వగానము సరియైన దృష్టాంత మనవచ్చును.

ఈ రామగీతలో రామతీర్థస్వామియొక్క రచనల కొన్ని గేయ రూపమున ననువదింపబడియున్నవి. ఆయన రచనలలోని విశిష్టత కుంటువడకుండ ననువదించుటకు కనీసమంతటివాడైన కావలెను. ఆ సంప్రదాయానుసారులై అట్టి మార్గముననే చరించుచున్నవారు గావున శ్రీ కేశవ తీర్థస్వామి యీ పనికి పూనుకొనుట యుత్తమమైనదనవచ్చును.

ఈ గేయములలో రామతీర్థుల అద్వైత భావము, అనుభవము వ్యక్తము చేయ బడినవి. తాను సర్వవ్యాప్తిమైన విశ్వాత్మయనియు, సర్వము తానే యనియు కొన్ని చోట్ల నితడు బాహాటముగ ప్రకటించెను. ఉదాహరణ :-

ప్రేమ స్వరూపంబు లన్నియు నేనె। మాధుర్య హృదయంబు లన్నియు నేనె
బ్రతుకుచావులు రెండు పరికించి కంటి। అస్మదీయోచ్ఛ్వాస విశ్వాసమేను॥..॥
నేను సర్వవ్యాప్త వాసుదేవుడను। నే లేని నెలవేది కదలుదమన్న
నేను కోరునదేది వద్దనుటేది। నా స్వరూపంబెగా సకలకాలంబు
అఖిల మౌ శక్తి నా బాహు వీర్యంబె॥....
శత్రుమిత్రులలోన సమముగా నున్న। కర్తృత్వ రహిత పరబ్రహ్మను నేను..॥
నరదేవ మృగపక్షి సంఘంబు లెల్ల। నేవేయు వేషమే నిజముగా కనిన॥....

అఖిలంబునేనె సర్వంబు నేనె! ఏ నెక్కడున్నాననే ప్రశ్నలేదు
అహ! తత్త్వమసి!నేను అనునది యేమి। అను ప్రశ్నయేలేదు బ్రహ్మను నేను
ప్రశ్నకతీతమౌ బ్రహ్మను నేను। అద్వితీయుడనేను ఆదినినేను
అఖిలంబు నేనే యీ సర్వంబు నేనె॥....
మంచియు చెడుగును రెండును నేనె। కార్యకారణములు రెండును నేనె
పూర్వమున్నది యిప్పుడుండినయదియు। ముందుండ బోవునదెల్లను నేనె
ఈ సృష్టివృద్ధి క్షయంబులు నేనె। జన్మము, జన్మపరంపర నేనె
సర్వసృష్టిస్థితి లయములు నేనె॥

కొన్నిచోట్ల తాను ప్రకృతి కతీతుడనెడి భావమును, ప్రకృతి తన యధీనమైన దనెడి భావమును ప్రకటించెను. ఉదాహరణ :-

ఓ సూర్యులార! భూకంపంబులార। వాయువర్షములార! యుద్ధంబులార!
స్వాగతం బిదె రండు! రారండు వేగ। నాపై మీ శక్తి నెల్లచూపండి
మందవేటార్పెడో మందవేమండు। పగిలిపో నా ఆటబొమ్మ నీవిపుడు॥....
ఓ ప్రచండోద్ధూత దావాగ్ని। నీకు। నన్ను దహించు సామర్థ్యంబు గలద!
నీవు నామంచియే వెలుగుచున్నావు

'జగన్మిథ్య' యను శీర్షిక క్రింద రచింపబడిన గేయములలోని భాగములు కొన్ని యుదాహరింప బడుచున్నవి.

నేను ముక్తుండనహా! నేను ముక్తుదను। నాకీ జగంబెల్ల మిధ్య విభ్రాంతి॥....
నిరతంబు మృత్యువు నాయొడియందె। అటునిటు పడవైచి పొరలాడుచున్న

నాకు మృత్యువులేదు, నిరత శాశ్వతుడ। ముక్తినా కెప్పుడు లభియించు ననగ
నేను పోయిన తత్క్షణంబె లభించు। ఏ నెప్పుడును స్వార్థకర్మనే యెఱుగ
కర్తృత్వ రహిత పరబ్రహ్మమేను॥....
సర్వేశరణ్యుడ వాసుదేవుడను। ఓంకారమును నేను! ఓంకారమేను!

'బ్రహ్మజ్ఞాన' మను శీర్షిక క్రింద రచింపబడిన గేయభాగములు కొన్ని యుదాహరింపబడుచున్నవి.

నీవు దేహముకాదు మనసువుకాదు। బాంధవ్యములు లేవు బంధముల్ లేవు
ఆత్మ సుస్థిరుడవు కావోయి కమ్ము। నీ ఆత్మ భగవంతుడే వేరుకాదు
నాకు మార్పులులేవు భయస్మృతుల్ లేవు। నేనెప్పుడును పుట్టుటనునదిలేదు
పరిపూర్ణజ్ఞాన స్వరూపుండనేను। నే నఖండామృతానంద రూపుడను
తత్త్వమసి! తత్త్వమసి!తత్త్వమసి! అహహ! పరిపూర్ణ జ్ఞానస్వరూపుండ నేను
నే నిరాకారుడ నిర్వికారుడను। నేను పరమాత్మను బుద్ధ్యతీతుడను·
పరమ సత్యంబైన నన్నెరుంగుటకె। ఋషులు తపంబొనరించు చుండెదరు
ఓం ఓం ప్రశాంతి! ఓం ఓం ఓం ప్రశాంతి !

'వైరాగ్య' మను శీర్షిక క్రింద రచింపబడిన గేయభాగములు కొన్ని యుదాహరించబడుచున్నవి. ఇందు 'యద్దృశ్యం తన్నశ్య' మనెడి యుపనిషద్వాక్యార్థమే జీవన ధర్మమనెడి భావము ప్రకటింపబడినది.

ప్రియులైన వారెల్ల వీడిపోయెదరు॥....॥
సర్వబంధములు విసర్జింపవోయి। ప్రసవగుచ్ఛంబులు వాడి నశించు
వెలుగు నీడగమారి మలిగిపోయెడిని। మన మోహములు చంచలంబులై విరుగు
దేహ సౌందర్యములన్నియు చెడును। కీర్తిప్రతిష్ఠలు శిలములు శిలము
ఈ శోభకెల్లను జలబుద్బుదములె। క్షణిక మీ దృశ్య జగత్తెల్ల కనిన
మధుర వస్తువులెల్ల మాయలు సుమ్మి। నిన్ను ఆకర్షించి మోసంబు చేయు
అవి నిన్ను చల్లగా ఓడించి గెలుచు॥....॥
ఏదియు సత్యమ్ముకాదు చూడగను? పుత్రమిత్రాదులు రక్తబాంధవులు-
ఇవి యెల్ల మిథ్యయా,ఏమి చిత్రంబు? ॥....॥
ఈ చంచలంబగు దృశ్యజగాన। మారక వెలుగొందుచున్నటి ఒకటి
మృత్యురూపంబున, బాధలయందు। ఆ పరమాత్మ వస్త్రంబులే మార్పు

మరల వచ్చుచు నుండు తా మార్పులేక। ఆ పరమాత్మను ప్రేమింపవోయి
వస్త్రాల ప్రేమింప వలదోయి వలదు। ఆ పరబ్రహ్మను ప్రేమింపవోయి
దృశ్య వస్తువుపై మోహంబు వలదు। రూపముల్ ఒకదాని వెంట నింకొకటి
కూర్చగాబడు చెందులకొ యెరింగితివ? తమ్ముదాల్చుచున్న ఆ యేకమూర్తి
మనము చూడగలందులకె ప్రియా! పచివ ॥....॥

అవికల్పుడగు పరమాత్మ యనేటి। ఆ మహాశాశ్వత సూర్యుడు కనెడి
వట్టి స్వప్నమె సుమా ఈ దృశ్యమెల్ల ॥....॥

'ప్రేమ' యను శీర్షిక క్రింద స్వామి ప్రకటించిన కొన్ని భావములీ క్రింద పొందుపరచబడుచున్నవి. ప్రేమ సమర్పణ :-

ఓ ప్రభూ! నా జీవితము తీసికొనియు। నీకంకితము చేసుకోవోయి నాథ॥...॥
పరమ సత్యమా!

ఓ ఏక సత్యమా! పరమ సత్యంబ ॥....॥ నీకే మదాత్మ సంకిత
మొనరింతు ॥....॥

నాదగు జీవితం బెల్లను నీదె ॥....॥ నీదు సంకల్పము నాదె పూర్ణముగ
ఇపుడాజ్ఞ పేయుము లీ యిచ్ఛపగిది। నాయిచ్ఛ నీదాని ప్రతిబింబమేను!

ప్రేమ :—

చల్లని పిల్లగాలులు నేనెనేనె ॥....॥ ఏ ఫలంబాసింపకుండ చిత్తమున
నిరత పరిశ్రమ చేయుచు దిరుగు। అల్పమౌ యీ నల్ల చీమను నేనే ॥—॥
ఓహో! ప్రేమను నేనే ! ప్రేమికుడేనె!

పరంజ్యోతి దంశము :-

ఇందు స్వామి పరమాత్మతో తాను సంభాషించి తానా పరమాత్మకంటె భిన్నుడు కాడని తెలిసికొన్న విధము మనోహరముగ చిత్రించినారు.

"ఎవరో తలుపు తట్టినట్లయినది. ఎవరది? యని కేకవైచితిని. ప్రేమ మెల్లగా లోని కరుదెంచి, మృదుమధురముగా "తలుపు తట్టినది నీవేకదా ? నీకది తెలియదా?" అనెను. నే నతనికి స్వాగతము చెప్పి నతి సేయ నతడు మాటాడక నిలచెను. నేను ప్రార్థించి సాష్టాంగ పడితిని. అతడు మారాడక వెళ్ళిపోయెను. 'ఎందుకు నా యెద నిట్లు తరిగెదవు ? దయచేసి నిలుపుము. పోవకు" మని వేడు

కొంటిని "వీలుతే"దని యతడు మెల్లగా చెప్పెను. నాచెంత కూర్చుండుమని యెంతయో బ్రతిమాలితిని. "నీవు నా ప్రక్కన కూర్చుండు పేని యప్పుడు నీ ప్రక్కన కూర్చుందు" నని యాతడనెను. నాతో మాట్లాడుమా నఖాయని కోరితిని. "గాఢ మౌనములో నీవు మునిగి పొమ్ము. అపుడు నేను నీతో నాయిచ్ఛవచ్చినట్లు మాట్లాడుదు" నని యాతడు చెప్పెను. నిన్ను కౌగిలించి ముద్దాడ కోరికగా నున్నది. యీ యొక్క నా ప్రార్థన వినుమంటిని. "నను నీపె ఆలింగనము చేసికొని ముద్దాడుకొన వలె. నేను నీ వాకటె. నీవిట్లు పొరపడుచుంటి వేల? నీ ప్రతిమయే నా దివ్య రూపము" ఏల నీరూపమును నీవు వెదకుచున్నావు? నీతోడనే నేను శయనించు చున్నాను. నీవెచ్చటనో బయట వెదకుచున్నావు. నన్నట్లు నిర్లక్ష్యముగ చూడ వలదు. ఎచ్చటకో పోయి వెదకుటెందులకు? ఆత్మ ప్రణయము కడు రమణీ యముగ, తాత్త్వికముగ ప్రదర్శింపబడినది.

అస్మదాత్మ ప్రేమలో నేను పడితి। ఎడతెంపు లేనట్టి ప్రేమలో పడితి
అస్మదాత్మప్రేమ అనుపమానంబు। కౌగిలించితిని నాప్రేమ- నేమందు
కనుగొంటి సర్వప్రపంచంబు, నాదు! కౌగిలిలోనుంట కడు చిత్రముగను
ఎదకును, ఆత్మకు, జీవంబునకు। మనసున కతి దగ్గరకు లాగుకొనుచు
గాఢముగ కౌగిలించితి నాదు ప్రియుని। నిలుమోయి నిశ్చంచలముగ నాదేవ
అడుగైన కదలకు మిటమీద నింక। నను వీడి నీవడుగైన పోలేవు
నీవున్న చోటనే నేనును గలను। నేనిన్ను గట్టిగా బట్టెద నోయి
పులిన తలంబుల, యమునాతటాల।
కాదోయి, నా హృదయాంతరాళమున
హృదయాంతరాంతరసింహ పీఠమున

సుదినము :-

రావోయి, రావోయి అలసింపకను, భయామేలరా। ప్రాణసఖ। రమ్మురమ్మ
నాయాత్మ నీయదే। నీయాత్మనాదె। కాదేని నమ్మవా, ఇటొవచ్చిచూడు
నాదని నీవెంచు, ఈ వస్తువులను। తీసుకో, తీసుకో సర్వమ్ము ప్రియుడ
సరియె నీవవసరమని యెంతువేని॥....॥
ఈ శరీరంబును, సర్వంబుగొనుము। ఏకాకివగునేను నిరపాయముగను
పరమ శాంతిగనుందు, శాంతిగనుందు। సుదిన మహా ప్రియా! సుదినమో ప్రియ!

వీడ్కోలు :-

సెలవిదే సఖులార విడిపోవుచుంటి। ఇరుకైన దీజగన్నౌధంబు నిలువ
నేను నా ప్రేమ ఏకాంతంబుగాను। క్రీడింపగావలె, ఓహో హో ఇపుడు
ఉభయుల మానందమున తేలుచుంటి। మదియేమి ఉభయుల మనుమాట లేదు
ఒక అఖండ మహార్ణవంబునచు పొరలి। పొంగుచు చున్నది అభేదానంద
మహాహా॥

సెలవు :-

కాంతి మూలంబైన నీ కొరకేను। వే చియున్నాను నేవేచియున్నాను
వైద్యులు వద్దు, భిషగ్వరుల్ వలదు। తియ్యగా నున్నది నాకు నా బాధ
ఓ పౌరులార। ఓ నగరంబులార। సెలవిదే, సెలవిదే, సెలవు
ఓ ఆస్తి! కామమా! ఓ మంచి చెడుగ! సెలవిదే కాలమా! సెలవిదే స్థలమ!
సెలవిదే లోకమా! ఓ రాత్రి! పగల! నా ప్రేమె పూలు, సంగీతంబు, కాంతి
నా ప్రేమె రాత్రి, నా ప్రేమయే పగలు। చీకటి వెలుతురు సర్వంబు నాలో
కరిగిపోయినదహో! కరగిపోయినది। ఎంత అద్భుత కాంతి! ఆనంద
మహాహా!
వదలుడీ నన్ను, నా ప్రేమ నొంటరిగ। సెలవిదే, సెలవిదే, సెలవిదే,
సెలవు॥

ఇట్లు శ్రీరామ తీర్థ స్వామి యొక్క ప్రణయము విశుద్ధ ప్రేమ రూపమై, ఇంద్రియాతీతమై, దేశకాలాతీతమై, యద్వైతమై, దివ్యమై, యానందైకరస ప్రవాహమై కడకు ప్రశాంతమై వెలసినది. ఇది లౌకికమై, ఇంద్రియలోలత్వము నకు విషయమై, క్షణికమై, మోహపరవశమై, ప్రేమ యను పేర సాగింప బడుచున్న కామాది విలాస రూపమైనది కాదు. రామ తీర్థుని ప్రేమకును, సాధారణ ముగ లౌకిక కవులు వర్ణించు నీ ప్రేమకు హస్తిమశకాంతరమున్నది. పూర్ణిమా మావాస్యల కున్నంత తారతమ్యమున్నది.

తత్త్వము.

ఇందు రామ తీర్థస్వామి యద్వైత వేదాంత తత్త్వసారము నుపనిషత్తుల నుండియు, తన యనుభవము నుండియు సంగ్రహించి తేట మాటలలో వెలిబుచ్చి నాడు.

అనుభవ వేదాంత మేమిటో తెలుసా! :

ముందంజ వేయుచు ముందు కేగుమను! చేయు నభ్యుదయ సేవకా కృషి
యేను గాని
స్తంభించి క్రుళ్ళు జడత్వంబుగాదు; నిరత కర్మానంద మమతయే గాని
చీకాకు నిడు బానిసత్వంబు గాదు; నిశ్చలంబగు మానసిక శాంతిగాని
సంశయ వ్రణము కాదహో కాదు! నిర్మాణమేగాని భేదన కాదు;
సక్రమంబైన సంస్కరణంబుగాని— సంప్రదాయాచార బంధన కాదు;
దృఢతర సత్యానుభూతియేగాని! చిలుకపల్కులుగావు నమ్మ మీ మాట
వాస్తవంబైన కవిత్వంబు గాని; నమ్మరానట్టి పుక్కిటి కథల్ గావు;
ప్రామాణికంబగు తర్కంబుగాని! చచ్చిన గ్రంథక ర్తల ప్రమాణముల!
సచివ! సజీవమౌ జ్ఞానంబు గాని! వట్టి నిర్జీవ తార్కాణముల్ గావు;
అనుభవ వేదాంతములు నిల్పుకొమ్ము!

ఈ వాక్యములు వేదాంతముపైగల యపోహలను పోగొట్టి, దాని నిజ స్వరూపమును, ఆవశ్యకతను, ప్రయోజనమును చాటుచున్నవి. అభ్యుదయకాము లీ యంశములు పరిశీలింతురు గాక!

పరిపూర్ణమది మరి పరిపూర్ణ మద్ది! పరిపూర్ణమెన్నడు మారుటలేదు.
పూర్ణమం దుండియు పూర్ణంబు చనిన; అవికల్పమగు పూర్ణమే నిల్చియుండు॥

ఇది 'పూర్ణమదః పూర్ణమిద' మ్మను నద్వైతతత్త్వ ప్రతిపాదకమగు శుక్ల యజుశ్శాఖీయ శాంతిపాఠమున కనువాదము.

ఆ ఆత్మ ఆ సత్తు నీవే; నీవేను విషయ వస్తువుల యందుండి చిత్తమును
మరలిచి, దారిని తప్పు గుఱ్ఱములు కొరడాలతోడ శిక్షించు చందమున
ఘన వివేకంబను పగ్గాలతోడ! చిత్తవికల్పాశ్వముల నిరోధించి
ఋషులు జేర్తురు వాని ఓం గృహంబునకు
ఆగ్రహం బా యోం కృతియు నీవు నిజము.
సర్వంబునం దేకసరణిగానున్న! ఆ యవికల్పమౌ సూత్ర మా యాత్మ
ఆ పరిశుద్ధమౌ పరమాత్మ నీవె! నీలోనగలదు నా ఏక సత్యంబె
ఈ సర్వమందున వెలుగుచున్నయది! ఆ ఏక సత్యమే సర్వదీప్తంబు

పరశక్తి, శత్రుపు లితరులు లేరు। సర్వము నీ సృష్టియే కనుంగొనుము
ఆ పరమాత్మవు నీవేను నీవె। బ్రహ్మ సత్యము జగత్సర్వంబు మిథ్య
మరియు జీవచ్ఛక్తి తద్ధర్మమేను। .... నన్నెదురంగుట యగు నాకు
లోబడుట

నాకు లోబడుటయే విజయంబు గనుట।

ఇందద్వైత వేదాంత తత్త్వము తేటమాటలలో స్పష్టము చేయబడినది. ఇట్లే యద్వైత భావపూర్ణమైన వాక్కులతో నవనాగరకతలో గల యవివేకమును విస్పష్టముచేసి, యట్టి నాగరకులను తత్త్వము తెలిసికొని అద్వయానంద రసాస్వాదన చేయ నుద్బోధించినాడు స్వామి. తరువాత 'కావలె'యను శీర్షిక క్రింద నిట్లు రచించినాడు.

కావాలె సంస్కర్త లవసరం బిపుడు। పరులను సంస్కరింపను కాదు ముందు—
తమ్ముతామే సంస్కరించుకొనంగ। విశ్వవిద్యాలయమందున చదివి
డిగ్రీలు పొందిన వారలు కాదు - ఘన జితాహంకార ధీరులు గాని

వయసు :- దివ్యానంద నవ యౌవనంబు

జీవితము :- అమరమౌ బ్రహ్మత్వమేను

త్వరలోన దరఖాస్తులను పంపుకోండి! ఎవరికో తెలుసునా—ఎవరికోగాదు
నీ ఆత్మయగు జగత్పరిపాలకునకు।

ఇట్లే తన యద్వైతానుభూతిని, దానివలన గలిగిన యానందమును వర్ణించుచు 'నేను నవ్వాపుకోలేను' అను శీర్షికక్రింద కొన్ని గేయములు స్వామి రచించెను. అట్లే 'చంద్రబింబము', ముక్త పురుషుని సమాధిపైన శాంతి, అది నాకు వానగాదు, అకారణభయం, విజయరహస్యం, సమత, నైర్మల్యము వైదాంతికమైన జోలపాట, అభయం అను శీర్షికలక్రింద పెక్కు గేయములు రచింపబడినవి. 'అభయం'యను శీర్షికక్రింద రచింపబడిన యీ క్రింది పంక్తులు గమనింపదగి యున్నవి.

దేనికై భయమొందుచున్నావు సఖుడ? దేవుని జూచియా? బుద్ధిహీనతయె
మర్త్యుని జూచియా? పిరికితనంబు। పంచభూతములకా? ఎదురించవోయి
నిను నీవు చూచియా? తెలుసుకో నిన్ను। గర్జించుమా 'అహం బ్రహ్మాస్మి'
యనుచు

ఈ చరాచరములు నీ సృష్టి గాదె। ఐన, నెవ్వరిమాచి భయమొందెదీవు?
కానిసవా నీవు? విశ్వనాథుడవు! నీ యబద్ధములాడు అలవాటు మాని
ద్వైత భావంబను విషమును విడిచి! రామ ప్రబోధంబు వినవయ్య వినుము
ద్వైతంబుచే నీవు బంధింపబడియు! ఆత్మహత్యను చేసుకోవద్దు సుమ్ము
గర్జింపుమా 'అహం బ్రహ్మాస్మి' యనుచు ॥

శ్రీ కేశవతీర్థులవారి యనువాద మోజోవంతమై శ్రీరామతీర్థుల భావములను చాలవరకు యథాతథముగ మన కందజేయుచున్న దనవచ్చును. ఈ గేయపాదములలో ముక్కాలు మువ్వీసము యతి ప్రాసలులేని ద్విపద లక్షణము గలిగియున్నవి. భాష సగమునకు పైగా సలక్షణమని చెప్పదగియున్నను కొన్నిచోట్ల వ్యావహారిక భాషా ప్రయోగమూ, లక్షణ విరుద్ధమైన శబ్దములు కానవచ్చుచున్నవి.

ఉదా :— నాకే పరవయి లేదు । పరమాత్మ యనేటి । గసగసా తరులు వా హృదయవీగంబు । బోధాస్వరూప । భీతి కొట్టుకపోయె । ఏమిటో తెలుసా? అతి పెద్ద శబ్దము । జాగ్రద స్వప్నములు । వృద్ధత్వము । పరమాత్మె । జగత్సర్వంబు । జీవచ్ఛక్తి (జీవశక్తి) । తెలుసుకో । మొదలైనవి. ఇట్టి ప్రయోగములాధునిక కవిత్వమున సాధారణముగ సర్వత్ర కానవచ్చుచునే యున్నవి.

మొత్తముమీద నీ రామగీత భావముల జిజ్ఞాసువులకును, భావ ప్రకటన పద్ధతిలో నాధునిక రచయితలకును, అందు ముఖ్యముగ నభ్యుదయ రచయిత లనదగిన వారికిని ఉత్తేజకరమై తత్త్వచింతనకు ప్రోత్సహించునదిగా నున్నది. ఎవరైన గానిందు, మొదలుపెట్టినచాలు— చివరివరకు విడువనీయక చదివించును. అట్టిశక్తి దీనియందున్న ట్లనుభవమువలన గ్రహింపవచ్చును. ఇది సర్వజనోపయోగియైన యాధునికాద్వైత తత్త్వకావ్యములలో నొక యమూల్య రత్నము.

# శ్రీ రమణ గ్రంథమాల

అరుణాచలమున జ్ఞానసిద్ధుడై భక్తుల కాత్మతత్త్వ ముపదేశించుచు నీ శతాబ్ది యారంభమునుండి 1950 వరకు భౌతిక కాయముతో నుండిన శ్రీ రమణ మహర్షి యొక్క ఆంధ్ర పద్యరచనలు, వారి తమిళ, సంస్కృత రచనల కాంధ్రానువాదములు కొన్నియు, కలిసి 'రమణ గ్రంథమాల' యనుపేర

శ్రీ రమణాశ్రమమువారిచే ప్రచురించబడినవి. శ్రీ రమణభగవానుని బోధ ముఖ్యముగ, సూటిగ, ఆత్మజ్ఞానమును గూర్చియే. ప్రతి విషయము 'నేను' అనుచోట నుండియే యారంభమగుచున్నదిగావున, ఆ 'నేను' యొక్క మూలస్థానము, మూల స్వరూపము తెలిసికొనవలెననియే-ఆ బోధ సారాంశము. "ఆ నిజమైన 'నేనే' ఆత్మ. అదియే 'పరమాత్మ'. ఆ యాత్మను తెలిసికొనుటకు, గురుభక్తి, భగవద్భక్తి, చిత్తశుద్ధి కారకములై పరంపరాసాధనములగును. ప్రాణనిరోధముచే మనోలయము, ఏకతత్త్వనిష్ఠచే మనో నాశనమువగును. మనోనాశమైనచో శేషించునది యాత్మయే. చిత్తము బాహ్యోన్ముఖముకాక తనయొక్క స్వరూపమును తెలిసికొనుటయే స్వభావ జ్ఞానమగును. అదియే తత్త్వదర్శనము. అదియే పరమాత్మ దర్శనము." ఇది శ్రీరమణోపదేశమున సాధనమార్గము. ఈ విషయములు 'ఉపదేశసారము' మొదలగు వానియందు తెలుపబడియున్నవి.

ఇవికాక అరుణాచల ప్రశంసాదులైన శ్రీ రమణమహర్షి రచన లిందు కొన్ని యున్నవి. వానియందును భక్తిజ్ఞాన బోధకములైన వాక్యములు కొన్ని యున్నవి. మహర్షి రచించిన కీర్తనలు కొన్ని తత్త్వబోధకములై యిందున్నవి. ఇంట్లిందున్న వివిధ రకములైన తత్త్వబోధక రచనలనుండి కొన్ని యుదాహరణములు, వాని యందలి తత్త్వ విషయములను, రచనా విధానమును, తెలిసికొనుట కనువుగ విప్పబడుచున్నవి.

(1) అరుణాచల దీపదర్శన తత్త్వము :

ఇందరుణాచలజ్యోతి దర్శనమువలన గ్రహింపదగిన తత్త్వము స్పష్టీకరింపబడినది. ద్విపద :— ఈ శరీరమె యౌను నేనను మదిని। నాశమొనర్చి పూర్ణముగా నా బుద్ధి!

హృద్వాసి యగుచు, లోదృష్టి వలననునద్వైతమగు నిజాహంజ్యోతి గాంచు।
ఖరయ భూమధ్యమౌ నరుణాద్రి దీప। దరిసెనమై యొప్పు తత్త్వార్థమగును॥

దేహాత్మబుద్ధి యనెడి యజ్ఞానాంధకారమును నశింపజేయు పరమాత్మ బుద్ధిచే ఆత్మజ్యోతిని హృదయమున దర్శించుచే, యరుణాచల దీపదర్శనమున గ్రహింపదగిన తత్త్వము.

(2) అక్షర మణమాల:- (గేయము) :—

మణమాలయనగా పెండ్లినాటి పూలదండ, ఇది మొదట, మహర్షిచే తమిళ

మున అకారాది యక్షరక్రమమున, చరణముల యాద్యక్షరము లుండునట్లు కూర్చ బడినదగుటచేత నిది "యక్షర మణమాల" యనబడినది. (తెలుగున నట్లకారాదిగా లేదు. అక్షరుని గూర్చిన మణమాల యగుటచేత గూడ నిది యక్షరమణమాల యన దగియున్నది. ఇందు భక్తుడు నాయిక (జీవుడు). అరుణాచలుడు నాయకుడు. (ఈశ్వరుడు). నాయిక తన మనోభావ కుసుమములను శ్లోకరూప విరచితమాలగా ప్రియున కర్పించు ప్రేమభక్తి స్వరూపమిందు ప్రదర్శింపబడినది. భిక్షాటన సమయ మున శిష్యులు పాడుకొనుటకై స్వామి దీని ననుగ్రహించిరట. ఇందుగల, ప్రేమ, భక్తి, శృంగారములలో జ్ఞానోపదేశము క్షీరమున శర్కరవలె నంతర్గతమై యున్నది. ఇందలి భావములను గ్రహించుటకిట కొన్ని చరణము లుదాహరింపబడు చున్నవి.

పల్లవి : అరుణాచల శివ, అరుణాచల శివ,
అరుణాచల శివ అరుణాచలా ॥....॥ (రెండుసార్లు)

చరణము 2 :- అళగు (అంచ) సుందరములవలె జేరి నేను నీ।
వుంద మభిన్నమై యరుణాచలా॥

ఇందు జీవేశ్వరాభిన్నత్వ (అద్వైత) మాకాంక్షింపబడినది రమణ భగవానుని తల్లిదండ్రులగు అళఘమ్మ, సుందరమయ్యర్ లవలె ననెడి ధ్వనియు నిందున్నది.

చరణము :— 12. ఒకడవౌ నిను మాయమొనరించి వచ్చువా
రెవ, రిది నీజాలమరుణాచలా॥

ఇందు జగన్మిథ్యాత్వము, బ్రహ్మసత్యత్వము, ధ్వనించుచున్నవి. "ఒక డవౌనిను" అనుటలో బ్రహ్మైకత్వము (సత్యత్వము), 'ఇదినీజాలమ'నుటలో జగన్మిథ్యాత్వము గ్రహింపదగును.

చరణము 16 :— కాంత మినుమువలె గవిసినన్ విడువక
కలసి నాతోనుండు మరుణాచలా॥

ఇందు ఇను మజ్ఞానజీవుడు. కాంత మీశ్వరుడు. విడువక కలసి యుండుట భ్రమరకీట న్యాయమున జీవు నీశ్వరునిగా చేయుట. కాంతమినుముతో (ఒక పద్ధతిలో) చిరకాల సంబంధము కలిగియున్నచో నా యినుపముక్కయు కాంతమగును, ఏకస్వరూపమగుట ఇందపేక్షింపబడినది.

చరణము 40 :- జ్ఞానములేక నీయాశ, దైన్యముబాప
జ్ఞానముదెల్పి బ్రో వరుణాచలా॥

ఇందు జ్ఞానరాహిత్యముచేతనే ద్వైతము, దానివలన దైన్యము కలుగుచున్న దనియు జ్ఞానమువలన నవి నశించుననియు స్ఫురించుచున్నది.

చరణము 48:- దైవమనుచు నిన్ను దరిజేరగా నన్ను
పూర్ణనాశమొనర్చి తరుణాచలా॥

ఇందు భక్తివలన జ్ఞానము కలిగి యహంకారరహితమై యద్వైతసిద్ధికలిగిన భావమున్నది.

చరణము :— నీవు నేనయి నిత్యానందమయముగ
నిలుచుస్థితి కరుణిం పరుణాచలా॥

ఇందు భేదభావము నశింపగా లభించు నిత్యానందస్థితి యాకాంక్షింపబడినది.

చరణము 82:— నత్యాహమున మనోమృదుపుష్పశయ్యపై
మేనలయ గరుణింపు మరుణాచలా॥

అహం పదార్ధమెరిగి (యాత్మజ్ఞానమునొంది) తన్మయత్వమున శరీరము మరచుట యిందు కోరబడినది.

చరణము 91 :— రేయింబవలు లేని బట్టబయటి యింట
రమియింపగారమ్ము అరుణాచలా॥

కాలాతీతస్థితి నిరుపాధికానంద మనుభవింపగోరు యిందు తెలుపబడినది.

చరణము 95 :— రమ్మని లోదూరి నీజీవమిడునాడె
నాజీవమును బాసి తరుణాచలా॥

ఇం దాత్మసాక్షాత్కారముచే నహంకార రాహిత్య మనుభవమగుట తెలుపబడినది.

ఇట్లు 42, 43, 44, 45, 47, 50, 51, 52, 54, 59, 62, 66, 68, 69, 77, 88, 93, 97, 99, 103 సంఖ్యలుగల చరణములును, తత్త్వగర్భితములై యున్నవి.

"ఎవరు నా నోటిలో మన్నుగొట్టినా! బ్రతుకు హరించిన దరుణాచలా" యంటి చరణములలో తత్త్వముతోపాటు నిందాస్తుతి ఛాయలు, చక్కని తెలుగు జాతీయ ప్రయోగములును కనుపించుచున్నవి.

ఇందు మొత్తము నూటయెనిమిది చరణములున్నవి. ఇందు భక్తి, కరుణ, శాంతిరసములు ప్రధానముగను, శృంగారరసము ఛాయామాత్రముగను గోచరించుచున్నవి. .

3. అరుణాచల నవమణిమాల :— ఇది తొమ్మిది పద్యములలోనున్న యరుణాచల ప్రశంసాపూర్వకమైన స్తుతి. తత్త్వభావయుతమై, శాంత కరుణరస భరితమైనది. ఇందలి తాత్త్విక భావముల కొండు రెండుదాహరణము లీయబడు చున్నవి.

గీ॥ సత్యచిత్సుఖము మఱి యీశ్వరుడు జీవు
దయ్యిరువుర యైక్యం బర్థమైనయట్టి
తత్త్వమసియే యరుణ పదార్థమగు నచల
తార్థము.................... 2

అరుణాచలమున కిందు తత్త్వమసి మహావాక్య సమన్వయము చేయబడినది.

4. అరుణాచలాష్టకము :- ఇందు మహర్షి తమ సాధనకాలమున పొందిన యనుభవములు వివరించిరి. ఇది మహర్షి యుపదేశ సార సర్వస్వమన బడినది. ఇందలి భావములకు కొన్ని యుదాహరణములీయబడుచున్నవి. ద్విపద:-

ఎఱుకను మఱుగిడి యూద్వ దాపునకు। నరిగిన సమయమం దచలమై గంటి॥
కనువాడెవండని మనమున వెదుక। కనువాడు గనలేక యునికివిగంటి
కనితి నేననుటకు మనమురాదయ్యె। కననైతి ననుటకు మనమెట్లువచ్చు॥ 2
ఉదధి నెగయు మేఘ ముర్వి వర్షించు। నీరది మున్నీరుజేరు పర్యంత
మాపినను నిలువ, దటులనే దేహి। నీయందు వెలువడి నిన్వరుపముక
కల పలుమార్గాల మెలగి నిలువక। అలసియు వినువీథి విలుకడగనక
యిలకాక యితర మే నెలవును లేక। వచ్చినదారిబోవలయు పక్షివలె
మఱలి లోవలవచ్చు మార్గమేగ సుఖ। అంబుధిని విసుబొందు నరుణ
భూధరుడ॥ 8

ఇందలి విషయము సరళమై సుబోధమై యున్నది. చివరి భాగములోని యుపమానము భావమును మరింత స్పష్టము చేయుచున్నది.

5. అరుణాచల పంచరత్నములు :— ఇవి మహర్షిచే మొదట సంస్కృతమున నార్యావృత్తమున రచింపబడినవి. వీనియందాత్మ లక్షణము, విచార

యోగ, భక్తిమార్గముల ప్రస్తావన కానవచ్చును. ఇది సకలోపనిషత్సారమనదగినది.

కం॥ కరుణాపూర్ణ సుధాబ్ధీ। కరనికరముచే నిఖిలము కబళించెడి యో
యరుణాచల పరమాత్మా। యరుణుడగు మ, సు వికసింప నంబుజమనమున్।

కం॥ జననస్థితి విలయము లె। ల్ల నగును జిత్త మరుణాచలా నీలోనే
నను నాత్మపై హృదిని న। ర్తన మాడుటను వెలసితి హృదయమును,
పేరన్॥

నేనని యెందువెదలునని। లోనమల మనీషచే విలోకింపగా
తానగురూపమెఱిగి నీ। లో నరుణాద్రి నది యబ్ధిలోవలె నెనయున్॥ 3

పోనాడి వెలివిషయముల్। ప్రాణ నిరోధమున మనసు బంధించి నినున్
ధ్యానించుయోగి కాంచును। లోన ననూనమగు నీ వెలుగు నరుణాద్రీ॥ 4

మనసును నీకర్పించి య। రుణాద్రి సర్వమును నీదు రూపుగ నెపుడున్
గనుచు ననన్యప్రీతిన్। నినుగొలువ జయించు మునిగి నీసుఖమందున్॥ 5

కం॥ అరుణగిరి రమణ కృతమగు। నరుణాచలపంచరత్న మార్యాగీతిన్
అరుదైన వేదసారము। అరయంగా గందములివి యనువాదమగున్॥ 6

ఈ పద్యములు కడుసరళములై వివరణాన పేక్షములై భావమును సుస్పష్టముగ తెలుపుచున్నవి. రచన చక్కని ధారకలిగి సరసమైయున్నది. వీని చివర నొక సీసపద్య మద్వైతభావభరితమై యిట్లున్నది.

సీ॥ హరిమొదలయిన యితరజీవుల హృదయ
వారిజ గుహయందు వ్యాపకముగ
నెఱుకమై రమియించు పరమాత్మడెవ్వడో
అరుణాచలరమణుడగు నతండె
పరభక్తి నుల్లంబు కరుగంగ నత్పరు
డంతట పూర్ణుడై యలరు గుహను
దరిజేరి జ్ఞాననేత్రంబు తెఱచి నిజ
మెఱుగగ బద్ధుడయలగు నదియు॥....

ఇం "దరుణాచల రమణుడు సర్వజీవహృన్నివాసి" యని మహర్షి స్వాను
భవము ప్రకటింపబడినది.

6. ఉపదేశసారము :- ఇది ముప్పది ద్విపదలలోనున్న "రమణ బ్రహ్మ సూత్రము" అనదగిన గ్రంథము. మహర్షియొక్క సంస్కృత రచనయే దీనికి మూలము. శ్రీరమణ మహర్షియొక్క యుపదేశసార మిదియే. "కర్మము జడము. కర్మఫల దాత ఈశ్వరుడు" అనెడి పూర్వ మీమాంసాఖండనముతో ప్రారంభమై, కర్మ, భక్తి, యోగ, జ్ఞాన మార్గములను సాధనములుగా వివరించుచు నద్వైత తత్త్వమున పరిసమాప్తి నొందుచున్న చక్కని చిక్కనిచిన్నిరచన యిది. ఇట్టి రచన మహర్షి కేగాని, మరొకరికి నసాధ్యమన్న నతిశయోక్తి కాదు. ఇందలి కొన్ని సూత్రము లిచట నుదాహరింపబడుచున్నవి.

మూలము :- కర్తురాజ్ఞయా ప్రాప్యతే ఫలం ।
కర్మ కింపరం? కర్మ తజ్జడం ॥ 1

అనువాదము (ద్విపద) :—

కర్మము ఫలమిచ్చుఁ గర్తాజ్ఞవలన
కర్మము దైవమా? కర్మము జడమె ॥

మూలము:- ఈశ్వరార్పితం నేచ్ఛయా కృతం ।
చిత్తశోధకం ముక్తిసాధకం ॥ 3

అనువాదము (ద్విపద) :- కర్త్రర్పిత ఫలనిష్కామ్య కర్మంబు
చిత్తశుద్ధినొసగి చేర్చును దారి ॥

మూలము: ఉత్తమ స్తవా దుచ్చమందతః
చిత్తజం జప ధ్యానముత్తమం ॥ 6

అనువాదము:— ఉత్తమస్తోత్రము లుచ్చైరుపాంశు
చిత్తజపములలో (జింతయుత్తమము ॥

ఈ యుదాహరణము లనువాద మెంత మూలతాదాత్మ్యమున నున్నదో తెలిసికొనుటకు చాలును. ఇక విషయప్రధానమైన కేవలానువాద పంక్తులు కొన్ని యుదాహరింపబడుచున్నవి. ద్విపద:

భావబలంబుచే భావరాహిత్య ! భావస్థితి మునులు పరభక్తి యనిరి॥ 9

కర్మము, భక్తి, యోగ జ్ఞానము లివె (మర్మాన వ్యస్థమై మనమందుమహిమ॥

చిత్తము ప్రాణము చిత్క్రియాశక్తి । యుక్తశాఖలు మూలశక్తి యేకంబు ॥
చిత్తము దృశ్యముల్ చేరక తనదు । చిత్త్వమెరుగుటయే తత్త్వమెరుగుట॥
మనసు స్వరూపము మరువక యెఱుగ । మన మనునదిలేదుమార్గము సూటి॥
ఉన్న జీవేశ్వర లోక వస్తువాత్మ । భిన్న ముపాధి చిత్తన్న చిహ్నములె॥
తా నుపాధి వదలి తన్నెఱుంగుటయె । తానుగా వెలుగీశ తత్త్వదర్శనము ॥
అహములేనిన్వయమనుభూత నిష్ఠ । మహ దుగ్ర తపమనెమహి రమణఋషి॥

ఇంతసూక్ష్మముగ తత్త్వమును, సాధనపద్ధతిని కరతలామలక మొనర్చు రచన తెలుగులో మరొకటి కనిపించదు. దీనికి వివరణము వ్రాయబూనినచో, వ్యాస బ్రహ్మసూత్ర భాష్యమంత యగును. శ్రీ రమణ కృతులనుగూర్చి ప్రత్యేక పరిశోధన చేయు సుకృతికది సుకృతియగును.

(7) ఉన్నది నలుబది (సద్విద్య) :- ఉన్నదానిని (సత్, సు) గూర్చి చెప్పబడిన నలుపది పద్యములు. దీనికి మూలము మహర్షి యొక్క తమిళ రచన. దీని కాంధ్ర వచనానువాదము మహర్షిచేతనే చేయబడినది. దీనికి సంస్కృత శ్లోక రూపానువాదము, తెలుగున ద్విపద రూపానువాదము, వృత్తపద్య రూపానువాదము కూడ నున్నవి. వీనిలో కొన్ని శ్లోకములు, పద్యములు మహర్షి విరచితములు. కొన్ని తచ్ఛిష్య రచితములు. ఇందలి ముఖ్యాంశములను అనువాద సరళిని తెలియుట కనువుగా మహర్షి వచనముల నుండియు, ననువాద ద్విపదలనుండియు, వృత్తముల నుండియు, కొన్ని యుదాహరణము లీయబడుచున్నవి.

వచనము :- జగత్తు, జీవుడు, ఈశ్వరుడు అను మూడు వస్తువులను బట్టియే ఏ మతమైనను ఆరంభించును. ఒక వస్తువే మూడగును. ఎప్పుడును మూడు మూడే యనుట అహంకార ముండువరకే. కనుక నేను (అహంకారము) చచ్చి తన స్థితిలో తానుండుట యుత్తమము 2. ద్విపద :-

కన జగజ్జీవేశులను మూటిమూల। మునుబట్టి యే మతమును ముందునిలుచు
అటనయమ్మొ మూడుమూడని మూడు నొకటి। యనుట యహంకార
మలరెడుపరకె॥
కనుక నహమడగి తనయందు తాను। అనయముండెడుస్థితి యది
యుత్తమంబు॥

ఇందున్న "మూఢునొకటియనుట" యను వాక్యము మూలమున నట్లులేదు. అనువాదము వచనమునకు కొంత భిన్నముగనున్నది. అనువాదమున, వచనము నందలి భావము సరిగ పొసగలేదు.

చ॥ భువనము, జీవుడీశుడను, పుంతనుబట్టియె యే మతమ్మ ను
ధ్రువమగు, వస్తువొక్కటియె భవ్యముమూఢగు మూఢునెప్పుడున్
అవుగద మూఢుగాననుట యాయహమెంతకు నుండువంతకే
శివమగు నాయహమ్మణచి శీఘ్రమె తానుగ దాను నిల్చినన్॥

ఈ యనువాదము వచనానుగుణముగ నున్నది.

వచనము :— అజ్ఞానము లేక జ్ఞానములేదు. జ్ఞానములేక అజ్ఞానములేదు. అజ్ఞానాజ్ఞానము లెవ్వరికో, అమ్మొదలైన తన్నుతాను తెలియు జ్ఞానమే జ్ఞానమగును. 10. ద్విపద:—

ఎఱుగమిని విడిచి యెఱుకయులేమి। ఎఱుకను విడిచి యాయెఱుగమిలేదు
ఎఱుక యెఱుగమి యెవ్వరికని మూల। పురుషుడౌ తనను తానెఱుగుటే
యెఱుక॥

కం॥ జ్ఞానము లే కజ్ఞానము। జ్ఞానం బజ్ఞతయులేక కలుగవు, మఱి యా
జ్ఞానాజ్ఞానములకు మొద। లేనని తను దానెఱుంగుటే జ్ఞానమగున్॥

వచనము :— జడశరీరము "నేను" అనదు. సత్తైయినచిత్తు జనంచదు. నడుమ (మధ్య) దేహపరిమాణముగ 'నే' నొకటిపుట్టును. ఇదియె చిజ్జడగ్రంథి, బంధము, జీవుడు, సూక్ష్మశరీరము, అహంకారము, సంసారము, మనస్సు మొదలగు నవి యని తెలియుము (24) ద్విపద.

అనదు 'నే'నని జడమైన దేహంబు; జనియింపదెప్పుడు సచ్చిత్తు; మధ్యం
దను పరిమాణముగను బట్టు 'నేను'। గ నొకటి చిజ్జడ గ్రంథి బంధంబు,
మనసహంతయు, సూక్ష్మతనువు జీవుండు। ఘనతర సంసారమును నగును
నదియె॥

మ॥ జడమైనట్టి శరీర 'మే' ననదు తాన్, సత్తైన చిత్తెప్పుడున్
బొడమన్ జాలదు; మధ్య 'నే' నొకటి రూపున్ బొందు దేహాకృతిన్

బడమిన్ దానిదె చిజ్జడంపు ముడియున్ బొల్పొందు బంధంబు జీ
వుడు సంసారము సూక్ష్మదేహము మనంబున్ దానహంకారమున్॥

వచనము :- 'నే' నెవ్వడని మనస్సులోపల వెదకుచు హృదయమున జేరి నపుడు నేననువాడు తలక్రింద బడిపోయి తోడనే "నేను" 'నేను' అనుచు దానుగ నొక వస్తువుతోచును. తోచినను దానియర్థము అహంకారముకాదు. పరిపూర్ణ వస్తువే దానియర్థము॥ (30) ద్విపద :-

'నే' నెవడని మదిలోన వెదకుచు। ఆనహృదయము, నేనను వాని శిరము
తునుగ 'నే' 'నే'నని తోచుచు దాను। గనొకటి; యహమిది కాదు పూర్ణంబె॥

శా॥ నే నెవ్వండ నటంచు మానసములో నెంతేని శోధించుచున్
దానే మూలముగా వెలుంగు హృదయాంతర్థానమున్ జేరగా
'నే'నంతన్ దలక్రిందుగాబడియటన్ 'నేన్' 'నే' నటంచొక్కటై
తానై తోచును బూర్ణవస్తువదియౌ; దాగాదహంకారమున్॥

వచనమున "నేననువాడు తలక్రింద బడిపోయి" యని యన్న భాగము ద్విపదలో "నేనను వానిశిరము తునుగ" అని మార్చబడినది. పద్యమున "నే నంతటన్ తలక్రిందుగా బడి" యనబడినది. వీని పలుకు బడిలో భేదములున్నను తాత్పర్యమున భేదము లేదు.

వచనము:— "నన్ను నేనెఱుగను" "నన్ను నేనెఱుగుదును" అనుట హాస్యా స్పదముగ నున్నది. ఏల? తన్ను దనకు విషయముగావింప దాను రెండగునా? తాను ఏకమగుట అందరికి అనుభవసిద్ధము.33

ద్విపద :— "ననునేనెఱుగ" "నేను నన్ను నెఱుగుదు"
నను రెండునున్నవి హాస్యాస్పదముగ
తను విషయమొనర్ప దాను రెండగునె?
తన యేకతయగు నందలి యనుభూతి॥

ఆ. వె "నన్ను నేనెఱుగను" నన్ను నేనెఱుగుదు
ననుట హాస్యవిషయమగును; దన్ను

తన విషయమగుటకుఁదాను రెండౌనె? తా
నొక్కఁడనుట యందఱొప్పినదియె॥

ఇందలి వచనములు సూత్రప్రాయములు. అనువాదములను కొంచెమించుగా తదను గుణముగనే యున్నవి. అందు ద్విపదలకంటె పద్యానువాదము మరింత యోగ్యముగ కనిపించుచున్నది. రెండు రకముల యనువాదములను నన్వయ క్లిష్టత లేక సులభ సుబోధములుగనే యున్నవి. భాష లాక్షణికము, సరళమునై యున్నది. కవిత ధారాశుద్ధి కలిగి చక్కఁగా సాగినది. జిజ్ఞాసువుల కీయుభయ విధ ముల యనువాదములును సంతృప్తిని సంతసమును సమకూర్చగలవు.

# సూక్తిసుధ

శ్రీ రమణ మహర్షి, ఉన్నది నలుబది (సద్విద్య) కనుబంధముగా నందలి యంశములకు ప్రమాణము లనదగిన కొన్ని శ్లోకములను యోగ వాసిష్ఠాది గ్రంథ ములనుండి యుద్ధరించియు, కొన్ని తాము రచించియు 'సూక్తిసుధ' యను పేర సంకలనముచేసి వానికి తెనుగు వచనానువాదము చేసిరి. ఇందద్వైతతత్త్వముపై వితరులు చేయు ఖండనలకు ప్రత్యుత్తరములున్నవి. ఈ తెలుగు వచనానువాదమునకు కూద "ఉన్నది నలుబది"కి వలెనే ద్విపదరూపమునను, పద్యరూపమునను, చేయ బడిన యనువాదములున్నవి. వానినుండి కొన్ని యిచట నుదహరించబడుచున్నవి:-

వచనము:- ఈ సర్వము దేనియందున్నదో, దేనిదో, దేనినుండి కలిగినదో, దేనికొఱకో, -నివలననో, ఏదియో ఆ సద్వస్తువును భజింతము గాక॥

ద్విపద :- దేనినుండి కలుగు, దేనియందుండు। దేని దీసర్వమ్ము దేనికై వెలయు
నేదేని వలననో యేదియో యదియె। సద్వస్తువగు దానిస్మరణ వేసెదము॥

మత్తకోకిల : దేనియందిది లోకజాలము తేజరిల్లుచునున్నదో
దేనిదోమరి లోకమంతయు దేనినుండి జనించెనో
దేని వల్లనో సృష్టియంతయు దేనికోయది యేదియో
దాని గొల్తము సత్స్వరూపముదత్యవస్తువు పూర్ణమున్॥

ఇందద్వైతపూర్ణతత్త్వము తెలుపబడినది.

వచనము :- నీకు వెలుగునేది? నాకు పగటియందు సూర్యుడును, రాత్రి

యందు చంద్రదీపాదికములును వెలుగై యున్నవి. ఆ వెలుగును వెలిగించు (చూపించు) వెలుగేది? కన్ను. కంటినేది వెలిగించును? (కంటికా శక్తినిచ్చునది యేది? యని భావము) బుద్ధి. బుద్ధిని వెలిగించునది ఏది? (బుద్ధికి ప్రేరేపకమేది యని భావము) నేను. కనుక నీవే మేలైన వెలుగు అది "నేనే" 7

(ఇదే గురు శిష్య సంవాద రూపముననున్న "కింజ్యోతి స్తవ".... యనెడి శ్రీ శంకర భగవత్పాదుల "ఏక శ్లోకికి అనువాదము)

ద్విపద :— వెలుగేది? పవలింట వెలుగు భాస్కరుడు;

రజనినిందుడు దీపరాజియువెలుగు;
ఆవెల్గువెల్గొ? నాయక్షి యక్షికినొ?
బుద్ధివెలుంగగు బుద్ధికివెలుగొ నే; నిట్లు వివరింప నీవెగదయ్య
మేలైన వెలుగది యాలించునేనే॥

చం॥ వెలుగెదినీకు? నాకినుడువెల్గుపగల్, నిశిజంద్రదీపముల్.
వెలుగును వెల్గజేయగల వెల్గెది? కన్నగు; దానికేదియో
వెలుగదిబుద్ధి యామతికి వెల్గెది? నేను; వెలుంగునద్దినీ
వలనను, నీవె మేలయిన భానమనెన్ గురు, డద్దినేనెగా॥
ఇందాత్మయొక్క మూలకారణత్వము తెలుపబడినది.

వచనము :- అల్పబుద్ధులకు, పుత్రభార్యాదీ, సంసారముండురీతి, విద్వాంసులకు అనేక శాస్త్ర సంసారములు ధ్యానమునకు ఆటంకము నొనర్చునవియై లోపల గలవు (34). ద్విపద :-

అల్పబుద్ధులకు, దారాత్మజులట్లు। విద్వాంసులకు శాస్త్రవితతి రూపమున
సంసారములు, ధ్యానసాధనా రోధ। కంబులు లోపలగల వనేకములు॥

తే. గీ. అల్పబుద్ధులకు సుతదారాదియుక్త।
మైన సంసారముండెడు నట్లనేక
శాస్త్రసంసారముల్ ధ్యానసరణి నడ్డ।
పరచునవయి లోనుండు విద్వాంసులకును॥

వచనము :— లిపి అనగా విద్యనెఱింగిన తాను పుట్టుచోటు ఎదియని యెంచి (తెలిపి) లిపిని—అనగా-తల-వ్రాతను—లేక—కర్మను దొలగింప ద్దలంపన్ని

వాడు, లిపిని ఎఱింగి–అనగా–జ్ఞానము గలవాడైనను ఫలమేమి? అట్టివారు శబ్ద గ్రహణ యంత్ర (Gramo Phone) తుల్యులేగాని, వేరెవ్వరు? శోణేశా చెప్పుము (35). ద్విపద :- లిపి నెఱింగిన దాదెలిసి తనమూలం మెదియని కవి లిపినేరని వాడు

విపినెఱింగియును ఫలితమేమి కలదు? శబ్దగ్రహణయంత్ర సముడె శోణేశ ! ॥

ఉ॥ వ్రాతనెఱింగినందులకు వారక తా ముదయించు చోటెనో
ప్రాతిగఁ దామెఱింగి తల వ్రాతదలంగ దలంపకున్నచో
వ్రాతనెఱింగి లాభమెది? వారలు కారొకో శబ్దముద్రిణీ
ఖ్యాత విచిత్ర యంత్ర సములార య, శోణగిరీశ చెప్పుమా.॥

ఇది చదువుయొక్క సార్థక్యమును గూర్చిన హెచ్చరిక యనవచ్చును.

వచనము :– సకల వేదాంత సిద్ధాంతసారమును సంగ్రహించి చెప్పెదను వినుము. "నేను" జచ్చితానుగ వెలుగగ తానేమి మిగిలియుండు వస్తువు. 40

శ్లో॥ సర్వవేదాంత సిద్ధాంత సారం వచ్మి యథార్థతః
స్వయం మృత్వా, స్వయం భూత్వా, స్వయమేవా వశిష్యతే॥

ద్విపద :– తతవేదశీర్ష సిద్ధాంతసారంబు
సంగ్రహమ్మువచింతు జక్కగవినుము,
"నేను" చచ్చినయంతఁ దానుగా వెలుఁగ
దాన శేషించు సద్వస్తువు, వత్స॥

ఆ. వె. సంగ్రహము వచింతు సకల వేదాంత సి
ద్ధాంతసారమునకు, దాని వినుము
"నేను" జచ్చి తానుగానే భాసిల్లగ
మిగిలియుండు వస్తువగును దానె॥

ఇందలి వచనములును, రెండురకముల యనువాదములును, నన్నివిధముల "ఉన్నది నలుబది" వలెనేయున్నవి. జిజ్ఞాసులకివి మిక్కిలి ప్రీతిపాత్రములు కాగలు గుటలో సంశయము లేదు.

## ఏ కా త్మ ప ం చ క ము

మహర్షి యరవభాషలో హృదయ, సహస్రారములపై రచించి యుండిన

గ్రంథములోని మూడుపాటలకు శ్రీమతి సూరి నాగమ్మ యను భక్తురాలి కోరికపై మహర్షియే, అరవ ఛందసులో నొకటియైన 'వెణ్బా' వృత్తమున తెనుగుచేసి, యామె కోరికపైననే మఱి రెంటిని రచించి, యా మొత్తమున కేకాత్మపంచకమని పేరు పెట్టిరి. ఇవి ఆత్మయొక్క అద్వైతము తెలుపు పంచరత్నము లనవచ్చును.

వీనిలో నొండు రెండిచట నుదాహరింపబడుచున్నవి : కలివెణ్బా :-

తన్నుమఱచి తనువుతా నెతలచి। యెన్నియో జన్మము లెత్తితుదీ—దన్నుఁ

దెలిసితా నౌట పలుదేశసంచార। కల న్మేల్కొనుట కనుము చలింపక॥ 1

తానుండి తానుగ దన్నుఁదా "నే నెవ? "దేనుండు స్థానమెది?" యను-వానికి

"నేనెవ? దెక్కడ నేనున్నా? నన్నమఘు। పానుని యీడు పలుకు

చిత్తైన॥ 2

తనలో దనువుండ దాను జడమౌ। తనువం దున్నట్టు తలచు-మనుజుడు

చిత్తములో నున్నది చిత్తమున కాధార। వస్త్ర మనియెంచు వాడగున్,

వస్తువౌ॥ 3

పొన్నుకు వేఱుగ భూషణ ముండునే? తన్ను విడిచి తనువేది?—తన్ను

దనువనువా డజ్ఞుడు 'తా'నను వాడు। తనుగనిన జ్ఞాని ధరించు తన

మహిమ॥ 4

ఎప్పుడు నున్నదీ యే కాత్మ వస్తువే: యప్పుడా వస్తువు నాదిగురు—చెప్పక

చెప్పి తెలియగ జేసినా రే యెవరు। చెప్పి తెలుపుదురు చెప్పుమన

యిప్పుడా॥ 5

ఏకాత్మ తత్త్వము నిట్టిదని తేల్చి భక్తుల్। దేహాత్మ భావము దేర్చెను -

ఏకాత్మ

జ్ఞానస్వరూప రమణగురు నాథుడుతా నానతిచ్చు పంచకమందు॥

(నీ పద్యమందు)

ఇందలి భాష కడుసరళమగుటచే, భావములు స్పష్టములు, సులభసుబోధము లునై యున్నవి. శ్రీ రమణులు మొదట 'వెణ్బా' ఛందస్సులో రచించి దానినే 'కలివెణ్బా' ఛందస్సుకు తగినట్లు పూరించిరి. తమిళమందలి వెణ్బా ఛందస్సు కొంల దిగ మారినచో యది "కలివెణ్బా" ఛందస్సుగా పరిణమించును. ఈ మార్పునకు తగిన పూరణ పదములుకూడ మహర్షిచేతనేకూర్చబడినవి. రమణ భగవానులు తత్త్వముతో పాటుగ తెలుగువారికి క్రొత్తఛందస్సును కూడ ప్రసాదించిరి. ఈ వెణ్బా ఛందస్సుయొక్క లక్షణము లిచ్చట వివరించ బడుచున్నవి.

శ్రీ భగవాను లనుగ్రహించిన వెణ్బా—శుక్ల ఛందస్సు. (తెలుగు గణములు)

1. గణములు:- గల, గగ, య, ర, త, భ, జ, స, మ, న, జగ, నగ, భగ, యగ, సగ, జల, నల, భల, సల, జలల, నలల, జవ, నవ,- ఇవియే వెణ్బాలో రాదగిన గణములు.

2. బంధము :— య, జ, స, న; గల, గగ, గణములకు వెనుక వచ్చు గణము, లఘువు పూర్వమున గలదిగను, ఇతర గణముల కనంతరము వచ్చునది, గురువు పూర్వమున గలదిగను, ఉండవలయును. ఇదియే శుక్లబంధము.

అంతిమగణము మాత్రము, ల, గ, లల, లగ, లలో నొకటి, స్వయము గనో ఉకారయుక్త, క, చ, ట, త, ప, వర్గములలోని మొదటి నాల్గక్షరములు- అ, ఈ వర్ణములలో నొకటి కూడినదో రావలయును.

3. పాదములు :- 4; 3; 1; 4; 3; — గణముల గల నాల్గు పాదములు గలవు.

4. ప్రాసము :- 1, 5, 8, 9, 13 ఈ యైదు గణముకోనే ప్రాసముగనో, మొదటి మూడునొకటి, తక్కిన రెండు నొకటిగనో ఉండవచ్చును.

5. యతి :- ప్రతి పాదము మూడవ గణమున, యతి నియమమున్నది. ఎన్నిచోట్ల యతులుండినను మంచిదే.

6. వెణ్బాలోని రెండవ పాదము వలెనే నాల్గవ పాదము కూడ నున్నచో నవి "కలివెణ్బా" ఛందస్సనబడును.

రమణ మహర్షి రచించిన రెండు కీర్తనలు తత్త్వబోధకములై యున్నవి. అవి యిచ్చట తెలుపబడుచున్నవి.

1. అప్పడపు పాట :- అప్పడము లొత్తుకోని యాంతర తత్త్వమిందు తెలుపబడినది.

పల్లవి :- అప్పడమొత్తి చూడు—అది తినినప్పడె నీయాశ వీడు॥
అనుపల్లవి :— ఇప్పుడమి యందున-నేమటి తిరుగక
సద్బోధానందుడౌ సద్గురు నాథుడు
చెప్పక చెప్పెడు తత్త్వమగు, పమము
గొప్పది లేనట్టి యొకమాట చొప్పున॥

ఇందు అహంభావాభిమానములను మాషములను నేనెవ్వడనను విచార జ్ఞాన ఘట్టమున, నేను కానని పగులగొట్టి పిండిచేస్తి, సత్సంగమనెడు నల్లేరు రసము, శమ దమములను జీలకఱ్ఱ, మిరియములు, ఉపరతి యనెడి యుప్పు, సద్వాసన యనెడి

యింగువ, చేర్చి, చిత్తమనెడి రోటిలో, లోదృష్టియనెడి రోకటితో దంచి సమత యనెడి పీటపై, శాంతమనెడి కొడుపుతో (అప్పడముకొత్తు కట్టతో) నొత్తి, మౌన ముద్రయనెడి పాత్రలో జ్ఞానాగ్నిచే గ్రాగు సద్బ్రహ్మామృతమున, నేనది యనెడి యనుభవమువచ్చునట్లు ద్రేచి, తను తానె భుజింప తన్మయమగునట్టి "యప్పడమొత్తి చూడు"వని రూపకానుప్రాణితముగ నుపదేశింపబడినది. ఇవి పల్లవి, అనుపల్లవి కాక, నాలుగు చరణములు గలిగి పాడుకొనుట కనువుగానున్నది.

2. ఆత్మవిద్య (కీర్తన) :—

ఇం దాత్మతత్త్వము, దానిని తెలియుమార్గము, చక్కగా తెలుపబడినవి.

పల్లవి :— అత్యంత సులభం—ఆత్మవిద్య—అత్యంతసులభం॥

అనుపల్లవి :— అత్యల్పులకునైన హస్తామలకమును।
మిథ్యయగున ట్లతి సత్యమై కలదాత్మ॥

చరణముల సారాంశము:— (1) తాను నిత్యమైయుండియు, మిథ్యయగు తను, ధరలు, సత్యమని భావించుజీవుడు, మిథ్యాజ్ఞానమును వీడినచో స్వరూపదర్శన మగును. దానిచే దుఃఖము తొలగి సుఖ మువ్పొంగును.

(2) నేనీశరీరమనుకొనుటచే నానాభావములు వచ్చును. నేనెవ్వడనని లోపల విచారించినచో, తలపులు నశించి, తన స్వరూపము తెలియును. ఇదియే జ్ఞానము, మౌనము. ఇదియే బాయలు. ఇదియే ఆనందస్థానము.

(3) తన్నెఱుగక,మఱియేమి యెరిగినను, ప్రయోజనము లేదు. తన్నెరిగినచో నెఱుగదగినదేమియు లేదు. సర్వ జీవులలో వభిన్నమై వెలుగు, నంతరాత్మను తన్నుగా తెలియగా నహంకార నాశనము సుఖవికాసము నగును.

(4) జన్మకర్మ వినాశనమున కన్ని మార్గములకంటె నిదియె సులభము. వాఙ్మనః కాయకర్మల విరమించి నెమ్మదినున్నచో నాత్మ జ్యోతి నిత్యానుభూతమై, భీతినశించి, యానందాంబుధి నోలలాడనగును.

(5) సర్వమునకు సాక్షియు, ద్రష్టయునగు నరుణాచలాత్ముని తెలిసిన నా నందము భాసించును.

ఇట్లీ కీర్తన యైదు చరణములలో, నాత్మతత్త్వమును సుబోధ మొనరించు చున్నది.

ఇదికాక శ్రీరమణ ప్రాసంగిక పద్యములు కొన్ని యున్నవి. అందొండు రెం డిచ్చట నుదాహరించబడుచున్నవి.

## శ్రీరమణప్రాసంగికములు

1. తమ చేతిమీదుగా నొక యక్షరము వ్రాసియిమ్మని, యొక భక్తుడు కోరగా శ్రీ భగవాన్, శ్లేషార్థముతో నిట్లు వ్రాసియిచ్చిరి.

శ్లో॥ ఏక మక్షరం హృది నిరంతరం। భాసతే స్వయం లిఖ్యతే కథం?
ద్విపద॥ ఏకమై వెలుగునే హృదయమందెపుడు
ఏకమక్షరము తానెటు వ్రాయగలము?

పాఠాంతరము

ద్వి॥ ఏకమక్షరము తాహృదయమం దెపుడు
ఏకమై వెలుగునే యెటు వ్రాయగలము?

(మౌనము—లోపలనుండి లేచు ఏకాక్షర రూపమైన యనుగ్రహశక్తి స్థితి యని భావము)

2. జన్మదినోత్సవమును నిరసించుచు శ్రీ భగవాన్ వ్రాసినవి :—

వెణ్బా:— పుట్టు నాడెద్దియో పుట్టుత్సవకరుల।
పుట్టు మనకెద్దియును బుద్ధిగొని—పుట్టుక
గిట్టుకలేనిదై వెలుగు కేవలవస్తువులో।
పుట్టినదే పుటుదినంబు॥
(పుట్ట=జన్మస్థానము)

వెణ్బా:— పుట్టునాడైనను పుట్టున కేడ్వక।
పుట్టునాడుత్సవము పూనుట—గిట్టిన
పీనుగ నలంకరించి పెట్టుటని తన్నెరిగి।
యే నణగుటే జ్ఞానమే॥

3. ఆ॥ వె॥ ఇంద్రజాలికుండు నందక తా భ్రమం
బందజేయు భ్రాంతులందు భ్రమయు
సిద్ధుడన్న, తానుజెంది భ్రమంబహో
చెందజేయు భ్రమయు జీవులకును॥ (రామగీత)

4. తే॥ గీ॥ ఒడలు నశ్వరమది స్థితం బుద్ధితంబో:
కర్మవాసన విడివడఁగలయఁ గలవో:
తన్నెఱింగిన సిద్ధుడు తనువుగనడు:
గుడ్డను, మదిరామదమున గ్రుడ్డివలెను॥ (భాగవతము)

“విచార మణిమాల” యను పేరుగల విచార సాగరమను గ్రంథముయొక్క సంగ్రహరూపమున, ప్రారంభమున నున్న పద్యములు :—

ఎది సుఖ నిత్యప్రకాశమౌనేది, విభునామ, రూపాధారి।
మెదిబుద్ధి యెఱుగని దెఱుగునది నేను శుద్ధమపారము.

## పాఠాంతరము

తే॥ గీ॥ ఎద్ది సుఖము నిత్యము వెలుగెడి విభువగు
నెల్ల నామరూపాధార మెద్ది, బుద్ధి
యెఱుగనిది బుద్ధి యెఱుగువదెద్ది, శుద్ధ
మగునదేది యపారంబెది యదియె నేను॥

సుఖమై, నిత్యమై, ప్రకాశమై, వ్యాపకమై, నామరూపముల కాధారమై (మలిన బుద్ధి) యెఱుగనిదై, (నిర్మల బుద్ధి) యెఱుగునదై, శుద్ధమై, అపారమై, యేదికలదో, ఆ బ్రహ్మము నేను.

ఏనా వను మ్రింగియే కేవలమౌ। తానై నిలుచున్నది తత్పరమే.

(అహంకారము నశించగా మిగులునది యాత్మయే)

ఇట్లీ రమణ భగవత్సంబంధమగు, సాహిత్యమంతయు శాంతరసమయమై సహృదయుల కాత్మానంద సంధాయకమై యున్నది.

# శ్రీ రమణాభ్యుదయము

### కవయిత : నారు నాగనార్యులు

అరుణాచల నివాసిగా ప్రసిద్ధి చెందిన భగవానులు శ్రీమద్రమణ మహర్షుల జీవిత చరిత్రమును శ్రీ రమణాభ్యుదయమను పేర పద్యకావ్యముగ రచించిన శ్రీనారు నాగనార్య లీ శతాబ్దమునమున్న సాత్త్విక కవులలో నొకరు. వీరు కడప జిల్లాలోని కొండయ్యపల్లె నివాసులు. వైద్యవిద్వాన్ పట్టభద్రులు. వీరు 1903వ సంవత్సరమున జన్మించిరి. పదునారవయేట నుండి కవిత్వ మభ్యాసమున నుండి ముప్పదికి పైగా కృతులు వెలయించిరి. కాని యందు పెక్కు ప్రకటితములు కాలేదు. వీరి "వీరపూజ" విద్వత్పరీక్షకు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడినది. "మెచ్చుల పచ్చ ముచ్చలి" యనునది వీరి శుద్ధాంధ్ర నిర్వచన పారిజాతాపహరణ కావ్యము. తిలోత్తమా'సాహసికము, ఉషారాజ్ఞి, ఊర్వశి మొదలగునవి శృంగార రసప్రధానమైన కావ్యములు.పృథ్వీరాజవిజయము, వీరపూజ, వీరరసాత్మకములు, పరాధీన భారతము, శ్రీరామనిర్వేదము, సీతానిర్వేదము మొదలగునవి కరుణరస ప్రధాన కావ్యములు. శ్రీ రమణగీత, శ్రీ రామకృష్ణ మహోదయము, సత్యాన్వేషణ (మహాత్మాగాంధీ చరిత్రము), వేదాంత డిండిమము, ఆర్యవాణీ సాహస్రి, శ్రీహరి సాహస్రి, త్రిపుర్రా

రహస్యము, ఋభుగీత, అవధూత గీత, ఆత్మబోధ, యోగతత్త్వము, రమణ సాహిత్యోద్యోతము, అసంగానంద విజయము, భగవద్గీత మొదలగునవి శాంతిరస ప్రధానమైన ధర్మ, తత్త్వ బోధకములైన రచనలు. ఇందు కొన్నిమాత్రమే ముద్రితములైనవి. వీరు 1921 నుండి కాంగ్రెసు కార్యకర్తగా పనిచేసి మహాత్ముని మరణానంతర మిందుండి విరమించిరి. శ్రీ రమణ మహర్షితో పదునారు సంవత్సరములు సాంగత్యముచేసి శ్రీ రమణ వాఙ్మయమున పదిగ్రంథములు వెలయించిరి. అందొకటి రెండు తప్ప మిగిలినవి శ్రీ రమణాశ్రమమున నజ్ఞాతవాసములోనున్నవి. వీరు కృషిజీవనులు. ఏకాంతవాసము, శుద్ధాద్వైత తత్త్వము వీరి కత్యంత ప్రీతికరములు.

దేశభక్తి, మానవసేవ, ఆత్మోపలబ్ధి వీరి రచనలకు ముఖ్య వస్తువులు. వీరి రచనలు మొత్త మిరువదివేల పద్యములున్నవి. అందు కరుణ, శాంతరస ప్రధానమై, ధర్మ, తత్త్వ సంబంధమైనవియే యెక్కువ. అచ్చ తెలుగు రచన చేయుట యందును వీరికభిరుచి మెండు.

శ్రీ రమణాభ్యుదయమున శ్రీ రమణ మహర్షి యొక్క జీవిత చరిత్రము వివిధ దశలుగా వర్ణింపబడినది. అవి క్రమముగా అవతార దశ, అంతర్ధాన దశ, అనుష్ఠాన దశ, అనుభూతి దశ, అక్షర దశ, ఆశ్రమ దశ, అమృత దశ యనునవి. ఈ దశల నామములన్నియు 'అ'కార మాదిగా గలవిగా నుండుట యొక విశేషము.

**అవతార దశ** :- ఇందు శ్రీ రమణుల యావిర్భావము, వంశాదికము, బాల్యమున విద్యాభ్యాసము, మృత్యుభీతితో ప్రారంభమై యంతర్ముఖత్వముగా పరిణమించి, తాను జడమైన శారీరముకాక, జ్ఞాన ప్రకాశ స్వరూపుడనియు, చావులేనివాడనియు మొట్టమొదటిసారిగా నాత్మానుభూతి యప్రయత్నముగ లభించిన సంఘటనయు, పిదప కొంతకాలమునకు వారు పాఠశాలా విద్యావిషయమై విశేషశ్రద్ధ వహించుట లేదనెడి కోపముతో నన్నగారు "వానికి చదువెందు"కని తోటివారితో ననగా నదియె యుపదేశవాక్యముగా గ్రహించి, తనకా చదువనవసరమని నిశ్చయించి యరుణాచలమునకు ప్రయాణమై పోవుటయు మొత్తము నూటడెబ్బదిగద్యపద్యములలో వర్ణింపబడినది. అప్పటికి శ్రీరమణుల వయస్సు పదునేడు సంవత్సరములు.

**అంతర్ధానదశ** :- ఇందు శ్రీరమణులు స్వగృహమును, బంధు మిత్రులను వీడి యరుణాచలముచేరుట సుమారు డెబ్బది పద్యములలో వివరముగ వర్ణింపబడినది.

అనుష్ఠాన దశ :— ఇందు శ్రీరమణు లరుణాచలేశ్వరున కాత్మార్పణము గావించుకొని, సర్వసంగపరిత్యాగియై మౌనమువహించి, నివాత దీపకళికేకృతినుండి బ్రహ్మనిష్ఠానుష్ఠానము చేసిన విధానము నూట పదునాలుగు గద్యపద్యములలో రచింపబడినది.

అనుభూతిదళ :- ఇందు శ్రీ రమణు లరుణాచలమున నున్నట్లు తెలిసి వారి బంధువులువచ్చి వారిని బలాత్కారముగ తోడ్కొనిపోవ ప్రయత్నింపగా వారి కోరలు మంటలెత్తుట, పిదప శ్రీ రమణులు తమ నివాస స్థానమున సమీపమున వున్న ప్రణవాద్రి గుహకు మార్చుట, తల్లి యచ్చటకువచ్చి తనవెంట తోడ్కొని పోవ సర్వయత్నములును చేసి విఫలమగుట, శ్రీ రమణు లాత్మాపరోక్షానుభూతి నొంది విరూపాక్ష గుహయందు వసింప నారంభించుట నూటపదునాలుగు పద్యము లలో వర్ణింపబడినది.

అక్షరదళ :— ఇందు శ్రీ రమణులు తామొందిన యనుభూతిని, ఉపనిష ద్రహస్యములను జిజ్ఞాసువుల కుపదేశించుటకు పెక్కుగ్రంథముల సహరహము బఠించుటయు, విచారసంగ్రహము, వివేక చూడామణికి తమిళ గద్యానువాదము మొదలగు గ్రంథములు కడు సులభముగ సర్వజనులకును సుబోధమగునట్లు రచించుటయు, సంస్కృతాంధ్రాంగ్ల మళయాళ భాషలలో వ్రాతమూలకముగ ప్రసం గము చేయుచుండుట, కావ్యకంఠ గణపతిశాస్త్రి మహాశయుడు మొదలగు విద్వ చ్ఛిష్యులకు, తదితరులకును స్వామి యొసర్చిన దివ్య బోధలు, స్కందాశ్రమ నివాసము, మాతృదేవతలకు ముక్తినొసంగుట మొదలగు విషయములు నూట యరు వది యారు గద్యపద్యములలో రచింపబడినవి.

ఆశ్రమదళ : ఇందు శ్రీ రమణాశ్రమ స్థాపనము, వికాసము, ఆశ్రమముపై దొంగలదాడి, అప్పుడు శ్రీ రమణులు ప్రదర్శించిన స్థితప్రజ్ఞ లక్షణములు, శ్రీ రమ ణులు – "అరుణాచల మాహాత్మ్యము, ఆత్మ విజ్ఞానబోధకములగు వివిధ గీతికలు ఉపదేశసారము రచించుటయును వంశములు వివరింపబడినవి.

అమృతదళ :— ఇందు మొట్టమొదట శ్రీ రమణులు రచించిన యుపదేశ సారము (సంస్కృతము)న కాంధ్రానువాదము మాత్రముండినది.

ఈ గ్రంథ మింతవరకు శ్రీ రమణమహర్షులకు చూపబడినది.

శ్రీ రమణుల భౌతికదేహావసానానంతర మీ గ్రంథము ముద్రణమున కీయబడిన తరువాత మూడురోజులలో మిగిలిన భాగము షుమారు నూటయేబది పద్య ములలో రచింపబడి గ్రంథము పూర్తి చేయబడినది. ఈ చివరి భాగమున శ్రీ రమ ణుల దర్శింపవచ్చు పలువిధములైన భక్తుల భావములు, అనుభవములు, మహర్షి వారి నాదరించి హితబోధ చేయుచుండు విధానములు, శ్రీ రమణులమహిమ దేశవిదేశ ముల వ్యాపించుట, ఆశ్రమముయొక్క మహోత్కృష్ట స్థితిగతులు, శ్రీ శంకర

భగవత్పాదాచార్యులకు పిదప నద్వైత తత్త్వమును నిశ్శంకముగ ననుభవ పూర్వక ముగ సర్వజన సుబోధముగ బోధించిన శ్రీ రమణమహర్షి యొక్క మహిమాతిశ యము, చివరకు స్వామి చేతిపై వ్రణమురేచుట, అది నిమిత్తకారణముగ వారు భౌతిక కాయమును విసర్జించివిరాట్ స్వరూపులై ప్రకాశించుట, స్వామి దర్శన భాగ్యాభావమునకు భక్తుల విలాపము, శ్రీ రమణాభ్యుదయ గ్రంథ ఫలశ్రుతి వివరింపబడినవి.

ఈ గ్రంథమున మొత్తము తొమ్మిదివందల గద్య పద్యములు న్నవి.

ఇందలి తాత్త్విక విషయ సంగ్రహము:- ఇందవతారదశయందు శ్రీ రమణు లకు మొట్టమొదటిసారి యాకస్మికముగా నంతరాత్మానుభూతి కలిగిన ఘట్టమున మహ ర్షికి గలిగిన తత్త్వవిచారము విపులముగ తెలుపబడినది. అందా యనుభూతి తత్త్వ మసి మహావాక్యమందలి యసి పదము ప్రత్యక్షమగుట యని తెలుపబడినది.

అనుష్ఠానదశయందా మహాత్ముని సాధన విధానమును ప్రశంసిలచుచు కవి యిట్లు చెప్పెను—

కం॥ ఏనాటికైన గానీ। యే నరుడే యైనగాని యెటు లేన్ దనకుం
దానే కనుగొనవలయును। మానిత సద్వస్తు వన్యమార్గము గలదే॥

ధ్యాన నిష్ఠలోనున్న మహర్షి స్థితి యిట్లు తెలుపబడినది.

గీ॥ మనసు వోయిన దారినే మనసు దెలియ
నేరక విచేష్టితుండయి, నిలిచిపోయి
నట్టి గడియారమంబలె నట్టె తంద్రి
యంక సీమను బడియుండె నవధిలేక॥

ఇందు మహర్షియొక్క సాధనలోని వివిధ ఘట్టములు విపులముగ వర్ణింప బడినవి. అనుభూతి దశయందు స్వామి సదమలమహోపదేశము మొదలిడెనన "మది నిలుసుకడగన్న యునికి మంచి" దటంచు వ్రాసి తల్లి ముందరబెట్టెను.

అక్షరదశయందు స్వామి చేసిన బోధలు కొన్ని వివరింపబడినవి. నిద్రయం దనుదినమును సహజసుఖానుభవ మెల్లరకును కలుగుచునే యున్నదనియు, అట్టి సుఖానుభూతి నిరంతరముగ మనస్సుడిగినచో కలుగగలదనియు, అందులకు తన్ను తానెరుంగుట యవసరమనియు, దానికి "నేనెరుండ!" ననెడి యవితరైకమైన జ్ఞాన విచారమే యాద్యసాధనమనియు, జగమెల్ల కడిగి గాలించి వెదకినను వేరు మార్గము లేదనియు.

కం॥ నేనెవడనన్న విచారణ
చే నడగు మనస్సు దానిచే చెఱవుల్
బోనెట్టు పొద రగిల్చిన
దైన కొఱవి శవముగాల్చి యడగారునటుల్॥ అనియు,

గీ॥ మనస్సునకు వాక్కునకు బొందమఱలబడిన
యే పదార్థమ్మొకండు భాసించునదియె
నీవ యంచు నెఱుంగు మన్నియును నీవు
గాక యన్యమ్ము గలదె? యొకండునేని॥ యనియు,

కం॥ ఇదికాదు కాదటంచును। వదలినచో నేది మిగులు పరమావిష్కా-
రదశ యదే నుమి నేనను। నదిగూడ యదే గదయ్య యా సత్యంబే॥

యనియు, మనస్సును జయించిన ముక్తిలభించునని నిగమములు ఘోషింపు చుండ నా మనస్సును జయింపక యూరక శాస్త్రములు చదివినచో ముక్తి యెట్లు లభించుననియు, సంకల్పములే మనస్సనియు, నవిలేనిచో మనస్సనునది పేరుగా లేదనియు, అప్పుడు నిద్రయందువలె ప్రపంచమే లేదనియు, ప్రపంచము జాగ్రత్స్వప్నములందే యుండుననియు, సాలెపురుగు తనలోనుండి నూలును బయటకుతీసి మరల తనలోనికే గొను విధముగ ప్రపంచము హృదయమునుండియే దోచి మరల హృదయమందే యడగుననియు, మననడగినచో కల్పితసర్పము నశించి యధిష్ఠాన రజ్జువే శేషించెడి జ్ఞానస్థితిలోవలె జగద్భ్రాంతి నశించి యాత్మయొక్కటే భాసించు ననియు, ఆత్మనెఱిగినచో నిక నెరుగదగినదేమియు లేదనియు, నదియె జ్ఞానాజ్ఞానాత్పరమగు ప్రజ్ఞాన స్వరూపమనియు, "మనస్సాత్మయందు మునకలు పెట్టుకొలది కడకు నాశంబై నిచ్చలు నాత్మయగు" ననియు, దీనికి బలమిచ్చునది యాత్మ విచారమే యనియు, వేరు మార్గములేదనియు, సంశయము వలదనియు, ఆ సంశయ మెవరికి గలిగెనో వాడెవరో యెట్టివాడో విచారించినచో జ్ఞానపరమగు ఆనందమే శేషించుననియు, పులినోటబడి జంతువెట్లు తప్పించుకొని పోలేదో యటులే గురు కటాక్ష వీక్షణములకు నెలవైన వాడు రక్షణ పొందునేగాని మరల సంసారమున గూలడనియు, నీరీతిని మనస్సడగుటకు నమువగు పెక్కు విచారమార్గ రహస్యములను స్వామి, 'శివప్రకాశ' విభునకు లిఖితమూలముగ నుపదేశించెను.

"నే నను తలపెచ్చట నుదయించునో దానిని శోధించినచో నది యచ్చటనే లయించును. అదియే తపస్సు. జపముచేయు సమయమున మంత్రరవ మెటనుండి వెలువడునో విచారింప నందే మనస్సులయ మగును. అదియే తపస్సు-" ఇది యోంతప్రథమముగా గణపతి మునికిచ్చిన యుపదేశము. గణపతిముని స్వామి సందేశముల నన్నిటిని సంగ్రహించి రమణగీతాది గ్రంథముల రచించి స్వామి పాదముల కర్పించెను. స్వామికి "భగవద్రమణ మహర్షి" యను నామము ప్రచారమునకు దెచ్చినదీ గణపతిమునియే. రమణపంచకము నీతడే రచించెను.

మౌనవ్యాఖ్యయే విజ్ఞాన ప్రదమగు పరమోత్తమ బోధకు మార్గమైనను సామాన్య ప్రజానీకమున కది సులభ సుబోధకము కాకుండుటచే, పామరజనుల నుద్ధరించుటకై స్వామి మౌనమును విడచి వాగ్రూపమున బోధసేయ నారంభించెను. అందు మొట్టమొదట

గీ॥ అఖిలమున కాశ్రయము బ్రహ్మమ్మె మఱియు
నయ్యదే వివిధరూపములందు వెలయు
నాత్మదప్ప మఱేది లేదంచు బిండి
తార్థ ముద్బోధనము జేసె నమరవాణి।

అమృత దశయందు శ్రీరమణమహర్షి యొక్క "ఉపదేశసారము" ఈ గ్రంథకర్తచే అనువదింపబడి యందు చేర్చబడినది. అందలి ముఖ్యాంశము లీ క్రింద పొందుపరచబడుచున్నవి.

1. కర్మజడము:— దాని ఫల మీశ్వరాజ్ఞచే లభించును. ఫలకాంక్షతో జేయు కర్మ పతనహేతువై ముక్తి కవరోధము కలిగించును. ఫలాపేక్షలేక ఈశ్వరార్పిత బుద్ధితో సేయు కర్మలు హృదయశుద్ధి కారకములై ముక్తిసాధకము లగును. కాయిక పూజలకంటె వాచిక జపమును, దానికంటె మానసిక ధ్యానమును ఒకదానికంటె నొకటి శ్రేష్ఠమైనవి. ప్రపంచమంతయు పరమాత్మ స్వరూపమే యనెడి బుద్ధితో సేవించుటే యాశ్వరుని యష్టమూర్తులను సేవించుటయగును. నదీ ప్రవాహమువలెను, నాజ్యధారవలెను నిరంతరముగా సాగించునట్టి యవిరళ సరళాత్మచింతనమె వీర్యవంతమై సత్వర ఫలప్రదమగును భేదభావముకంటె సోహంభావమే పావనమైనది. భావరహిత కేవలాత్మస్థితియే యుత్తమ భక్తి హృదయ స్థానమందు మనస్సును స్వస్థమైయుంచుటే అసలైన కర్మము. అదియే భక్తి. అదియే యోగము. అదియే జ్ఞానము. ఇది నిశ్చయము. పక్షిని బంధించుటకు వలవలె ప్రాణాయామము మనోవిలయమునకు సాధనమగును. చిత్త నిరోధము - లయము వినాశమునని రెండు విధములు. లయమైన చిత్తము మరల యుదయించును. వినాశమైనచో మరల పుట్టదు. ప్రాణాయామముచే లీనమైన మనస్సు ఏకవస్తు ధ్యానముచే నశించును. అప్పుడు స్వరూపానుభవమగును. వృత్తుల మూలమును విచారించినచో మనస్సనునది లేదని తెలియును. ఇట్లుమనోవృత్తినాపుటయే సూటియైన సులభమార్గము. మనోమూల మాత్మయేనని దీనివలన తెలియును. మనోవృత్తు లహం వృత్తి నాశ్రయించి యున్నవి. కనుక నహంవృత్తియే మనోవిజృంభణకు మూలము. ఈ అహంవృత్తి యెక్కడనుంచి పుట్టుచున్నదని విచారించినచో నది యాత్మయందు లీనమై నశించును. అదియే సరియైన విచారణ పద్ధతి. అదియే జ్ఞానమార్గము. నేననెడి జీవాహంకారము నశించిన వెనుక శేషించు తాను పరిపూర్ణాఖండ పరమాత్మయే. అహంతయణగిన మిగులునది ఆత్మయే. నిద్రయం దనుభవమునకు వచ్చునదియును ఈ పరమాత్మయే. అహం పదార్ధమునకు వాచ్యార్ధము మనస్సు, జీవుడు, అహంకారము నగును. లక్ష్యార్ధము పరమాత్మయే. సోహపద తాత్పర్యమిదియే. ఆత్మను తెలుప వేరొక వస్తువు లేదు గాననదియే జ్ఞానము. అదియే చిత్తు అనగా సత్తే చిత్తు. ఉపాధి భేదమునుబట్టి

చూచినచో జీవులు వేరు వేరుగా తోచును మూలవస్తువును విచారించినచో ఏకవస్తువగు పరమాత్మయేనని తెలియును. ఉపాధిభావమును విడిచి స్వరూపము నరసినచో తాను పరమాత్మయేనని తెలియును. ఆ యనుభవము స్థిరముగా నుండుటే యాత్మనిష్ఠ. అందు జీవేశ్వర భేదముండదు. ఇది (విషయ) జ్ఞానాజ్ఞానముల కతీతమైన ప్రజ్ఞానము. అది యనిర్వాచ్యము. తన నిజమైన రూపమేదియని లోతులు విచారించినచో నది నిత్య పరిపూర్ణానందాత్మయేయని తెలియును. అతనికి బంధము లేదు. అట్టి పరమసుఖ స్థితియే ముక్తి. అహమణచుటే తపస్సు. దానిచేత లభించునదే యాత్మనిష్ఠ అదే జీవన్ముక్తి. స్వరూపాజ్ఞానమే బంధము. స్వరూపజ్ఞానమే ముక్తి. స్వరూపానుభవము సహజమైన పిమ్మట బంధముక్తుల భావమే యుండదు. ఆ స్థితి బంధముక్తులకతీతమైన యానందస్థితి. ఇది రమణోపదేశసారము.

ఇందలి కవిత్వము ధారాశుద్ధిగలిగి సరళమై శాంతరసానుగుణమై, కదళీపాకమున నున్నది. భాష లాక్షణికము జాతీయమునై తత్సమపదభరితమై యున్నను సాధారణముగ దీర్ఘ సమాసములుగాని యన్వయక్లిష్టత గాని లేక సులభ సుబోధమై యలరారుచున్నది. ఇందు రెండు తావుల మాత్రము సుదీర్ఘ సమాసభరితమైన పద్యములు, అచ్చతెనుగు పద్యములు నున్నవి. అవి యీకవి యుభయభాషల యందును పటిమగలవా డనుటకు నిదర్శనము.

సమాస భూయిష్ఠ రచనకుదాహరణము:– అవతార దశ :– పద్యసంఖ్య 158.

మ॥ అవిదం పూర్వకఠోర భూరి వచనంబా! కాదు, కాదద్ది! ప్రా
క్తన కాలాంతర పుణ్యపాకవశ సంద ర్భానుసారైక ల
బ్ధ నిరూఢోగ్ర వచోభిభూత భృశహృత్పం కేజ మధ్యస్థలీ
విని పాతాళుగ తీవ్ర పీడిత హఠాద్విస్ఫీత చేతస్కుడై॥

అచ్చ తెలుగు రచనకుదాహరణము:— అక్షరదశ:– పద్యసంఖ్య 29.

కం॥ తలపు బయలుబ్బనీయక। విలువు కొనందొల్లి పెంకి నేనను తలపుం
బలు దీరముడుగు నెల్లడ। వెలుగొందిన తాను నిల్చు విరివిగ నెపుడున్॥

గీ॥ పలువచదువరి మదులకు గలవరింత
తెలువువారల బావట నిలువునీడ
వలువ చెలువకు జనమాల బలువురాయి
చిలువ తాల్పరి పింపాది కొరావు కాడు॥

ఇందలి వచనములును శబ్దాలంకార భూయిష్ఠములై యింపు గొలుపుచున్నవి.

ఉదా:— అనుష్ఠానదశ 40. ॥వ॥ అట్టి విశిష్టవంశ ప్రవిష్టుడగు వేంకట రాముం
దప్పట్టున నిట్టిలవుం బట్టుదలఁ బైడిగట్టుంబోలె దిట్టండయి కన్పట్టు నెడ॥

మొత్తముమీద నీగ్రంథము తత్త్వవిషయమును విసుగు పుట్టింపకుండ బోధించు నేర్పీకవికి గలదని నిరూపించునదై యుత్తమశ్రేణికిజెందిన తత్త్వకావ్యములలో జేర్పదగియున్నది.

# ఆంధ్ర రమణగీత

రచయిత :- నారు నాగనార్య

శ్రీ రమణమహర్షి బోధలను కొన్నింటిని కావ్యకంఠ గణపతి శాస్త్రి మహోదయుడు సంస్కృతమున 'శ్రీ రమణగీత' యనుపేర శ్లోకరూపమున రచించెను. శ్రీమద్భగవద్గీతలో వలె దీనియందును పదునెనిమిది అధ్యాయములున్నవి. ప్రతి అధ్యాయము చివరను శ్రీ మద్భగవద్గీతలోవలెనే యిది బ్రహ్మవిద్యయనియు, యోగ శాస్త్రమనియు చెప్పబడినది. ఇందలి అధ్యాయములన్నియు శ్రీ రమణమహర్షి యుపదేశములేయైనను అవియన్నియు ఏకకాలమున ఒకే వ్యక్తికి ఉపదేశింపబడినవికాక, వివిధ సమయములలో, వివిధ వ్యక్తులడిగిన ప్రశ్నలకు సమాధానములుగా నొసగబడినవి. వీనినన్నిటిని (మూల) గ్రంథరూపమున గూర్చిన శ్రీ గణపతిశాస్త్రి మహోదయుడు శ్రీరమణ మహర్షియొక్క ముఖ్యశిష్యులలో నొకడు. అసాధారణ ప్రతిభావంతుడు, అఖండ పాండితీ మండితుడు. మహాతపస్వి. మహావక్త. "వాసిష్ఠ గణపతిముని" యని ప్రసిద్ధికెక్కినవాడు. విద్యాభ్యాస కాలముననే నవద్వీపమున తన అఖండ ప్రతిభా ప్రదర్శనముచే "కావ్యకంఠ" బిరుదము నొందినవాడు. శ్రీ రమణమహర్షి నామమును ప్రచారమునకు తెచ్చినవాడితడే. శ్రీరమణమహర్షి యనుగ్రహమున 'ఉమాసహస్రము' మొదలగు బృహద్గ్రంథములను రచించిన మహామనీషి.

శ్రీ రమణగీతను 'ఆంధ్రరమణగీత' యనుపేర ఆంధ్ర పద్యరూపమున అనువదించిన శ్రీ నారు నాగనార్యుడును శ్రీ రమణ మహర్షి భక్తుడే. ఇతనిని గూర్చిన వివరములు 'శ్రీరమణాభ్యుదయము' గూర్చి వ్రాయబడినచోటనున్నవి.

ఈ గ్రంథము 1936 సంవత్సర ప్రాంతమున శ్రీ మహర్షియొక్క షష్టిపూర్త్యుత్సవ సందర్భమున మహర్షికే అంకితము గావింపబడి శ్రీ రమణాశ్రమము వారిచేతనే ప్రచురింపబడినది.

విషయ సంగ్రహము :- ప్రథమాధ్యాయమున ముక్తిసాధనకు మార్గములు, స్థితప్రజ్ఞుని గూర్చిన విషయములు, సమాధిని గూర్చిన విషయములు తెలుపబడినవి.

ద్వితీయాధ్యాయమున ఆత్మానుభూతినొందుట కనువగు మార్గత్రయము వివరింపబడినది. తృతీయాధ్యాయమున ముఖ్యకర్తవ్య నిరూపణము చేయబడినది. చతుర్థాధ్యాయమున జ్ఞానస్వరూప కథనము, పంచమాధ్యాయమున హృదయవిద్య, వివరింపబడినది.

షష్ఠాధ్యాయమున మనోనిగ్రహోపాయములు తెలుపబడినవి.

సప్తమాధ్యాయమున ఆత్మవిచార పద్ధతి, తరంగనిరూపణము, తదధికారి, తత్ఫలము అను విషయములు వివరింపబడినవి.

